# ప్రతివారికి రక్షణ కావాలి




ఈ రక్షణ బాక్టీరియానుండి, చెమట
వాసననుండి—మీరు, ఇతరులు
సంకోచపడే అవస్థనుండి—
జి–11 (హెక్సాక్లోరోఫిన్)తో
కూడిన
సింథాల్ టాయిలెట్ పౌడరు
మీకే రక్షణలన్నీ ఇస్తుంది.

ఇవేకాదు–సువాసన
సుమసుగంధము

సింథాల్—
దుర్గంధములనుండి
సంపూర్ణ రక్షణనిచ్చు
టాయిలెట్ పౌడరు

Interpub/GP/5 Tel

# ఉత్తరాలు

## బి. బి. సి. వ్యవహారం

భారత దేశాన్ని 'అసహ్యంగా' చూపించే చిత్రాలని టెలివిషన్‌మీద ప్రదర్శించినదని 'బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్'మీద భారత ప్రభుత్వం 'చర్య' తీసుకున్నదని వార్తలు వెలువడ్డాయి! [ఈ చిత్రాలని తీసిన వ్యక్తి ఒక ప్రముఖ ఫ్రెంచి దర్శకుడు. అతని మీద కూడా భారతదేశం అధికార వర్గంవారు చర్య తీసుకుంటారేమో తెలియదు.]

ఇది అంత వివేకవంతమయిన పనిగా తోచదు. భారతదేశంలో కావలసినంత జుగుప్సాకరమయిన వాతావరణం ఉంది. దీనిని బాగు పరచటానికి ప్రయత్నం చేబదులు ఎవరో ఎక్కడో ఏదోచేశారని ప్రయోజన శూన్యమయిన 'చర్య'లు తీసుకుని లాభంఏమిటి?

బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ [బి.బి.సి.] లో హెరాల్డ్ విల్సన్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ఆయన గృహ జీవితాన్ని కూడా హేళనచేసే కార్యక్రమాలు ప్రదర్శించారు. అవి శ్రీ విల్సన్‌కి తప్పకుండా కోపం తెప్పించి ఉంటాయి కాని ఆయన బి. బి. సి. ని బహిష్కరించాలని చూశారా?

'నిజం చెప్తే నిష్ఠూరం అంటారు' అయితే ఈ నిష్ఠూరం ఒక దిక్కులోనే ప్రయోగింపబడుతున్నట్లు కనిపిస్తుంది. రష్యానుంచి వెలువడే రేడియో ప్రసారాలు కొన్నిటి విషయములో మన ప్రభుత్వం అవలంబిస్తున్న సిరవవు విధానం అర్థంకాదు.

—ఒక పాఠకుడు [మదరాసు]

## 'షన్'ల వ్యాపారం

'షన్'ల అమ్మకం బి. బి. సి. ప్రచారం మొదలయినది వార్తలలోకి ఇంత ఎక్కుతున్నాయంటే ఒక విషయం బాగా స్ఫురిస్తుంది—ఇంట గెలవలేక రచ్చ గెలవటానికి కొందరు ప్రయత్నిస్తున్నారు అని'

కె. కె. రామలింగం [విజయవాడ.]

## బ్యాంగ్ సాంలు

లాయరమ్మరీదేవిగారి 'అభ్యాంయిలా — అమ్మాయిలా తగ్గండి' చదివాక, యీ లేఖ వ్రాయ బుద్ధయింది. వీరు జాతి లక్షణం కొద్దీ, పురుషుల్ని మరీ 'అన్యాయంగా' విమర్శించారు! మగవాళ్ళు పొడ వ్రాసుకుంటే తప్పన్నారు. అసలు పౌడరుకి మగ ఆడ ఏమిటి? ఎవరు చర్మ సౌందర్యం కోరుతారో వారు వ్రాసుకుంటారు గానీ, స్నోలూ, పౌడర్లూ ఆడవారికే, అనటం అర్థం లేనిమాట! ఇక, ఆరంగుళాల దువ్వెన—మగవారి జుట్టు పొట్టి, గాలికి త్వరగా రేగిపోయే అవకాశముంది, కాబట్టి దువ్వెన వాడతారు—బజార్లోనయినా వీరికి దువ్వకోవటానికి పట్టే సమయం కేవలం అరనిముషం! పోనీ, ఆడవాళ్లనీ తిరిగ్గా బజార్లో చదికిలబడి జడలు వేసుకోమనండి, ఎవరొద్దన్నారు? వాళ్ళు కాలేజీ మూవ య్యేవర్నీ అడ్డేసుకొచ్చి, అందరు మగాళ్ళనీ దుమ్మెత్తటం ఏం న్యాయం? మగాళ్ళకి పౌడరు భోజనం కన్నా అవసరమా! ఆడ పిల్లల్ని వంటరిగా వదిలేస్తే, వానరుల కన్నా కనాక్ష్యంగా మగవాళ్లకి పేర్లుపెట్టి ఏడిపిస్తా

# ఉత్తరాలు

పించుకోవటం వారి హృదయ సంస్కారానికి నిదర్శనం
ధించిన విషయం!

పి. వి. ఆర్. కృష్ణమోహన్, శివకుమార్ బృందం
[విజయవాడ]

*    *    *

బాలసరస్వతీదేవిగారి వ్యాసం చాలా బాగుంది. నేటి నవ నాగరికతలో అబ్బాయిల పిచ్చి ఫ్యాషన్ల కంటే అమ్మాయిల వెర్రులు శ్రుతిమించి రాగాన పడ్డాయి. 'పొరుగింటి పుల్లగూర రుచి' యన్నట్లు విదేశాల నాగరికతను మనవాళ్ళు అనుకరిస్తున్నందువల్ల ఈ వెర్రి వేషాలు వస్తున్నవి.

వ్యర్థ సుబ్బరాయుడు, [కడప]

## కథలు

వచ్చి వెళ్ళిన వాళ్ళని ధైర్యంగా వెళ్ళడమన్నా వ్రాసిన కథలు 'విలువు—తెలువు' వోడిపోయిన వాళ్ళు' చాల బాగున్నాయి.

'దీపావళి కథల పోటీ' లోని సరికొత్త పద్ధతులు, కథలు మనమూ పంపించుదామనే ఆశని రేకెత్తించేవిగా ఉన్నాయి.

ఉత్తరాల శీర్షికకు మరొక పేజీకూడా కేటాయించి, నాలాంటి అల్ప సంతోషులకి తృప్తి కలిగించ ప్రార్థన.  జి. పుష్పలత సంత్రగచి [ప. బె.]

## ఆకాశవాణి కబుర్లు

"ఆకాశవాణి కబుర్లు" చదివిన తర్వాత ఈ ఉత్తరం వ్రాయడానికి సాహసిస్తున్నాను. తెలుగు కార్యక్రమం ప్రసారమవుతున్న రేడియో దగ్గర ఎవరూ పట్టుమని పదినిమిషాలు కూర్చోలేక పోతున్నారు అని వ్రాశారు ఆకాశరాజు. ఈమాట నవమాసాలు మోసి కని పెంచిన తల్లి కడుపుమీదనే గుద్దినట్లుంది. కార్యక్రమాలలో జీవము, సహజత్వం లోపిస్తున్నాయి అన్నారు. ఒక్క కార్మికుల కార్యక్రమంలో ఆమాట నిజమే ననిపిస్తుంది. కాదనను. వివిధ రకాలైన కార్మికులు పాల్గొనే కార్యక్రమం అది.

శ్రోతల కోరికపైన చిత్రసీమ కాలం గడువు పొడిగించ బడింది. ప్రతిరోజూ ఈవిధంగా పాటలు వినిపించాలంటే వేసిన పాట వేయక తప్పదు. క్రొత్త, పాత, మంచివి, చెడ్డవి, పాటలుకూడా వినాల్సొస్తుంది. ఇక పాటలు బాగలేవంటే దానికి చిత్రనిర్మాతలు బాధ్యులు. ఆకాశవాణిని విమర్శించకుండా ప్రతిరోజూ ప్రసారమయిన ప్రతికార్యక్రమం విని అన్నిటిమీద మంచి చెడ్డలను గురించి సమీక్షగా వ్రాసి పాఠకలోకానికి అందిస్తే బాగుంటుందని నా అభిప్రాయం.

—జి. సుశీలా రమణ [ఆత్మకూరు].

## గమనిక

19వ పేజీలోని డాక్టర్ కబుర్లు శీర్షికను 'వాళి పరిగ్గా వుండాలంటే...' అని గమనించ కోర్తాము. —సం!


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 11—9—'70
(శ్రీసాధారణనామ సం॥ భాద్రపద మా॥ శుద్ధ దశమి)

సంపుటము: 64  సంచిక: 2

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: గ్రహద్విసీ...
ఫోటో: ...భాకర్


బెంగాలులో మార్క్సిస్టుల పునరాగమన భయం
భయకంపితులవడానికి కారణం!
పోలీసు


మిమ్మల్ని వత్లె నమ్మను
కేరళలో రెట్టింపు అయిన పార్టీలు


భారతదేశపు తాజా ఎగుమతి
కేరళ ఆడపిల్లలు


కమ్యూనిస్టుల మాటేమిటి?
మతోన్మాద పార్టీలను రద్దు చేసే పథకం

# కాంగ్రెసు చీలికవల్ల దేశానికి నష్టం

ఢిల్లీకి కూడా వచ్చేసింది భూమ్యాక్రమణ. భూమి చోరులకి లాఠీలతో స్వాగతం ఇచ్చిన భూస్వాములు, 'ముందు మీ భూములని పంచ'మన్నారు.

ఒక భూమ్యాక్రమణదారుడు 600 ఎకరాలు కల పెద్ద మనిషి. అవన్నీ తమ తండ్రిగారివి కాబట్టి వాటిమీద తమకి అధికారం ఏమీ లేదన్నారు., వారి తండ్రిగారు తమమాట వినరుట. ఏది ఎలాగ ఉన్నప్పటికీ ఢిల్లీలో ఈ మహోద్యమం అంత ఘనంగా సాగినటు కనిపించదు. మరునాడు ఆక్రమణదారులు ప్రధానమంత్రి పొలంమీద పడపోయారు. అక్కడ వారికి పోలీసుదళం స్వాగతం ఇచ్చింది ఇద్దరు కీర్తి కండూతికల పార్లమెంటు సభ్యులతో సహా మొత్తం నలభయిమందీని ఎరెస్టు చేశారు.

## పంజాబుసంగతి ఏమిటి ?

శ్రీ డాంగేగాని, జార్జిఫెర్నాండెస్‌గాని పంజాబులో తమ ఉద్యమాన్ని మొదలు పెట్టకపోవడం ఆశ్చర్యంగానే ఉంటుంది. పంజాబీ భూస్వాములు మాత్రం, తమ భూములని ఆక్రమించే వారికి తుపాకులతో స్వాగతం చెప్తా'మన్నారు. పంజాబుని వదిలివేసి శ్రీ డాంగే ఈ దేశ ప్రజలకి ఒక ముఖ్యమయిన అవకాశం కలుగకుండా చేశారు. పంజాబీ వారు ఎప్పటిలాగే డంబాలు పలికారో లేక భారత దేశంలో మారణ హోమం ఒకటి జరిగి ఉండేదో తెలుసుకునే అవకాశం లేకుండా చేశారు.

ఇక శ్రీ డాంగే గారి సంగతి— తమ ఎరెస్టుని రద్దు చేసుకొనటానికి ఆయన సుప్రీమ్‌కోర్టు సహాయం తీసుకుని తమని తామే అవమాన పరుచుకున్నారు. ఆరునెలల్ క్రితం వారు న్యాయస్థానాలనీ న్యాయాధిపతులనీ రద్దు చెయ్యాలనీ అనేవారు.

సుప్రీమ్‌కోర్టులో శ్రీ డాంగే తమని సీతాపూర్ జెయిలులో నిర్బంధించటం చట్టం ప్రకారం చెల్లదని వాదించారు.

సుప్రీమ్‌కోర్టుకి శ్రీ డాంగే సమర్పించుకున్న వినతిపత్రంతోబాటు ఆయన ఒక ప్రకటన కూడా చేర్చారు. అందులో ఇలాగ ఉంది— 'కొన్ని లక్షల ఎకరాల విస్తృతికల వ్యవసాయభూమిని కొందరు భూస్వాములు, మానోపలిస్టులు, కంపెనీలు లోబరుచు కొనటం జరిగింది. సమాజానికి చెందిన ఈ వస్తు సంపద యాజమాన్యం కొందరికి లోనవటం చేత ప్రజలకీ, దేశానికీ నష్టం కలుగుతోంది

'రాజ్యాంగంలో విధానాలని నిర్ణయించే కొన్ని సిద్ధాంతాలకీ. అందులోనూ అంశం 30కి ఈ పరిణామాలు విరుద్ధంగా ఉన్నాయి......'

## పౌరుల బాధ్యత

'రాజ్యాంగంలో ఇమిడిఉన్న శాసనాలనీ, లక్ష్యాలనీ అమలు పరచలేకపోయింది ప్రభుత్వం, అందు చేత వాటిని అమలుపరిచే బాధ్యతని తామే తీసుకొనటం అందరి పౌరుల కర్తవ్యం. శాసనాలూ, ప్రభుత్వాలూ అపజయం పొందినప్పుడు సర్వాధికారాలూ కల ప్రజలే కొందరు భూస్వాములు, లక్షాధికారులు నాశనం చేస్తున్న రాజ్యాంగ సిద్ధాంతాలనీ, ప్రజాజీవితాన్నీ రక్షించవలసి వస్తుంది.'

శ్రీ డాంగే శాంతి భద్రతల నాశనాన్ని కోరేవారిలో ప్రథములనతగినవారు. అటువంటి వ్యక్తి తమకి వచ్చినప్పుడు రాజ్యాంగం శరణు కోరుతున్నారు లెనిన్ కాలంనుంచీ కమ్యూనిస్టులు రాజ్యాంగ బద్ధమయిన సాధనాల ద్వారా రాజ్యాంగాలనే నాశనం చేస్తూ వచ్చారు.

నేను జమీందార్ల మనిషినీ కాను, బిర్లా ఏజెంటునీ కాను కాని శ్రీ డాంగే కోరుకున్నవన్నీ జరిగితే భారతదేశంలో కమ్యూనిస్టు పాలన తప్పదు.

రష్యాలో ఉన్న మౌలిక హక్కులు ఏవి?

## పితృదేశం పరిస్థితి

మానోపలీలని గురించి మాట్లాడతారు శ్రీడాంగే. వారి పితృదేశమయిన రష్యాలో రాజకీయ, ఆర్థిక గృహాధికారాలు కూడా క్రెమ్లిన్ చేతుల్లోనే ఉన్నాయి కదా? ఇది మానోపలీ కాదా?

రష్యాలో భూమిఅంతా ప్రజలదే అంటారు. అంటే, భూమి అంతా ప్రభుత్వానిదే అన్నమాట. దీనివల్ల అభివృద్ధి అధికంగా ఉందా? లేదనే సంగతి అందరికీ తెలుసు. కొంతకాలంగా రష్యా ఆహార ధాన్యాలని దిగుమతి చేస్తూ ఉంది. పళ్ళు, కూర గాయలు, మాంసం మొదలయిన ఆహారవస్తువుల కొరత అలాగే ఉంది.

భారతదేశం ఆహారధాన్యాల ఉత్పత్తిలో మంచి అభివృద్ధి సాధిస్తోంది. ఈ సమయంలో శ్రీ డాంగే భారతదేశాన్ని రష్యా చేతుల్లోకి తోసి ఇక్కడా కొరతలు తెలిసేట్లు చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. [భారతదేశం ఆహారధాన్యాలలో అభివృద్ధి సాధించిన దంటే అది చాలావరకు అమెరికా సహాయం వల్లనే అని గుర్తించాలి.]

## ప్రభుత్వ భవనాలు

సాగుబడి కాని భూములు పెద్ద భూస్వాములవే అయి ఉండనవసరం లేదు. కొన్ని ప్రభుత్వ భవనాల చుట్టూ ఎంతో కాళీస్థలం ఉంటుంది ఈ స్థలాల చుట్టూ ఏదో ఒక రకం కంచె లేక గోడ ఉన్నప్పటికీ అవి ఆక్రమణదారులకి ఆశ పుట్టించేవిగానే ఉంటాయి. ఆస్తులులేని కార్మికవర్గం వారికి ఏ కాళీస్థలం అయితే ఏమిటి ఆక్రమించటానికి? ఉదాహరణకి—శ్రీ వి. వి. గారికీ, ఆయన సతీమణిగారికీ నివసించటానికి ఎన్ని గదులు కావాలి? అసలు ఉప రాష్ట్రపతిగా ఉండేప్పుడు శ్రీయుతులు గిరి దంపతులు చిన్న ఇంట్లోనే ఉండేవారు. శ్రీ ఫెర్నాండెస్ గారి భూమి—ఆక్రమణ ఉద్యమం ఇంతదాకా ప్రభుత్వ భవనాల ద్వారా వ్యాపించలేదు.

అయితే శ్రీ డాంగే గారిని గురించి ఒకమాట చెప్పుకోవాలి. మొదటి నుంచీ ఆయన తమపార్టీ మద్దత్తు శ్రీమతి గాంధిగారికి కొన్ని షరతులమీద మాత్రమే లభిస్తుందని స్పష్టంగా చెప్తూ వచ్చారు. మేడమ్ గాంధి తమ 'ఆజ్ఞానుసారం నడుచుకోవాలనేది మొదటి షరతు మేడమ్ ఇందిరాగాంధి విధానాలని తాము ఏ విధంగా నడిపించుకుంటూ వచ్చారో అన్న విషయమయి ఆయన ఎప్పుడూ ఏ దాపరికమూ ఉంచలేదు. రయిల్వే బడ్జటుని చర్చించే ముందే శ్రీ డాంగే దానిని మార్పించారు. మూడవ 'పే కమీషన్' [జీతభత్యాల సంఘం] నిర్మాణం, దానికి మూలాధారాలనబడే సిద్ధాంతాలు శ్రీ డాంగే చెప్పిన పద్ధతిలోనే జరిగాయి.

## డాంగే - గాంధీ

శ్రీ డాంగే, మేడమ్ ఇందిరాగాంధిల దృక్పథాలు వేరు. ప్రధానమంత్రిగారు భూమి ఆక్రమణ ప్రజాస్వామ్యానికీ, రాజ్యాంగానికీ విరుద్ధం అని స్పష్టంగా చెప్పారు. శ్రీ డాంగే అభిప్రాయాలు వేరు. అయితే, శ్రీ డాంగే గారికి రాజ్యాంగం అన్నా, ప్రజాస్వామ్యం అన్నా నమ్మకం లేదు. సుప్రీమ్ కోర్టుని వంచించటం ఆయన ఉద్దేశాలలో ఒకటి.

ఉత్తరప్రదేశ్‌లో పాత కాంగ్రెసు ప్రభుత్వాన్ని పడగొట్టటానికి మేడమ్‌గాంధిగారు శ్రీ చరణసింగ్ స్నేహం చేసి, కాంగ్రెసు ప్రభుత్వాన్ని పడగొట్టి 'కాంగ్రెసేతర' ప్రభుత్వాన్ని నెలకొల్పారు కొత్త కాంగ్రెసు—భా. క్రాం. ద. వారు కలుస్తారన్న వార్తలు వెలువడ్డాయి. ఇది జరగలేదు. స్వయంగా శ్రీ చరణసింగ్ ఉ. ప్ర.లో కొత్తకాంగ్రెసుని నాశనం చేస్తున్నారని ఎందరో అనుకుంటున్నారు. పండిత కమలాపతి త్రిపాఠీ ఒకప్పుడు ఉ. ప్ర.లో ఉపముఖ్యమంత్రి. నేడు ఆయన ఒక అతి సాధారణమయిన

మంత్రి, ఇంచుమించు పూజ్యమయిన అధికారం కల వాడు.

## గుప్త-సింగ్

ఇదంతా మేడమ్ గాంధిగారికి గుణపాఠం కావాలి. శ్రీ చంద్రభానుగుప్తకి కాంగ్రెసుపార్టీ పట్ల ఉన్న విశ్వాసం శ్రీ చరణసింగ్‌కి లేదు. అలాగే శ్రీ డాంగేకి ఆమెపట్ల విశ్వాసాభిమానాలు ఏవీ లేవు. అధికారంలో ఉండేందుకు మేడమ్‌గాంధి తమని వాడుకుంటున్నదని ఆయనకి బాగా తెలుసు. అందుకనే వీలయినప్పుడెల్లా ఆమెని అవమానపరిచి, ఇబ్బంది పెడుతూనే ఉన్నారు. భూమి లేనివారికి భూమి ఇప్పించేందుకు ఎన్నో మార్గాలున్నాయి, భూమ్యాక్రమణ ఉద్యమం ఒకటే కాదు. ప్రధాన మంత్రితో శ్రీ డాంగే శాసనసంస్కరణలని ఎన్నిటినో చర్చించి ఉండవచ్చు.

ఒకవాడు హటాత్తుగా శ్రీ డాంగే భూమి ఆక్రమణ ఉద్యమాన్ని ప్రారంభిస్తున్నట్లు ప్రకటించారు. దీనికి వంత పాడిన వారిలో ప్రథములు యువ తురుష్కులు. వీరంతా నిమ్నవర్గాల ప్రతినిధులు కాబోలు ఎంతో గట్టిగా మాట్లాడుతున్నారు. ఈ యువతురుష్కులందరూ రాజ్యసభకి చెందినవారే కమ్యూనిస్టులతో చేరి ప్రధానమంత్రికి ఇబ్బందులు కలిగిస్తున్నారు.

ప్రధానమంత్రి ఈ నలుగురినీ లోకసభ ఎన్నికలో పోటీ చెయ్యమని చెప్తే బాగుంటుంది. వారికి డిపాజిట్లు దక్కుతాయా అన్నది పెద్ద ప్రశ్న. పురోగమనవాది శ్రీ మాలవీయా రెండుసార్లు వోడిపోవటం గమనించతగ్గ విషయం.

## ఉద్యమమా? అపాయమా?

భూమ్యాక్రమణ ఉద్యమం బీదవారిమీద సానుభూతితోగాని, నిరుద్యోగులమీద జాలివడిగాని మొదలు పెట్టినది కాదు. అది కేవలం కులమతాలు ముఖ్యమయిన ఒక సమాజంలో కొన్ని అవకాశాలు కల్పించుకొనటానికి కొందరు వాడుతున్న ఒక ఉపాయం. ఏమీలేనివారికి ఆస్తులు పంచుతామన్న ప్రతి ఉద్యమమూ కొందరికి ఆకర్షణీయంగానే ఉంటుంది. దానివల్ల ఏర్పడేది అరాజకమూ, అల్లకల్లోలమూ మాత్రమే. ఇవి రెండూ కోరుతారు. శ్రీయుతులు డాంగే, కె. డి. మాలవీయాలు. అరాజకంలో శ్రీ డాంగే అధికారం చేజిక్కించుకొనగలరు. మేడమ్ ఇందిరాగాంధికి ఇది తెలుసు. కాని తమ పదవిని నిలుపుకుందామనుకునే ఏక ధ్యానలో దేశ శ్రేయస్సుని అశ్రద్ధ చేస్తున్నారు.

కమ్యూనిజమ్ భారతదేశానికి వస్తే దాని బాధ్యత శ్రీ మొరార్జీదేశాయి కూడా వహించవలసి వస్తుంది. ఆయన పార్టీ పనీ చెయ్యటంలేదు, ఎవరికీ పనికిరావటం లేదు. పార్లమెంటు లోపలగాని బయటగాని ఈ పార్టీ ఏ విధమయిన నిర్మాణాత్మక కృషి చెయ్యటంలేదు.

ఒక్క మదరాసులో తప్ప పాతకాంగ్రెసు మరెక్కడా పని చెయ్యటంలేదు. గుజరాత్‌లో శ్రీమొరార్జీదేశాయికి పాత పలుకుబడి లేదు. మయిసూరు పరిస్థితి అంతంతగానే ఉంది.

## నాయకుల కర్తవ్యం

కమ్యూనిస్టులని వ్యతిరేకించే అయిక్యమండలి

సిద్ధాంతాల ... కావటంవల్ల కలిసొస్తుంది. పాత కాంగ్రెసు నాయకులు రాజకీయాల్ని ఎరిగినవారు. మేడమ్ గాంధికన్నా వారి బాధ్యత అధికం. ఆమె పదవిని వదలటంలేదు. వీరు దేనిని వదలటం లేదు?

భారతదేశంలో ప్రజాస్వామ్యం నశిస్తుంది అంటారు. ఎందువేత నశిస్తుంది? పదవుల నాయకత్వం ... ●

# పాశ్చాత్య సంగీతంలో నల్లవారు

350 సంవత్సరాలుగా పాశ్చాత్య అభిజాత్య సంగీత రంగంలో నల్ల వారికి చోటు లేకపోయింది. 1950 ప్రాంతంనుంచి పరిస్థితి కొంత మారుతోంది. నేడు తెల్లవారి పాత్రల నయినా నల్లవారే వేస్తున్నారు. ఈ వ్యాసంలో లిన్‌ప్రయిస్ కొందరు నీగ్రో సంగీత విద్వాంసులని గురించి చెప్తారు...

పాశ్చాత్యదేశాలలో నీగ్రోల లేక నల్ల వారి పాత్ర ఇంచుమించు జాజ్ రకం సంగీతానికే పరిమితం అయి ఉంటూ వచ్చింది — మొన్న మొన్నటి దాకా. అభిజాత్య (క్లాసికల్) సంగీతంలో నల్ల వారికి పాత్రలు ఉన్నప్పటికీ వాటిని తెల్ల వారే పాడే పద్ధతి పాతుకుపోయింది.

తెల్లవారు రాసిన సుప్రసిద్ధ సంగీత నాటకాలలో నల్ల పాత్రలు కొన్ని — వెర్డి సృష్టించిన 'అయీడా' ఇథియోపియన్ వనిత, అయి ఉండవచ్చు (లేదా సోమాలీ అయి ఉండవచ్చు); ఒథెల్లో మూరిష్‌వాడు (ఇటీవల ప్రధానమంత్రి మేడమ్ గాంధి వెళ్లి వచ్చిన దేశం...); బిజే వల్ల లోకప్రసిద్ధమయిన 'జిప్సీ' వనిత కార్మెన్ ఉత్తర ఆఫ్రికాకి చెందినది. ఈ పాత్ర లన్నిటినీ తెల్లవారే పోషించేవారు.

1955 లో పెద్ద మార్పు ఒకటి వచ్చింది. మేరియన్ ఏండర్సన్ అనే నీగ్రో గాయకురాలు న్యూయార్క్ మెట్రోపొలిటన్ ఆపెరాలో వెర్డి రాసిన ఒక సంగీత నాటకంలో ఒక పాత్ర వేసింది. 'నూరేళ్ల కొకసారి వినిపించే అపూర్వమయిన కంఠం' అన్నాడు టోస్కానినీ ఆమె గురించి మాట్లాడుతూ. కాని, అప్పటికే మేరియన్ వయసు 53. నల్ల మనిషి పయికి రావాలంటే అమెరికాలో తేలిక కాదు.

1955లోనే ఆటో ప్రెమింగర్ 'కార్మెన్ జోన్స్' అనే సినిమా తీశాడు. అది బిజే రాసిన 'కార్మెన్'కి అనుసరణ. ఈ సినిమాలో వేసిన వారందరూ నీగ్రోలే — డోరోతీ డాండ్రిడ్జ్, హారీ బెలాఫోంటి, పెర్ల్ బెయిలీ...

నేడు నీగ్రో గాయకురాళ్లలో మొదటి స్థానం లియోంటిన్ ప్రయిస్ అనే మిసిసిపీ నీగ్రో వనితది. ఆమె వయసు 43. అయితే నేటి పరిస్థితి ఎలా



ఈ తారపేరు షెర్లీ గిన్స్. చిత్రంలో పాత్ర 'గోల్డెన్ శాక్రెల్' అనే సంగీత నాటకానికి చెందినది.

ఉందంటే ఆమెకి పోటీ కూడా వస్తోంది!

వీరిలో చెప్పుకోదగ్గ వనిత మార్టినా అ్రోయో ఈమె నాజీ సంఘసేవిక.



'డాని కార్లోస్'లో గ్రేస్‌బంబ్రీ.

చిన్నప్పటినుంచీ చర్చిలో పాడి తరిఫీదు పొందింది. ఒకసారి అనుకోకుండా న్యూయార్కులో ఒకచోట 'ఆయీదా' పాత్ర వెయ్యవలసివచ్చి (కథలలోలాగ), కీర్తి సంపాదించుకుంది!

మరొక అమ్మాయి షర్లీ వెర్రెట్. ఈమె తండ్రి ఒక తాపీ మనిషి. ఒక టెలివిషన్ పోటీలో నెగ్గిన షర్లీ వెర్రెట్. మార్టీనా అ్రోయో వలెనే, నేడు లండన్‌లో మంచి పేరు సంపాదించుకుంటోంది.

పాశ్చాత్య ప్రపంచంలో నల్లవారు సంగీతంలో పయికి రావటం కష్టం అని ఇద్దరూ ఒప్పుకుంటారు.

'మాకందరికీ మార్గదర్శిని లెయొంటీన్ ప్రయిస్' అంటుంది మిస్ అ్రోయో. 'నల్లవారమయి పుట్టినందుకు ఎన్నో నిరాశలకీ, నిస్పృహలకీ లోనయ్యాము. కానీ, మా ముందువారింకా కష్టాలు పడ్డారు కదా!'

[ఫో. వ. ఫీ.] ●

# ఆకాశవాణి కబుర్లు

మద్రాసునుంచి కూడా తెలుగు కార్యక్రమాలు ప్రసారమవుతుంటాయి. వినకపోతే 'వాణి' పుస్తకం చూడండి. క్కడనుంచి ఎంత మంచి మంచి ప్రోగాములు ఏర్పాటుచేస్తున్నారో తెలుస్తుంది.

మద్రాసునుంచి తెలుగు కార్యక్రమాలు ప్రసారమవుతున్న మాట నిజమే! కాని, ఆంధ్రులకీ మద్రాసుకీ ఎంతదగ్గరో— ఒక్కోసారి ఈ కార్యక్రమాలకీ తెలుగుకీ అంతదూరంగా వుంటాయి.

మద్రాసులో తెలుగు వారున్నారు. ప్రత్యేక భాషతోపాటు స్వచ్ఛమైన తెలుగునూ మాట్లాడుకుంటున్నారు. అయితే, అటూ ఇటూ కాని మరో కొత్తరకం భాషని ఆకాశవాణి సృష్టిస్తున్నది. ఈమధ్య చదివిన ఒక రచయిత్రికథే అందుకు ఉదాహరణ. ఉత్సాహవంతుల్ని (ముఖ్యంగా రచయిత్రులను) ప్రోత్సహించే మద్రాసు కేంద్ర లక్ష్యం గొప్పది. 'భాష' ఉచ్చారణ విషయంలోకూడా రచయిత్రులకు ప్రత్యేక స్వతంత్రం కల్పిస్తున్న ఈ కేంద్రాన్ని అభినందించి తీరాలి!

ఇక్కడ నుంచి ప్రసారమవుతున్న కార్యక్రమాల స్థాయిమాట అటుంచి వైవిధ్య ముంటున్నందుకు సంతోషించాలి. ఒకే ప్రోగ్రాముని పదేపదే ప్రసారం చేస్తూ ఆవారంలో వెరైటీ చూపించామని సరిపెట్టుకుంటే అందులో కొత్తదనం ఎలా వుంటుంది?

ఈమధ్య మళ్లీ ప్రసారమైన 'మూడు పూవులూ...' నాటిక వినతగిందే నాటకాలు లేని లోపాన్ని చూపకుండా— అడపాతడపా ప్రసారంచేస్తేనే ఈనాటిక పరువు నిలబడుతుంది!

●

మద్రాసులోనే తెలుగుపాటలు ఉత్పత్తి అవుతున్నాయి. 'అన్నపూర్ణ యింటిలోనా...' పాటకను అక్షరాలు అమలు జరిపే కేంద్రం ఇది. జనం విన్నా వినకపోయినా ఆకాశవాణి వారికి ఇష్టమయిన కార్యక్రమాలు వినిపిస్తారే గాని—శ్రోతల కోరికని చెల్లించే ఆచారం (తక్కిన కేంద్రాల్లాగే) ఈ కేంద్రానికీ లేదు.

మద్రాసునుంచీ ప్రసారమయ్యే పాటలు విని విని— ఈ మధ్యన విడుదలయిన తెలుగు సినిమాలు (మాటవరసకి) ఈ రెండేనా? సినిమాల్లో వున్న పాటలు ఈ మూడేనా? అని ఆంధ్రేతరులకి అపోహ, ఆంధ్రులకీ విస్పృహ కలక్కమానదు! శ్రోతలుకూడా ఉద్యమాలు లేవదీయాలేమో!

—ఆకాశరాజు ●



# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు —

# మతంగాశ్రమంలో మందారవతి పరిణయం



అనువాదం : తిరుమల రామచంద్ర

ఇక్కడ అలకాపురిలో సుందరసేనుడు తీవ్ర మందారావతీవియోగ బాధతో కుమిలి పోతున్నాడు. ఇంతలో దూతవల్ల మందర దేవుడు తన కుమార్తెను తనకు మాటతో దానం చేశాడని, కృతార్థుడనని అయ్యా వని మందరదేవుడు చెప్పాడని విని వివాహకాలంలో విలంబం సహించలేక పోయాడు. తండ్రి ఆజ్ఞ తీసుకొని పెద్ద సైన్యంతో, వివాహోచితమయిన సంపదతో మంత్రులు, మిత్రులు వెంట రాగా, హంసద్వీపానికి బయలుదేరాడు. ఆయన సైన్యంలోని గుర్రాల గిట్టలతో భూమి ఉట్టంకిత అయింది.

సుందరసేనుడు ఇలా బయలుదేరి సముద్రతీరంలో వున్న శశాంకపురం చేరాడు. అక్కడి రాజు మహేంద్రా దిత్యుడు అతనికి ఆదరంతో సత్కారం చేశాడు. ఆ మహేంద్రాదిత్యుడే ముందు నడవగా పరిణయోత్సాహంతో హంసద్వీపం చేరడానికి పడవ ఎక్కాడు.

కాని, దురదృష్టవశాన అకస్మాత్తుగా సంహారలోలువ మయిన ప్రచండవాయు వులు చెలరేగాయి సముద్రంలో. వాటితో పడవ పగిలింది. గాలికి తీరంవైపు తిరిగిన తరగలు తోడ్పడగా, పడవలోని వారం తటాగ్గట్టుకు ఈదసాగారు. దిక్కు కొకరుగా, ఈదుతూ వెళ్లారు. సుందర సేనుడు ఒక మిత్రునితోపాటు ఒక గట్టు చేరాడు. భుజంగ కుటిలమయిన విధి విలసితం గురించి ఆలోచించసాగాడు.

'హా సుందరి! ఇంత ప్రయత్నం చేసినా, నీవు లభించలేదు. పుణ్యహీనుల సంకల్పాలు ఎక్కడైనా ఫలిస్తాయా? మిత్రులు విడిపోయారు. ప్రయత్నాలు విఫలమయి దుఃఖం కలిగించి. ఇంతటి వ్యసనం వచ్చినప్పుడు మరణంకన్న సుఖ మయినది లేదు.'

సుందరసేనుడు ఇలా పలవిస్తూం డగా, వెంట బతికి వచ్చిన మిత్రుడు

అతనిని ఊరడించాడు, పెక్కుసార్లు. ఎవరో తాపసులు కనబడి దగ్గరలోనే ఒక తపోవనం ఉందని చెప్పగా, నెమ్మదిగా మిత్రునితోపాటు అక్కడికి చేరాడు.

రాజపుత్రుడు లేని సైన్యం అలకాపట్టణానికి తిరిగివచ్చింది. నిషధాధిపతి మహాసేనుడు పిడుగువంటి తన కుమారుని విపద్వృత్తాంతం విని, 'హా పుత్ర!' అని బిగ్గరగా అరచి భూమి మీద పడిపోయాడు. భూపతి భూమి మీద పడగా, భూదేవి, తెగిపోయిన అంతఃపురకాంతల ముత్యాలదండలనే కన్నీటిధారలతో విలపించినట్టు అనిపించింది. రాణి శశిప్రభ పుత్రశోకంతో విలపించి ప్రలపించింది. ఆమె ఏడుపు విని అంతఃపురంలోని పెంపుడు జింకల కళ్ళు కూడా నీళ్లతో నిండిపోయాయి.

ఇది ఇలా వుండగా, హంసద్వీపాధిపతికి తన కుమార్తె సముద్రావర్తంలో మునిగిపోయినట్టు తెలిసింది. అతడు దుఃఖ సంభ్రమాలతో అలకాపురికి బయలుదేరి వచ్చాడు. పుత్రీ వియోగ విధురుడయిన వియ్యంకుడు సముద్రం దాటి మహాసేనుని పట్టణం చేరగా, ఆ పట్టణంలో సుందరసేనుని విపద్వార్తతో హాహా రవాలు వ్యాపించి వున్నాయి. వియ్యంకుని చూచి హాహా రవాలు మిన్నుముట్టాయి. సమాన దుఃఖం గలవారు కలుసుకొన్నప్పుడు బాష్పగ్రంధి — కన్నీటిమూట — పెళ్ళున విచ్చుకుంటుంది. వృద్ధామాత్యులు మొదలయినవారు, 'పలువురు సముద్రంలో మునిగినవారు, దాటి రావడం చూచాము' అని పెక్కు నిదర్శనాలతో ఆ రాజులను ఎలాగో సమాధానపెట్టారు. తర్వాత ఆ యిద్దరు రాజులూ భార్యలతోసహా దుఃఖంతో కృశిస్తూ, నియతాహారంతో శివార్చనా పరాయణులయ్యారు.

సుందరసేనునికి తాపసులు తెలిపిన తపోవనం మాతంగాశ్రమమే. అతడు తన మిత్రునితో పాటు మతంగాశ్రమమున్న అడవి చేరాడు. ఆశ్రమ సమీపంలో ఒక నది ప్రవహిస్తున్నది. నదీతీరంలో చల్లని చెట్లు, చెట్లలో కలకల నినాదంచేసే పక్షులు, చల్లని పిల్లగాలులకు ఊగిసలాడుతున్న పూచిన తీగలు, పొదరిండ్లు జలంతో మనోహరంగా ఉంది. ఆ నదిలో మెరపుమాపుల మునికన్యలు జలక్రీడలాడుతూ వుండడం చూచాడు. వారి మధ్యన నక్షత్రాల మధ్య రోహిణిలాగ వున్న ఒక కన్యకను చూచాడు. ఆ కలువకన్నులది శోక కంచుకం కప్పుకున్నట్టు అనిపించింది. పద్మం లాగ విప్పారి, నిర్దోషంకావడం వల్ల చంద్రుణ్ని పరాభవించే ముఖం, చెవులూ, ముక్కూ మేము ఏకమైపోగూడదని అడ్డు తగులుతున్నాయని రోషంతో కొనలు ఎర్రనయిన కన్నులు, లేత తమలపాకు చిగుళ్లవంటి పెదవులు, మెరసిపోతున్నాయి. వాటిని చూస్తే, సముద్రంనుంచి లేచి వస్తున్నప్పుడు పగడపుతీగల చిగుళ్లు అంటుకున్న లక్ష్మిలాగ అనిపించింది, పాలిండ్లు మరీ పెద్దవయిపోయాయి. ముఖం చూద్దామంటే అడ్డు తగులుతున్నాయి, అనే చింతతో నవిసిపోతున్న సన్నని నడుము, వికసించిన కలువల సుగంధం విరజిమ్మే శరీరం, మొల్లలవంటి పలువరస, మంచువంటి నవ్వు, అశోక పల్లవాలవంటి చేతులు, మల్లెమొగ్గల కోమలత్వం, గేదగి మొగ్గల కొనలవంటి చూపుకొంతులు—ఆకారం ధరించిన సర్వ ఋతుదేవతలాగ వుంది ఆ కన్య. ఆమెను చూచి, రాజకుమారుడు, అతని మిత్రుడు ఆశ్చర్యపడ్డారు. వారి చూపు అలాగే స్తంభించిపోయింది. రాజకుమారుడు ఆమె విలాసాలను అగ్రామ్య మధురంగా మిత్రునితో ప్రశంసించాడు.

ఇంతలో ఒక అనాహూతం జరిగింది. జలక్రీడలో మునిగిన ఆ సుందరిని మొసలి పట్టి లాగింది. భయంతో చను కట్టు కంపించగా, ఆమె మూర్ఛపోయింది. మునికన్యలు అయ్యో అయ్యో అంటూ కేకలు వేశారు. 'అయ్యో, మందారవతి, మా నెచ్చెలి, మొసలి నోట్లో పడింది. మొసలి లాక్కుపోతోంది.' అని వారు అరవడం మొదలుపెట్టారు.

తన ప్రియతమ పేరు వినగానే సుందరసేనుని ముఖం పులకించి విప్పారింది, వెంటనే నదిలో దూకి, మొసలిని చేరి, మందారవతిని రక్షించారు. మందారవతిని నెచ్చెలులు అయిన మునికన్యలు అరటాకులతో విసరి ఉపచారం చేశారు. ఆమెకు స్పృహ వచ్చింది.

కళ్లు తెరచి చూచింది మందారవతి. ఎదుట ఒక సుందరుడు నిలబడివున్నాడు. ఆమె వెంటనే 'ఆహా! అతడే ఇతడు. నేను పూర్వం చిత్రఫలకంలో చూచినవాడు ఇతడే. వాడని సౌందర్యరేఖ అదే' అని తన ప్రియుణ్ని చూచాననే సంశయంతో సిగ్గుపడింది. ఆ సమయంలో మన్మథుడు ఊయాల ఎక్కి ఊగినంత సంతోషవిభ్రమం పొందాడు.

సుందరసేనుడు పక్కనవున్న ఒక మునికన్యను అడిగాడు ఆదరంతో 'లావణ్య లలితాకార అయిన ఈ కన్య ఎవరి కుమార్తె?' అని.

'మహాభాగ, ఈమె హంసద్వీపాధిపతి మందరదేవుని కుమార్తె. మందారవతి అని ప్రసిద్ధికన్నది. తండ్రి ఆజ్ఞతో నిషధాధిపతి కుమారుడు సుందరసేనుడనే వరుని కలుసుకొనడంకోసం జలయానంలో బయలుదేరి సముద్రం దాట దలచింది. దుర్విధివల్ల పెనుగాలులకు ఓడ పగులగా, దైవవశాత్తు గట్టు చేరింది. ఓడ పగులగా, సముద్రుడు తరంగహస్తాలతో గట్టు చేర్చాడు. మతంగముని సముద్రతీరంలో ఈమెను చూచి, ఆశ్రమానికి పిలుచుకొనివచ్చి, తన కన్యలాగ పోషిస్తున్నాడు.' అని ఆ ముని కన్య ఆమె వృత్తాంతం చెప్పింది. అది విని సుందరసేనుడు ఆనందవర్షంలో వున్నట్టు అట్లే నిలబడిపోయాడు.

ఈ రాజకుమారుడు ఎవరని మందారవతి ప్రశ్నించగా, సుందరసేనుని మిత్రుడు, అతని వృత్తాంతం జరిగినది జరిగినట్టుగా చెప్పాడు. మందారవతి విని మహానందం పొందింది. ప్రేమికు లిద్దరూ పరస్పర వృత్తాంతం విని కన్నీళ్ళతో కన్నులు మూతలుపడగా, మూర్ఛపొందారు.

ఇంతలో మతంగమునికి శిష్యులవల్ల ఈ సంగతి తెలిసింది. ఆయన అక్కడికి వచ్చి, సంతోషంతో ఆ కన్యను రాజకుమారునికి దానంచేసి పరిణయం చేశాడు.

(ఇంకా వుంది)

# ఒక వారం విపరీతం పాఠకుడు

## పదవీ వ్యామోహం

ఢిల్లీ హస్తినాపురం విశ్వవిద్యాలయం విద్యార్థుల ఎన్నికల గొడవలో వచ్చిన మనస్పర్థలవల్ల శ్రీకటరీగా ఎన్నికయిన ముక్తియార్ అనే విద్యార్థిని 18 తేదీన [ఆగస్టు] విద్యాలయం బయటనుంచి ఎవరో కాల్చారట. మనిషికి మూడు దాహాలుండకూడదని పెద్దలన్నారు—ఆ మూడులోది ఒకటి పదవీదాహం కదా కాదా మరి!

## దొంగవెళ్లిన ఆరుపహాసాలకు...

అయ్యా, మీరు 25 సంవత్సరాల క్రితం రెండో ప్రపంచ యుద్ధంలో చూపిన ధైర్య సాహస పరాక్ర




మాలకు, బర్మా ఫ్రంట్‌లో చూపిన సాహస పరాక్రమాలకు చేరి, చెరో పతకమూ యిదిగో అని బళ్లారి టి. సుబ్రహ్మణ్యం అనే ఆయనకు మొన్న స్వాతంత్ర్యోత్సవ సందర్భంలో ఆ రెండు పతకాలను ప్రభుత్వం యిచ్చిందట. ఐతే యిన్నాళ్ళు యివి ఎందు కివ్వలేదో మాత్రం తెలియజేయలేదట—పిచ్చైతే యేం—ఇచ్చారుగదా ప్రభుత్వంవారు....

## దవడ విరగ్గొట్టిన హాస్పిటల్

మణిలాల్ మగన్‌లాల్ అనే 22 ఏళ్ల కుర్రాడు పూపిరిగొట్టు వాపుతో బొంబాయి నయాన్ ఆసుపత్రిలో చేరాడట. అతనికి వైద్యం చేస్తున్న సందర్భంలో ఓ ఎక్సరిమిషను భాగంమీద పడి అతని దవడ విరిగిపోయిందట. అది తిరిగి సరిచేసినా సరే అతనికి నమలడంవంటివి పనులు పూర్వంలాగ సాధ్యపడటం లేదట. పూపిరిగొట్టు వాపుతో ఆసుపత్రికి వచ్చిన ఆ మణిలాల్ దవడ పగలగొట్టిన ఆసుపత్రి అధికారుల ప్రజ్ఞకు, కార్యదక్షతకు జేజేలు!

## డాగని చావ

వందవాసికి చెందిన తేత్తురై అనే గ్రామంలో 68 ఏళ్ళ అరుణాచల మొదలియారు తన ఆస్తినంతటినీ కూతురు ధైవనాయకిపేరపెట్టి, దాని కోసం అల్లుడు ఆరాటపడడం చూసి, తిరిగి ఆ ఆస్తిని తనే స్వాధీనపరచుకునేటట్టు ప్రకటించాడట. దాంతో ఆ స్తెక్కడపోతుందోనన్న ఆరాటంతో ధైవనాయకి భర్త రాజగోపాల్ ఇద్దరి సహాయంతో ఓ అర్ధరాత్రి 12 గంటలకు అరుణాచల మొదలియారు పీక నొక్కి చంపి, ఆ మర్నాడు రాత్రి శవాన్ని విసార్ అనే పూరు చెరువుగట్టున పాతేసి తిరిగొచ్చేశారట. ఆనకా విషయం పోలీసులకు తెలుస్తుందేమోనని భయపడి, ఆ శవాన్ని త్రవ్వి బయటకు తీసి, కాల్చి భస్మం చేసేశారంట. హమ్మయ్య అనుకున్న రాజగోపాల్ ఇటీవల తన మామగారు కనబడటం లేదని పోలీసులకు ప్రకటిస్తే వారు కూపీ లాగి ఆ గ్యాంగును పట్టుకున్నారట— అనకూడదు గానీ ఆ డిపార్టుమెంటు!!! వ్వమ్మమ్మవ్వా!!!

## అభినవ భీష్మ: క్రుడు

కొలాలంపూరుకు చెందిన కేంపాగ్ తిరోయ్ యన్ అనే పూరిలో "నే పెళ్ళిచేసుకోను చూస్కో" అని భీష్మించుకూర్చున్న నో భీష్ముడు తన 101వ ఏట 18 ఏళ్ళ అమ్మాయిని తక్కువ పెళ్ళి చేసుకున్నాడట. హాస్సేన్ బిన్ జోష్ అనే యీ నూటొక్క వయస్సు పెళ్లి కొడుకు 18 ఏళ్ల ఆ పిల్ల ఫోటో చూశాక తన మనస్సు మారిందన్నాడట—



## అవమానం - ఆత్మహత్య

గుడియాతంలో సులోచన అనే అవివాహిత అదే పూరుకు చెందిన కణన్ అనే ఆసితో రహస్య ప్రేమ సంబంధం పెట్టుకుందట. ఆ పూరివారీ విషయాన్ని పసిగట్టి, మాటువేసి, ఓ రాత్రి వారిద్దర్నీ పట్టుకుని, చేయీ చేయీ కట్టేసి, రచ్చబండకు యీడ్చుకు వెళ్ళారట. ఈ సంఘటన తనకు అవమానంగా తీసుకుని, సులోచన బావిలో దూకి, ఆత్మహత్య చేసుకుందట.

## మంత్రుల ఖర్చు

హిందూదేశంలో 1961 లో 294 మంది మంత్రులకు 1.2 కోట్లు ఖర్చయ్యేదని, యిపుడు




ఆ మంత్రుల సంఖ్య 455 అయితే వారి ఖర్చు సంఖ్య 2.7 కోట్లకు పెరిగిందని వార్త—పెరగ దేమిటి—పచ్చి మిరపకాయలు, కొత్తిమీర ధరలు 1961 లో లానే ఉన్నాయా!

## మాజీ జడ్జి హత్యాకాండ

షిల్లాంగులో పోయిన ఫిబ్రవరి 11 తేదీన ఉపేంద్రనాథ్ రాజకోవా [మాజీజడ్జి] అనే ఆయన తన భార్యను, పెద్దకూతుర్ని చంపి, వారిశవాలను బాత్‌రూమ్‌లోకి తీసుకువెళ్ళి ముక్కముక్కలుగా కడిగేసి, పెరటో పాతేసి, ఆనక గౌహతిలో చదువుకుంటున్న యిద్దరాడ పిల్లల్ని కూడా యింటికిపిలిపించి, వారినీ చంపి, భూస్థాపితం చేశారుట. ఈ అమానుష కాండలో ఆయనకు సహాయం చేసిన బాసెయ్య అనే నౌకరు యీ కథంతా మొన్న పోలీసులకు తెలియ జేస్తే, వాళ్ళొచ్చి పెరడు త్రవ్వి శవాలను బయటకి తీశారట. అప్పుడు జడ్జిగారు కాస్త మనస్థిమితంలేకపోయిన స్థితిలో ఆసుపత్రిలో వున్నారు.

## బ్రతికిపోయిన బాక్సర్

న్యూయార్క్‌లో బాక్సింగ్ [శక్తికొద్దీ యుక్తి కొద్దీ ముఖం మీద ఫెడీ ఫెడీమని గుద్దుకునే ఆట] జార్జి చువెల్ అనే అతన్ని ఫోర్మన్ అనే అతను నిర్దాక్షిణ్యంగా శక్తి కొద్దీ రక్తం కక్కుకునేలా గుద్దితే నోట్లోంచి రక్తం కక్కుకుంటున్న చువెల్ని రక్షించమని ఆయన భార్య రంగస్థలం మీదికి వెళ్ళి రెఫరీని ప్రార్థించిందట. ఆమె కోరిక మీదాయన్ను వదిలి వేశారట.

## జగ్‌జీవన్‌రామ్‌కు జరిమానా

ఆదాయపన్ను విషయం పదేళ్ళగా కట్టడం మరచిపోయిన జగజ్జీవన్‌రామ్‌కు ఆశాఖ 82 వేలు జరిమానా విధించిందట.

ఆపన్నులు
వేసింది
ఆశాఖే కదయ్యా

బాపు

మాన్సిర్‌కు చెందిన ఒక గ్రామంలో వచ్చిన తగవుల్లో భూస్వామి పొన్నెవారు ఆ పూరిహరిజనులను చితక తన్నారనే గాక వారిళ్ళు తగులబెట్టిన సందర్భంలో 13 మంది తీవ్రంగా గాయపడడం, ముగ్గురు చనిపోవడమూ జరిగిందట.

## గడియారంతో దోపిడీ

పారిస్‌లోని ఓ బ్యాంకులోకి చాకులాటి కుర్రాడు వెళ్ళి, ఓ ప్యాకేజీని క్యాషియరు ఎదుట పెట్టి: "ఏమండు: లుక్‌హియర్: యీ ప్యాకెట్లో బాంబుంది జాగ్రత్త:" అని భయపెట్టి. 26 వేల ఫ్రాంకులు [36 వేల రూపాయలతో సమానమట] కాజేసి పారిపోయాడట. తీరాచూస్తే ఆ ప్యాకెట్టులో పాత గడియారం వుందట—టిక్కుటిక్కుమను టుంటూ.




**జి. ఎస్. ఆర్, కొత్తపేట**

నేటి విద్యా విధానంపై మీ అభిప్రాయం ఏమిటి?

నేటి విద్యార్థులకు తగినట్టే ఉంది!

**ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లాపూరు**

మీ గురించి మీలో మీరు ఏం అనుకుంటారు?

ఏం అనుకోను. నన్ను గురించి అంతా ఏమనుకుంటుంటారో వింటే చాలని అనుకుంటాను.

**కె. ఆర్. ఆర్, నిర్మల్**

మృత్యువు అనుక్షణం నీడగా వెంటాడుతుందని తెలిసి కూడా ఉన్నన్ని రోజులు పట్టు పరుపులమీద పవళించి చివరికి ఎంతటివాడైనా ఆ నలుగురు మోసే కంపరముపై పోక తప్పదు.

అంతేలే జీవితం అంతా ఆ ఏడుకట్ల పల్లకీని పరుపుగా వాడమంటారేమిటి కర్మ?

**డి. వి. ఎస్. ఆర్, హైదరాబాదు**

ఒక మగవానికి, ఆడదానికి ఇచ్చే ఉద్యోగం ఇస్తే ఆ మగవాడు ఒక కుటుంబాన్నే పోషించవచ్చుని అంటాను. మరి మీరేమంటారు?

ఆడదానికి ఉద్యోగం ఇచ్చినా అంతే అంటాను. సంపాదించిన డబ్బు—ఆడపిల్ల అయితే, అలాగే తల్లితండ్రులకో, భర్తకో ఇస్తుంది. అదే కొడుకు గాని భర్తగాని ఇస్తాడా? తన స్వీయ ఖర్చులకని అమ్మాయి అడిగి తీసుకుంటుంది మగవాడు చేస్తాడా? సంపాదించి పెడుతుంటే తిని కూర్చో లేవు? అంటూ అవకాశం వచ్చినప్పుడల్లా దెప్పుతారు మగవాళ్ళు. తను సంపాదించి పెడుతున్నానన్న సంగతి జ్ఞాపకం చేస్తే ఏమనుకుంటారో అని ఎంతో మొహమాట పడుతుంది ఆడది..అంచేత అవసరం అయినప్పుడు—ఉద్యోగాలు ఇద్దరికీ ఒక్కటే—కాంట్లో ఆడామగా తేడా అనవసరం.

**ఎమ్. ఎల్, ఖమ్మం**

...ముందు మీ ప్రశ్నల శీర్షిక చూసేసి పాడావిడిగా మీ వ్యాసం ఏదైనా ఉందేమో అని చూసేస్తాను. ఈ మధ్యలో ఏం అర్థం లేదు. మొత్తానికి భలే వరం యిచ్చాడండీ దేవుడు మీకు. ప్రతిదాన్ని తేలికగా తీసుకుంటూ సరదాగా కాలం ఎలా గడిపెయ్యకల్గుతారు మీరు? ఆ చిట్కా ఏమిటో?

అదో పెద్ద చిట్కా కాదు అలా—అంతే. 'చియ్యాలో చాల్లండి' అంటూ ఎన్నిసార్లన్నా అవి రావు. అంచేత ఏకాకిని. అదీ మాత్రం. అలాగే ఉన్నన్నాళ్ళు మనుష్య మూలాలు పరుచుకుని ఎంతని ప్రతిదాని మీదా [illegible] అంతడమో, వదుల్చుకోవడమో..అదీ నా పద్ధతి. నాకూ సుఖం. నా చుట్టూ వారికీ సుఖం కదూ?

**వి. మ. ల, బరంపురం**

...శుభమో, అశుభమో తెలియదు గాని మీకు లేఖ రాయాలని కూర్చున్నప్పటికి బయట సన్నగా వర్షం కురుస్తూంది...

మా అత్తయ్య పక్కన ఉంటే.. 'ఏంరాతే బట్టలు తడిసిపోతున్నాయి. ముందని లోపలికి తే' అని కసిరేది—దాంతో ఆకాశపు కృష్ణవర్ణంలోని అందం, వాన జల్లులోని మజా ఒక్కటే తలపులో ఉండదు—ఎందుకొచ్చింది వాన? అని విసుగొస్తుంది. వి.మ.లతో మూడో ముఖాని వన్నమాట. వెల్కమ్ మైడియర్. నీ స్నేహితులిద్దరు గడుగ్గాయిలే. అలాగే ఉండాలి అమ్మాయిలు! చక్కని స్నేహితులు, కొరకరాని పాఠాలు నవ్వని లెక్చరర్లు...ఇవన్నీ ఉంటేనే విద్యార్థి దశ రంజుగా వుంటుంది కదూ?

**బి. వి. ఎస్, వత్సవాయి**

భర్తను గూర్చి ఒకరి ముందు తేలికగా మాట్లాడుట గాని పొగుడుటగాని మంచిది కాదంటారా?

కాదు. తేలికగా మాట్లాడితే—'ఎంత పొగరు' అంటారు. పొగుడుతే 'ఎంత ఆపాం' అంటారు.

**జె. పి. ఎల్, విశాఖపట్నం**

మీరసలు ఉత్తరాలకి జవాబులు రాయరని విన్నాను.

కొంతమంది నా శ్యామలారాణిగాని చెప్పలేదు కదా? ఆ.. శ్యామల బంగారుతల్లి. అలాంటి విషాలు: బయటపెట్టి నన్ను బాధపెట్టదు. ఏం శ్యామలా? 'క్షేమలేక బాధచెందు స్నేహాలి నేమనందు? ప్రేమలోనే ఉంది విందు జాబు కన్న నేనె ముందు' అన్నావు కదట? లేకపోతే కోసం వచ్చి కోమలాదేవి చెప్పి ఉండాలి నీకు.

**ఎం. ఏ. ఏ, అనంతపురం**

ప్రపంచంలో స్త్రీగా పుట్టుక కోరరానిది. అందుకో నాతిగా, ఏకాకిగా జీవించటం దుర్భరం అంటాను. మీరేమంటారు?

మిమ్మల్నెవరు పుట్టమంటున్నారు—ఈ జన్మ కారాపు లేదు. వచ్చే జన్మకి కోరకండి...

**ఎ. ఎమ్ ఆర్, పెదపారు**

మీ నామ పదజాలం పొందికనుపట్టి మీకు ఎక్కడో ఒడుదుడుకులు ఉండాలి. (కవిత్వంలోనా, జీవితంలోనా?)

పోనీ పేరు మార్చుకుంటాను—ఒడుదుడుకులు సద్దుమంటాయా స్వామీ?!

**రాము, కలకత్తా**

ఊహకు, ఆలోచనకు గల భేదం ఏమిటి?

ఊహ ఆ క్షణంలో పుట్టినది. ఆలోచన పుట్టి పెరిగినది.

**సి ఎమ్ ఆర్, కేరాఫ్ 99 ఎ పి.ఓ**

మధ్య తరగతి కుటుంబీకుని సమస్యలకు పరిష్కారము ఏమిటి?

అనవసరపు బేషజాలకు స్వస్తిచెప్పి, పక్కవాడితో పోటీ పెంచుకోక—ఒక పద్ధతిలో జీవనవిధానం సాగించాలని నిర్ణయించుకోవడం—మొదట చేయవలసిన పని.. ఎవరో ఏదో అనుకుంటారని మధ్యతరగతి వాళ్ళు జీవితం ముళ్ళబాట చేసుకుంటారు. మింగడానికి ముద్దలేదు గాని మీసాలకి సంపెంగ నూనె కోసం అప్పులపాలు అవుతారు. ఇది అర్థంలేని పని కాదా?

**ఎమ్. ఎస్. ఆర్. సి, తేజ్‌పూరు**

మానవ భావి జీవితానికి తృప్తి అవసరమా? అనవసరమా? ఎంతవరకు?

తృప్తి అవసరమే. ఆ తృప్తి మనిషిని స్తబ్దు చేయనంత వరకు.

**పి వి హెచ్. ఆర్, వత్రగచ్చి**

స్త్రీ స్వాతంత్ర్యానికి కారణం విద్య అని నా అభిప్రాయం.

స్వాతంత్ర్యాన్ని అపార్థం చేసుకుందుకు మటుకే విద్య కారణం అనిపిస్తుంది. స్త్రీ స్వాతంత్ర్యం అని దేన్నంటున్నారు మీరు? నా కర్థం కావడం లేదు.

**ఎస్. ఎల్, భీమవరం**

ఏమండీ రామలక్ష్మిగారూ మీ ప్రశ్నల కోసం ఇంత ఖర్చుపెట్టాము అని వ్రాస్తారు. వాటిని మీరు ప్రచురిస్తారు, అంతటితోనే అవి ప్రముఖార్హతను సంపాదించుకొన్నవా?

చిత్తం సంపాదించుకోవు. కాని అవి సంపాదించుకోలేదని తెలుపడానికైనా, మీలాంటి వారడిగే పై బాపతు ఉత్తరం వేయాలన్నా...అచ్చు వేయాలి కదా? లేకుంటే ఎలా తెలుస్తుంది—ఉదహారణకి మీ ప్రశ్న ఎందుకు వెయ్యాలి? వెయ్య నవసరం లేదని మీకు అచ్చులో కదా చెప్పాల్సి? ఏమంటారు? ●

రాజయోగి అయిన జనక మహారాజు ఒకప్పుడు బహు దక్షిణ మని పేరుపొందిన యాగాన్ని జరపడానికి నిశ్చయించాడు. అందుకు దేశంలోని నానా ప్రాంతాలనుంచీ బ్రహ్మవేత్తలూ, వేద వేత్తలూ, శ్రౌత కర్మల నిర్వహణలో సమర్థులూ అయిన విద్వాంసులను పిలిపించాడు. వారందరూవచ్చి ఒక ఒకచోట సంఘంగా కూడగా చూచి ఆ రాజు ఎంతో సంతోషించాడు! వారిని చూడగా జనకునికి వారందరిలో ఎవ్వరు సర్వసమర్థుడో ఎవ్వరు బ్రహ్మజ్ఞానాన్ని నిస్సందేహంగా ఉపదేశించగలరో తెలుసుకోవాలనే కోరిక కలిగింది.

ఆ జిజ్ఞాసతో — ఆ మహారాజు ఒక వెయ్యి పాడియావులను గోశాలలో చేర్చి, ఒక్కొక్కదాని శృంగద్వయానికీ వేర్వేరుగా అయిదేసి సువర్ణనాణేల చొప్పున కట్టి బాగా అలంకరించాడు. తర్వాత ఆ విద్వాంసులను చూచి 'ఓ పండితోత్తములారా! మీరందరూ బ్రహ్మవిదులే, సందేహం లేదు. మీ అందరిలోనూ ఎవ్వరు బ్రహ్మవేత్తలలో ఉత్తమోత్తముడో, అతడు ఈ గోవులను తోలుకొని పోవచ్చును' అని అన్నాడు. ఆమాటలు విని అక్కడి వారందరూ ఒకరిముఖాన్ని ఒకరు చూచుకుని ఏదో ఆలోచించుకుంటూ ఊరికే ఉన్నారుగాని, ఒక్కరూ ముందుకు రావడానికి



సాహసించ లేదు. అందరిలోనూ ఉత్తముడైన యాజ్ఞవల్క్య మహర్షి కూడా ఉపేక్షాభావాన్నే వహించి ఊరుకున్నాడు.

ఒకజాము గడిచి పోయింది. ఎవ్వరూ ముందుకు రాకపోవడం చూచి, మళ్లీ ఆవిధంగానే చెప్పగా, ఎవ్వరూ బదులివ్వ లేదు. ఆరాజు మూడవసారి ఆమాటలే అంటూ 'ఇంతవరకూ ఒక్కరూ నేనే బ్రహ్మజ్ఞుడనని చెప్ప లేదు. ఈ కృత యుగంలోకూడా బ్రహ్మవేత్తలు కరువైపోయారా?' అని అనగానే— యాజ్ఞవల్క్యుడు ఆ గోవులను తన ఆశ్రమానికి తోలుకొని వెళ్లవలెనని శిష్యునికి ఆజ్ఞయిచ్చాడు. అప్పుడక్కడి విద్వత్సంఘంలో సందలనం కలిగింది. జనకుని హోత అయిన అశ్వలుడు, అంతవరకూ తానే గొప్ప బ్రహ్మవిదుడనని అనుకునే వాడు—'నువ్వు యిక్కడ బ్రహ్మిష్ఠుడవు?' అని గద్దించి యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నించాడు. అతడు 'అయ్యా! నేను బ్రహ్మిష్ఠుడను కాను. బ్రహ్మిష్ఠుడవైన నీకు నమస్కారం. నాకు గోవులుకావాలి కాబట్టి తోలుకొని వెళ్తున్నా' నన్నాడు ఎంతో శాంతంగా. అశ్వలుడడిగిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుడు తగిన జవాబులిచ్చి నిరుత్తరుణ్ణి చేశాడు. తర్వాత, తన్ను వడదొయ్యాలని ప్రయత్నించిన అందర్నీ ఓడించాడు. చివరికి గార్గి అనే విద్వాంసురాలు ఏవో ప్రశ్నలువేసి ఎంతో విసిగించింది. ఆమె పిచ్చి ప్రశ్నలకు ఒకప్పుడు ఉద్రేకం కలిగినా మహర్షి దాన్ని అణచుకుని శాంతంవహించి చివర అడిగిన రెండు ప్రశ్నలకూ తగిన సమాధానం ఇచ్చి 'జితాస్మి' అనిపించాడు.

మహానంద పరవశుడైన జనకుడు ఆ మహర్షివల్ల బ్రహ్మజ్ఞానాన్ని నిస్సందేహంగా సంపాదించి తన జీవితం ధన్యమైనదని సంతృప్తి చెందాడు.

యాజ్ఞవల్క్యుడు పశుధనాలతో ఆశ్రమం చేరుకున్నాడు.

బ్రహ్మవేత్తలు నిండు కుండల వంటివారు. అంతగా అవసరమైతేనేగాని తమజ్ఞానాన్ని బయట పెట్టరు. బడాయిలు చాటుకోరు. మహా విద్వాంసుల లక్షణం యిది.




### జరిగిన కథ

అనూరాధ తల్లి అన్నపూర్ణమ్మ, తమ్ముడు రాజా. అన్నపూర్ణమ్మ కన్నబిడ్డల చదువుకోసం ఎంతో కష్టపడుతూవుంటుంది. ఒకనాడు అనూరాధ డాన్సు చూసి బహుమతినీయడానికి అగంతుకుడుగా వచ్చి డా. హరికృష్ణ పరిచయమవుతాడు. ఇంతలో మద్రాసులో ఒక నాటక సమాజం వారి పిలుపుతో నాట్యప్రదర్శన యివ్వటానికి మద్రాసు బయలుదేరుతుంది. స్నేహితుతో హరికృష్ణ కలుసుకుని మద్రాసుకు ఆమెను తీసుకెళ్తాడు. హరికృష్ణ ఆమెని ఆకర్షించాడు. శారద గురించి తెలుసుకోవాలని ఆమెకి ఆసక్తి కలిగింది. శారదకీ తనకీ వున్న సంబంధాన్ని ఉత్తరం ద్వారా ఆమెకి తెలియపర్చాడు హరికృష్ణ. దానితో శారద అనూరాధకి మరింత సన్నిహితురాలవుతుంది. హరికృష్ణకి రేయింబవళ్ళు పరిచర్యలు చేస్తున్న అనూరాధపై అయినవాళ్ళు అభాండాలు వేస్తారు. అన్నికోసం హరికృష్ణకి పిచ్చెక్కిందనే వార్తనికూడా సృష్టిస్తారు బంధువులు. అనురాగమయి అనూరాధ అన్నీ సహిస్తూ వూరుకున్నది.

## 9

రోజులు పరువులు పెడుతున్నాయి. సుఖదుఃఖాల్ని రంగరించుకుంటూ. అనూరాధను ఎంతగానో విసిగించుతున్నాడు హరికృష్ణ. పదిరోజులనుంచి అతనిధోరణి ఏమంత ఆశాజనకంగా లేదు. ప్రతిదానికీ పేచీ పెడుతున్నాడు.

సరిగా భోజనం చేసి అయిదారు రోజులయింది. ముఖాన అలసట కొట్టవచ్చినట్లు కన్పించుతోంది. సన్నబడ్డాడు. ఆ రోజున గడ్డంకూడా గీయించుకోనని పట్టుబట్టాడు. అపుడపుడు బజార్లోకి వెళ్ళి గంటలకొలదీ వచ్చేపోయే వాహనాల్నీ, జనాన్ని చూస్తూ నిలబడి పోతున్నాడు.

మందు మింగించడం మహాకష్టమై పోయిందానాడు. రామరాజు పెద్దగ కేకలుపెట్టడం మొదలెట్టాడు. అనూరాధ మనస్సున ఆవేదన పర్వతంలా పెరిగిపోతోంది. శారద చిగురుటాకులా విలవిల లాడిపోతోంది అతని పరిస్థితికి.

ఆరోగ్యంతో కళకళ లాడవలసిన ఆ డాక్టరిముఖం, దీనంగా, చూసేవారికి జాలిగొల్పుతోంది. అనూరాధ హృదయం తరుక్కుపోతోంది బాధతో.

మధ్యాహ్నం దాటిపోయినా అతడు అన్నం ముట్టనేలేదు. ఎంతగా బతిమలాడినా పట్టు విడువనేలేదు.

'అన్నంతింటే పాపం! తినను! అయినా నీకెందుకు యింతబాధ నా గురించి. నా యిష్టం! మా యింటికి వెళ్ళిపోతాను యిలా మాటిమాటికి అది తిను, యిదితిను అని వేధించావంటే! ఏయ్! అమ్మాయ్! ముందు నివ్విక్కడనుంచి వెళ్ళిపో! ఊ! నేనే వెళ్ళిపోనా! ఆ! అలావెళ్ళు! లేకపోతే! బయల్దేరిందండీ! మహారాణి!! ఎందుకు తినాలో అన్నం?! అంత ఆకలైతే తను తినరాదూ?! పాపం!! పిచ్చిదేమో! అందుకే యిలా వెంటపడుతోంది.'

అనూరాధను పేరుపెట్టి పిలవడంకూడా మానివేశాడతడు. పిచ్చిధోరణి మరింత అధికమయ్యిందనాడు. శారదకు ఫోను చేసి జరిగినదంతా వివరంగా చెప్పింది. విని నిట్టూర్చిందామె.

'అక్కా! ఆయన పరిస్థితి చూస్తోంటే భయం వేస్తోంది. ఈ రాత్రికి నువ్వు రా! సాయంగా వుంటావని అంటున్నాను. ఒక్కమెతుకైనా లోపలికి పోనివ్వలేదింతవరకూ! జోగులుతో ఎలాగో కాసిని పాలు తాగించాను, అదీ బలవంతానే! మరీ బలహీనంగా వున్నారు. అయినా అరుస్తూనే వున్నారు పెద్దగా. నీరసం వచ్చి తూలిపోతున్నా గోడన మానడం లేదు.' అన్నది అనూరాధ బాధగా.

రాత్రికి వస్తానని మాట యిచ్చింది శారద. ఆపిల్‌పళ్ళు తెచ్చి ఎలాగో తిన్పించింది. తరువాత బడలికగా వుండడం మూలాన స్నానం చేయబోయింది. హరికృష్ణ కళ్ళు మూసుకుని పడుకున్నాడు. జోగుల్ని అతని గది

ముందరే కావలావుంచి వెళ్ళింది.

అంధకారం దట్టంగా అలుముకుంటోంది. స్నానం ముగించి చీర కట్టుకుని, నుదుట కుంకుమ వుంచుకుని 'పాలు' కాసిన్ని గొంతులో పోసుకుంది. ఆమెకు కూడా వుదయాన్నుంచీ ఆకలి అన్పించడంలేదు. అన్నం చూడగానే అతడు గుర్తుకు వస్తున్నాడు. ఆకలి వేస్తున్నా తెలియని ఆ శాపగ్రస్తుణ్ణి తలచుకున్నకొలదీ దుఃఖం ఆగడంలేదామెకు.

ఆలోచనలు ముసురుకుంటున్నా నిగ్రహించుకుని హాల్లో అడుగుపెట్టింది. జోగుల్ని పిలిచింది. అతడు పలకలేదు. ఆతురతతో హరికృష్ణ గదివైపు వెళ్ళింది. జోగులు గుమ్మాని కానుకుని నిదురబోతున్నాడు. దుప్పటి కూడా కప్పుకున్నాడు. అది హరికృష్ణ దుప్పటి. అతడే అలా చేసివుంటాడనుకున్నదామె.

ఏం చేస్తున్నాడో ! మెలకువవచ్చిందా! అని చూసిందామె. కొయ్యబొమ్మలా నిల్చుండి పోయింది. నోట మాటేలేదు. ఆ కనులలో జీవనకాంతే లేకుండా పోయింది. హరికృష్ణ లేడు అక్కడ ! అందుకే విగ్రహమే అయ్యిందామె. జోగుల్ని లేపింది. మేడంతా గాలించింది. అందరూ కలిసి వెదికారు ఎంతోసేపు. గేటు తీసివుంది. అనూరాధ గుండెలలో భయం వికటాట్టహాసం చేస్తోంది. ఆమె మనస్సు మనస్సులోలేదు, మరబొమ్మలా తిరుగుతోంది. చూసినచోటనే మళ్ళీమళ్ళీ చూస్తోంది.

ఎవరికీ కన్పించకుండా ఎక్కడికి వెళ్ళినట్లు? ఎలా అదృశ్యమయ్యారు? పారిపోలేదు గదా !! భగవాన్ ! ఈ స్థితిలో ఆయన !! ఎక్కడ వుండగలరు? ఎవరు మనిషి అని గుర్తించి వో గుప్పెడు మెతుకులు పెడతారు?! అంతకరుణా పూర్ణ హృదయాలున్నాయా యింకా?! ఎలా?!' ఆమె అనుమానంతో వూగిపోతోంది.

అంతలో శారద వచ్చింది. విని విభ్రాంత అయ్యింది. నౌకర్లను పిలిచి నలువైపులా పంపించారు. అనూరాధా, శారద కలిసి వో వైపుకు బయలుదేరారు.

ఆ రాత్రి ఆ గృహాన నిదురలేదు. ప్రశాంతతా నిలిచి కలలుగనలేదు. ఎప్పటిలా ఆ పిచ్చివాని కేకలూ లేవు: పెద్దగా అరవడమూ విన్పించలేదు. మనుష్యులే లేనట్లు నిశ్శబ్దంలో విలీనమైపోయిందా గృహం.

రాత్రి గడిచిపోయింది. వెలుగు ప్రవేశించింది. కానీ ఆ అక్కా, చెల్లెళ్ళు యింకా చీకటిలోనే వున్నట్లు కనులు మూసికొని, సోఫాలో చెరో వైపున బొమ్మలా కూర్చున్నారు.

అక్కడ కూర్చున్నది, నిర్జీవ ప్రతిమలుగావు; చైతన్య స్రవంతులేనని తెలియడానికన్నట్లు వుండివుండి నిట్టూ



ర్పులు మాత్రం వినవస్తున్నాయి.

గాఢనిశ్శబ్దతలో నుంచి ఏ ఒక్కరూ తలెత్తలేక పోతున్నారు. ఏ వ్యక్తికోసం ఆ అనురాగ పూర్ణ హృదయాలు అంతగా తల్లడిల్లి పోతున్నాయో, అతనికి ఆవంతైనా ఆ సంగతి తెలియదు. అందుకే అంతనిర్దయగా ఎవరికంటికీ కన్పించకుండా మాయమై పోయాడతడు. వెదకబోయిన వాళ్ళు ఒక్కొక్కరే వచ్చి ఆ నిశ్శబ్దతలో లీనమై పోతున్నారు. ఎవరి కంటికీ కన్పించకుండా ఆ వ్యక్తి ఎక్కడ దాగివున్నదీ ఎవరికీ అంతు బట్టడం లేదు.

శారద చేసేదిలేక 'పోలీసులకు' కూడా తెలియబరిచింది. అనూరాధ ప్రముఖ దిన పత్రిక లన్నింటిలోనూ ప్రకటన చేయించింది.

ఆ రోజంతా మరలా అన్వేషణే! కానీ నిరాశ తప్ప మరొకటి మిగలలేదు. తెల్లవారే వరకూ ఆ అనురాగమయి ఆశలతో పూలల నల్లుకుంటూనే వుంది. కనులలో వత్తులు వేసికొని నిరీక్షించుతూనే వుంది. నిలువెల్లా నిరీక్షణతో వేగిపోతూనే వుంది. హృదయాన అతని పిలుపు విన్పించుతూనే వుంది అనుక్షణమూ.

శారద, అనూరాధ కళ్ళల్లోకి చూడలేక పోతోంది. ఏ విధంగా ఆ అనురాగ

# ఆరాధన

మయిని వూరడించాలో అర్థం గావడం లేదెవ్వరికీ. ఆ త్యాగమయి ఏ సుఖాన్నాశించి పూర్తిగా తనను తానే అర్పించుకుందో, ఆ సుఖానికి వున్న పునాదికూడా లేచిపోయింది. రంగురంగుల బంగారుకలలు గన్న ఆ అమృత హృదయం నిరాశతో, నిస్పృహతో, అలమటించుతోంది.

రోజులు గడిచి పోతున్నాయి. నిరీక్షణ పెరిగి పోతున్నది. ఆవేదన అధికవౌతోంది. అనురాగం నిట్టూరుస్తోంది అవిరామంగా. అశ్రుతులు పలుకుతోంది అనురాగ వీణియ.

హరికృష్ణ అదృశ్యమైన నాటి నుంచీ, అనురాధ ముఖాన నవ్వుచూసి ఎరుగ రెవ్వరూ! పెదవివిప్పి పెద్దగా మాట్లాడి ఎరుగ దామె. అన్నపూర్ణమ్మ గారి బాధకు అంతులేకుండా పోయింది. కన్నబిడ్డ మంచిని ఎంచుకుని వెళ్తోందనుకుని ఆనందించింది. కానీ చివరకు నిరాశే ఎదురై పరిహసించేసరికి ఆ సంధ్యా సమయాన ఆ మాతృమూర్తి వ్యథతో కుమిలిపోసాగింది. తల్లి తన కోసమే క్రుంగి, కృశించి పోతోందని గ్రహించీ, పెదవి కదుపలేక పోయింది అనూరాధ.

పదిహేను రోజులు గడిచిపోయాయి.

ఏ వైపునుంచీ హరికృష్ణ గురించి అక్షరంకూడా తెలియలేదు. అనూరాధ హృదయం ముక్కలై పోతోంది.

ఆ గదిలో కూర్చుని గంటల కొలదీ రోడ్డువైపు చూస్తూంటుంది. మౌనం తప్ప మరో స్నేహమయి లేదా అనురాగమయికి. దుఃఖంతప్ప మరో ఆత్మీయురాలు లేదు వూరడించడానికి. ఎర్రవారిన ఆమె కనులలో పరచుకున్న నీలి నీడలు శారదను భయకంపితురాల్ని చేస్తున్నాయి.

'అనూ! బావ రాకుండా పోడని చెప్తోంది అంతరంగం!' అన్నది శారద. శారద వంకచూసి నవ్విందామె. ఆ నవ్వులో మాధుర్యం నర్తించలేదు. విరక్తి విరుచుకు పడింది.

'అక్కా! నా మీది మమకారం అలా అన్పించుతోంది నిన్ను! ఎలా నమ్మమంటావు?! అసలే పిచ్చిమనిషి!! ఆ పైన ఆశ్రయంలేదు! ఇంకా వస్తారని ఏ ఆశతో, ధైర్యంతో ఎదురు చూడ్డాం?!' నిరాశతో క్రుంగిపోయిందామె.

'లేదు అనూ! ఎప్పటికైనా సరే! బావ తప్పక తిరిగివస్తాడు.'

'నిజమే నక్కా! అంతవరకూ ఈ అనూరాధ బ్రతికి వుండలేదేమో నన్పించుతోంది!'

'అనూ! ఏమిటా మాటలు?!'

'మాటలు గావు! జరగబోయే దాన్ని చెప్పానక్కా! నీకు బాధగా వుంటుంది. కానీ జీవితాంతం నిరీక్షణతో ఏ మనిషీ నిలువలేదు!'

శారద మాటాడలేక పోయింది. ఆ త్యాగమయిని గుండెలకు హత్తుకుని అలాగే వుండిపోయింది ఎంతోసేపు. ఆమె పెదవులు వణికిపోతున్నాయి.

'నాకు తెలుసు అనూ! నీ అంతరంగాన ఆవేదన ఘోషించుతుందని. కానీ అక్కగా యింకా అర్థిస్తున్నానమ్మా! ధైర్యాన్నిమాత్రం వదిలి పారిపోకు. జీవితాన ఆశ ప్రతిక్షణం వూపిరి పీలుస్తూనే వుండాలి. అపుడే ఆనందం అందుతుంది. నీ అనురాగం పవిత్రమైనదే గాదు. త్యాగ ప్రపూర్ణమైనది కూడా. అందుకే నిరాశ నిన్ను జయించలేదని చెబుతున్నాను' అన్నదామె అప్యా



యుంగా!

అనూరాధ ఆ స్నేహమయి పరిష్వం గంలో అలాగే వుండిపోయింది ఎంతో సేపటివరకు.

ఎందరో నృత్య ప్రదర్శన లిమ్మని వచ్చారు. కానీ ఒక్కరికీ మాట యివ్వనే లేదామె, మనసు బాగుండలేదని చెప్పింది మృదువుగా.

రెండునెలలు గడిచిపోయాయి. అనూ రాధ నిరీక్షణ, నిరాశతో విలవిల లాడి పోతోంది. ప్రతి మనిషినీ పరిశీలించింది ఓపిక వున్నంతవరకూ పట్టణంలో.

అతని పిలుపు వినిపించినట్లే వుండి గదిలోకి వెళ్లి చూస్తుంది అపుడపుడు. శారద బ్రతిమాలి అపుడపుడు తనతో పాటు హాస్పిటలుకి తీసుకొని వెళ్తుంది. సాయం చేయమంటుంది. ఆ విధంగా నైనా ఏదో వ్యాపకంతో హరికృష్ణను తాత్కాలికంగా మరిచిపోతుందని అలా ఆదే శిస్తుంది.

కానీ ఏపని చేస్తున్నా, ఎంతగా నవ్వించినా, ఆ డాక్టరు, ఆమె హృద యాన అనుక్షణం స్మృతుల మీటల్ని కదిలించుతూనే వుంటాడు. ప్రతి అక్ష రంలోనూ ఆ వ్యక్తి కోసం నిరీక్షణ వినిపించుతూనే వుంటుంది. నీరజ దగ్గ రకు ఎన్నోసార్లు వెళ్లి వచ్చింది. ఒక వేళ గత స్మృతులతో అక్కడి కేమైనా వెళ్లాడేమోనన్న వూహతో. కానీ అక్కడి కేనాడూ రాలేదతడు. నీరజకా సంగతి చెప్పకుండా దాచింది బాధపడుతుందని. మూడో నెల కూడా దాటిపోయింది. హరి కృష్ణ జాడే లేకుండా పోయింది. అనూ రాధను తిరిగి కాలేజిలో చేరమని కోరింది శారద.

'క్షమించక్కా! ఇంకా యీ అనూ రాధలో చదువు మీద గాలు గదా, మరి దేనిమీదా ఆసక్తి జనించలేదు. ఆ శుభ ఘడియ రావాలనే నేనూ కోరుకుంటున్నాను. అంతవరకూ నన్ను క్షమించవలసిందే!' అన్నది.

రాజును ఏలూరు కాలేజికి పంపిం చింది. అక్కడికి వెళ్లాడేమో హరికృష్ణ అన్న భావనతో. కానీ అక్కడికెపుడూ, ఆ సంవత్సరం అలాంటి మనిషే రాలేదని తెలిసి నిట్టూర్చింది.

ఆ రోజున శారద మళ్లీ బ్రతిమ లాడింది—

'అనూ! ఈ మద్రాసునుంచి వెళ్లిపో మన్నా! ఈ పరిసరాలు మరింత బాధ పెడతాయి నిన్ను! ఏలూరు వెళ్లు! అక్కగా నిన్ను అజ్ఞాపించుతున్నాననుకో!'

'నీ బాధ నా కర్థమయిందక్కా! కానీ ఈ పరిసరాల్ని విడిచి అడుగు కూడా కదిలి వెళ్లలేను. బాధ రంపంలా కోస్తోంది నిజమే! గత స్మృతులు నరిపివేస్తు న్నాయి కాదనను. ఆస్మృతులతో నిండిన పరిసరాలు చూస్తూన్నకొద్దీ బాధ పెరుగు తుంది. కానీ ఆ బాధ భరించడంలోనే నాకు కొంత వుపశమనంగా వుంటోంది. చిత్రంగా వుంది గదూ!?' నవ్విందామె.

'ఎక్కడ వున్నా ఆ వేదన తరగదు. కానీ స్మృతులు కదిలినచోటే వుంటే ఆవేదన కాస్త పూరడిల్లుతుంది. అదో రకం హాయి. తీయని బాధ అది.' అన్న దామె తిరిగి.

శారద మాట్లాడలేక పోయిందాపైన. ఆ హృదయాన దాగివున్న అనురాగ సంపద మహత్తరమైనదనీ, అత్యంత పవిత్ర మైనదనీ గ్రహించి నిట్టూర్చింది. తిరిగి అందుకే ఆ ప్రసక్తి రాకుండా జాగ్రత్త పడింది.

* * *

హరికృష్ణ వ్రాసుకున్న 'డైరీ'లను తిరగవేస్తూ కూర్చుంది అనూరాధ! అంతలో శకుంతలమ్మగారు పెద్దగా శోకాలు పెడుతూ, లొప్పుతూ ప్రవేశిం చింది. అనూరాధ దగ్గరకు వచ్చి పున న్యాసం మొదలెట్టింది—

'అమ్మా! మహంకాళీ! నా బంగారు తండ్రినేం జేశావు?! ఎక్కడ దాచావు?! నా నెపుడో అనుకున్నాను యిలాంటి పని చేయగలవని. ఎంతకైనా తగిపోతుందని ఆనాడే మొత్తుకున్నాను. ఆస్తికోసం నా తండ్రిని ఏం జేసిందో—'

అనూరాధ నో సారి తలెత్తి ఆమె వంక చూసి తిరిగి డైరీలోకి వంగి పోయింది.

'మాట్లాడ వేమిటే? మహాతల్లీ! చంపి పారేయించావా? లేక ఏ పరాయి దేశానికో పంపించావా?' పెద్దగా అరుస్తోందామె.

'శకుంతలమ్మగారూ! జరిగింది తిరిగి

## డాక్టర్ కబుర్లు

చిన్న పిల్లలలో కొందరి నాభి బయటికి ఉంటుంది. దీనికి కొందరు ఒక 'చికిత్స' చేస్తారు. నాణెం - ఒక దానిని చిన్న వస్త్రంలో మడిచి, దానిని నాభిమీద ఉంచి ప్లాస్టర్‌తో అతికిస్తారు.

ఇది సబబయిన 'చికిత్సే' అని పిస్తుంది. అయితే ఇటువంటి 'చికిత్స' లేకుండానే బొడ్డు లోపలికి పోతుంది.

నాభి పొచ్చితనం పోవటానికి ఆరునెలల నుంచి సంవత్సరం దాకా పడుతుంది కాని కొందరు బిడ్డలకి ఇది నాలుగయిదు సంవత్సరాల దాకా పట్టవచ్చు.



అప్పటికీ తగ్గకపోతే శస్త్ర చికిత్స మంచిది.

(కాపీరయిటు)

రౌడు ఎంత పెద్దగా అరిచినా! నిజాన్ని మోసగించడం ఎవరి తరమూ గాదు. మోసాన్ని దాచివుంచడమూ ఎవరికీ మంచిది గాదు. ఊరికే అభాండాల్ని రుద్దడంవలన కంఠశోషేగానీ లాభం వీసమైనా వుండదు.' శాంత స్వరంతో అన్నది అనూరాధ.

'చెబుతావమ్మా! చెబుతావు! ధర్మ వన్నాలు! నీకేం బాధ!! బాబుని యీ చేతుల్తో పెంచి పెద్ద జేశాను. ఆఖరికి నీ పేరు మీద 'లేడు' అన్పించుకున్నాను. అయ్యో! భగవంతుడా! ఇదేం! కర్మంరా నాయనా! ఈ రాధమ్మతల్లి మాకెక్కడ దొరికింది బాబూ! ధర్మరాజు లాంటి మనిషిని మాయం జేసింది!' ఇంకా సాగి పోతూనే వుంది ఆమె సానుభూతి.

అనూరాధ ఆ తరువాత కనులెత్తి కూడా చూడనేలేదు. ఎదుట కూర్చుని తీరికగా, వోపికతో శాపనార్థాలు పెడు తూన్న ఆ మహాతల్లిని వారించనూ లేదు. ఆగ్రహావేశాలతో ఎదురు చెప్పనూలేదు. ఆమె వుపన్యాసధార అడ్డూ అపూలేకుండా ప్రవహించిపోతోంది. అంతలో రామనాథం గారు ప్రత్యక్షమయ్యారు.

ఆ భార్యాభర్తలు ఏదో పెద్ద ఎత్తు వేసికునే వచ్చారని గ్రహించింది అనూరాధ. నిజంగా హరికృష్ణపైన అభిమానం వున్నవాళ్ళైతే ఆ కబురు అందగానే రెక్కలు గట్టుకుని వచ్చివుండేవారు. కానీ అతడు కన్పించకుండాపోయిన మూడు నెల లకు ప్రత్యక్షమై శాపనార్థాలు పెడు తూన్న ఆ దంపతుల హృదయా లెంత కోమలమైనవో అందరికీ తెలిసిపోయింది పూర్తిగా.

రామనాథంగారు వచ్చీ రావడంతోనే లాయరులా ప్రశ్నించారు—

'మా హరికృష్ణ నీకేం అపకారం చేశాడు ? ఎందుకిలా వాణ్ణి సర్వనాశనం చేస్తున్నావ్?'

అనూరాధ డైరీలు మూసి లేచి వెళ్ళి వో కుర్చీ తెప్పించి ఆయనకు వేసింది— 'ముందు కూర్చోండి! మీ అభియోగాలు చాలా వున్నాయని నాకు తెలుసు! మీరు నా పేరు విన్నప్పటినుంచీ అనుమాన బీజాన్ని నాటి, పెంచి, పెద్ద వృక్షంగా తయారుజేసారు! ఆ! ఇక చెప్పండి! మీ అనుమానాలన్నింటినీ! కానీ ఒక్క మాట మాత్రం గుర్తుంచుకోండి రామ నాథంగారూ!

ప్రతి మనిషికీ హృదయం వుంటుంది. అతికోమలంగా వుంటుంది కొందరి విష యంలో. ఆ కోమలత్వాన్ని సమూలంగా నాశనం చేసేంతవరకూ నిద్రబోరు కొందరు. అది నిజంగా రాక్షస ప్రవృత్తే! ఆ గుణం మిమ్మల్ని కొన్ని క్షణాలైనా ఆవేశించగూడదని ప్రార్థించుతున్నాను!'

ఆ మాటల్లోని గూఢార్థాన్ని గ్రహిం చాడా పెద్దమనిషి. తూణీరంలో అక్షయంగా వున్నాయి బాణాలు లనుకున్నాడు. సవ్య సాచిలా రెండు చేతులా విసరగలనని భ్రమ పడ్డాడు. కానీ ఆ వ్యంగ్యపూర్ణ హెచ్చరిక ఆయనలోని జాగరూకతను మేల్కొల్పింది.

'అమ్మాయ్! నాకు డొంక తిరుగుడు వ్యవహారాలు నచ్చవు. సూటిగా అడుగు తున్నానందుకే! నీకేం కావాలో యిక్కడి నుంచి వెళ్ళిపోతావో చెప్పు'

'ఏం తీసుకుని వచ్చావిక్కడికి?!'

'అదంతా నాకు అనవసరం! నీకేం కావాలో చెప్పు! అంతే!'

'నాకు కావలసింది మీరివ్వలేరు!'

'ఈ రామనాథం సంగతి నీ కింకా పూర్తిగా తెలియలేదనుకుంటాను. ఏం కావాలన్నా యివ్వగలడు!'

'అవి మాటలు! అయినా అలా చేయ గలనని మీ నమ్మకం నిజం మాత్రం గాదు.'

'వాదన పెంచవద్దు!'

'అని నేనూ అంటున్నాను.'

'ఇదిగో! ఈ పదివేలు తీసికొని వెళ్ళిపో!' బల్లమీద డబ్బును వుంచాడు.

'ఎందుకూ? ఎవరికివ్వను?'

'ఎందుకేమిటి? నీకే? డబ్బుతో చేయ లేనిపని లంటూ లేదీలోకంలో.'

'పొరపడుతున్నారు. డబ్బుతో అన్నీ అందవు.'

'నాది యాభైయేళ్ళ అనుభవం!'

'ఏళ్ళు అనుభవాల్ని పెంచుతాయి! కానీ సత్యాన్ని గుర్తింప జేయలేవు — అయినా నేను పోగొట్టుకున్నది డబ్బు గాదు. వచ్చిందీ దానికోసంగాదు—'

'మరి దేనికోసం వచ్చావో!'

'చెప్పవలసిందే నంటారా?

'ఆహా! చెప్పవలసిందే!

'మీ అనుభవాల్లో దొరకనిది యిది. మీరేనాడూ గుర్తించివుండని నగ్న సత్యం యిది. వువ్వు కన్నా నిర్మలమైన వో మనస్సు అందించిన ఆరాధనని కాదనలేక వచ్చాను. ఆ అనురాగమూర్తి హృదయాన శాంతినింపాలని ఎన్నో అప వాదుల్ని భరించాను. ఎందరో అపోహతో అసహ్యించుకున్నా పారిపోకుండా వున్నాను.?

'ఇదెక్కడి భాష!? ఏ గ్రంథంలోది?'



'అనురాగం అన్న అతి పవిత్ర గ్రంథం లేది? మీకీభాష అర్థంగాదని మొదటే చెప్పానుగా! నేను కోల్పోయింది అనురాగ భాండాన్ని. మీ రివ్వగలరా! చెప్పండి! హరికృష్ణగారికన్నా అయిదురెట్లు ఆస్తి వుంది ఒకప్పుడు. ఇపుడు అంతకు రెండురెట్లు సంపాదించగలను. కాని అమృతంకన్నా తీయనైన డాక్టరుగారి హృదయాన అశాంతి చెలరేగిందని తెలిసి అడుగు పెట్టాను.

అదృష్టం వక్రించి ఆయన పిచ్చివారయ్యారు.'

'అవలేదు నువ్వే చేశావంటే—'

'మీరెవరు అనడానికి?'

'మేన మామను!'

'అంతే! అంతకన్నా మరో మెట్టు ఎక్కలేదు మీ బంధం! మరి యిన్నాళ్లా ఏమయ్యారు? పిచ్చి ఎక్కకముందు ఆయన కెందుకు పెళ్లి చేయలేదు? ఆయన ఆస్తి మంచి ఎందుకు డబ్బు తీసికున్నారు? అందం లేదా? చదువురాదా? హోదా తక్కువా? గుణంలేదా? ఆయనలో? మరి అన్నీవున్న ఆయన ఏ లోపం వలన అవివాహితులుగా వుండిపోయారో చెప్పండి! ఏ మహానుభావుడు ఆయన జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా నలిపివేశాడో చెప్పండి! ఈ ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పితీరాలి మీరు! మీరు తప్ప మరొకరు చెప్పలేని. రాని ప్రశ్న యిది? ఎందుకో చెప్పనుంటారా మీరెంతో అనుభవజ్ఞులు'.

రామనాథంగారు తెల్లబోయారు. తల మీది వెంట్రుకలు గాలికి వూగిసలాడుతున్నాయి మనస్సులోని వూహల్లా.

'ఏమో! ఎవరికి తెలుసు! పెళ్లంటే విముఖతేమో!'

'సూటిగా చెప్పడం మీ అలవాటు అన్నారు!'

ఉలిక్కిపడ్డాడా పెద్దమనిషి. ఇబ్బందిగా కదిలాడు. సులోచనాల్ని తీసి వుత్తరీయంతో తుడిచి మళ్లీ వుంచుకున్నాడు.

'ఇపుడు కాదని అనడంలేదుగా!? హరి మనస్సులో ఏమున్నదో నాకెలా తెలుస్తుంది?'

'మరి హరి మనస్సులో అనూరాధను వదిలేసి వెళ్లగొట్టవలెను అని వ్రాసి వుందా? చూశారా మీరు ఆ బోర్డును?'

విభ్రాంతుడయ్యాడా పెద్దమనిషి. సూటిగా వేసిన బాణాలన్నీ తిరిగి తన మీదికే ప్రయోగించబడడంతో ఆయనకు నోట మాటే రాకుండా పోతోంది. ఏమాత్రం కాఠిన్యత నినదించకుండా మృదువుగానే ప్రశ్నించిందామె. సమాధానాలు చెప్పి తన వ్యక్తిత్వాన్ని కించపరచుకోలేక సతమతమై పోతున్నాడాయన. ఆ త్యాగమయి చేయి జాచి అడిగినది ఆయన

మరో జన్మలో కూడా యివ్వలేడు. కాని మరోసారి తన అతి తెలివిని ప్రదర్శించా అనుకున్నాడు.

'సరే! నీ వాదన బాగానే వుంది. మరి యింకా యిక్కడ విన్నాళ్ళుంటావు? చట్టరీత్యా హరికృష్ణ ఆస్తికి నేనే వారసుణ్ణి. దీన్ని కాదనలేవుగదా!'

'అది జరగనివని. ఆయన వచ్చేవరకూ ఎవరికీ హక్కు లేదిక్కడ మీరు నాది సాహసమే అన్నా, ఉన్నమాట అనకుండా వుండలేను. ఆస్తికిగాదు మీరు వారసులు. దురాశకు వారసులు. అంటే బావుంటుంది.'

మరోసారి ఉలిక్కిపడ్డాడా పెద్దమనిషి. ఎదుట నిల్చివున్న ఆమె వైపు చూశాడో క్షణం. మేడ మెట్లదగ్గర కువికిపాట్లు పడుతున్న నౌకరు, జోగులు నవ్వాపుకోలేకపోయాడా మాట విని. శకుంతలమ్మగారి తెరిచిన నోరు తెరిచినట్టే వుండిపోయింది.

'ఎంత దురుసుతనం? ఏం కథ?!' అనుకుంది లోలోన.

# ఆ రా ధ న

'మీకు అంత అవసరంగా వుంటే కుటుంబంతో సహా తరలి రండి. మనస్సుకు నచ్చినన్నాళ్ళూ ఈ యింట్లోనే వుండండి. ఆ మాత్రం సాహసం చేస్తే హరికృష్ణ నన్ను మన్నించుతారన్న నమ్మకం వుంది.'

పెద్దగా నవ్వాడా పెద్దమనిషి.

'ఏమిటమ్మాయ్? నువ్వంటున్నది? నా సొమ్ము నాకు దానం చేయడానికి కూడా 'సాహసం' గీహసం అంటూ హంగామా చేస్తున్నావే? కొన్నేళ్ళు హరికి గార్డియన్‌గా వున్నది ఈ రామనాథమేనని తెలుసా?'

'అంతే గాదు. ఆయన భవిష్యత్తు వెలుగులోకి రాకుండా అన్ని వైపులనుంచీ అందమైన వలలు అల్లింది కూడా మీరేనని తెలుసు.'

'ఏమన్నావ్?' ఆగ్రహం నిలువెత్తున లేచి నిలబడింది.

'అనూరాధ తన్నే దాంట్లో తప్పేముంది బాబాయ్! ఉన్నమాటే అంది. అయినా మాయలక్కి మంత్రాలకి చింతకాయలు రాలే కాలం గాదిది.' శారద లోనికి వచ్చి కూర్చుంది అనూరాధ ప్రక్కనే.

శారద మాట విని అప్రతిభు లయ్యారాయన. శకుంతలమ్మ ఆశ్చర్యపోయింది.

'శారదా! మంచి సమయంలో వే వచ్చావ్! ఆఖరిసారిగా చెబుతున్నాను. అనూరాధ ఈ యింట్లో వుండడానికి వీల్లేదు. హరికృష్ణ ఆస్తికి సంబంధించిన కాగితాలన్నీ నా దగ్గరే వున్నాయి. ఒక్క 'బ్యాంకు అక్కౌంటు' మాత్రమే నీ అజమాయిషీలో వుంది. వాడు తిరిగి వచ్చినపుడు పైసాతో సహా అప్పగించుతాను. అంతవరకూ ఆ సంపద మీద ఈగ వాలినా సహించలేను.'

'నిజమే! బాబాయ్! మీరు చాలా న్యాయంగా సంగ్రహించుతారు బావ సొమ్ముని. ఈగ ఎలా వాలుతుందసలు?! కనుమూసి తెరిచేంతలో ఖాళీ అయిపోదూ ఆస్తి అంతా!'

'అక్కా! ఈ బెదరింపులకి భయపడవలసిన పనే లేదు. నీరజ బ్రతికేవుందని మరిచిపోయారాయన. హరికృష్ణగారు వచ్చేంతవరకూ ఎవరి అధికారాలు అక్కరలేదు. నీరజే చూసుకుంటుంది. తోడుగా నువ్వున్నావు.'

ఆ ఎత్తులమారి మనిషి నిర్వీణ్ణుడయ్యాడు.

'మీకంత భయంగా వుంటే నా కెందుకింత బాధ! ఆ! సరే! పద! పదవే! మన చినబాబు, చంద్రాన్ని పంపించుదాం! వాడుగానీ ఈ ఆటలకి స్వస్తి జెప్పడు.' అంటూ లేచి నిల్చున్నారాయన.

'న్యాయం ఏనాడూ ఆట గాదు. అబద్ధాలలో పడలుకట్టినా అంతరంగాన హాయి వుండదు.' అన్నది అనూరాధ.

ఆయన మాట్లాడకుండా నిష్క్రమించారు భార్యతో సహా.

(ఇంకా ఉంది)



# గ్లాక్సో మిల్క్ ఫుడ్ పాపలను ఆరోగ్యంగా పుష్టికరంగా ఉంచుతుంది




## మీపాప గ్లాక్సో పాప యేనా!

మీ పాపకు మొదటినుంచి గ్లాక్సో మిల్క్ ఫుడ్ ఇవ్వండి. గ్లాక్సో మిల్క్ ఫుడ్ సంపూర్ణమైన పాపల ఆహారం. ఇది పాపల ఎముకలు, కండరాలను పెంపొందించి, నెత్తురు పట్టించగల ఆహారం. గ్లాక్సో మిల్క్ ఫుడ్—భారత, దేశంలో పాపలకు ప్రప్రథమంగా మిల్క్ ఫుడ్ తయారుచేసిన వారి నుంచి మీకు వస్తోంది.

Creative Unit-160 Tel




■ బావ అక్కను పెళ్లి చేసుకుంటాడనీ ముహూర్తం పెట్టి పంపవలసిందనీ అత్తయ్య ఉత్తరం రాసిందట. అమ్మ ఆ విషయం ఎంతో సంబర పడిపోతూ నాతో చెప్పింది. కాని ఆవిషయం నాకు సంతోషాన్ని కలిగించలేదు. మొట్టమొదటిసారిగా బావపైన కోపం వచ్చింది నాకు, నన్నుకాదని అక్కను చేసుకుంటున్నందుకు. ఏడ్పుకూడా వచ్చింది.

అక్కకంటే నేనే ఎర్రగా వుంటాను. పెద్ద పెద్ద చక్రాల్లాంటి కళ్లతో అందంగా, ఆకర్షణీయంగా వుంటాను. అక్కయ్య పి. యు. సి. చదివి అంతటితో వూరుకుంది. నేను బి. యస్. సి. ఫస్టు యియర్ చదువుతున్నాను. అలాంటప్పుడు బావ నన్ను కాదని, అక్కయ్యలో ఏం చూసుకొని ఎన్నుకున్నాడో అర్థం కాలేదు నాకు. కావైతే అక్క నాకంటే నాకన్నా ఏడాదే పెద్ద. ఆమెగారికి పందొమ్మిది, నాకు పద్దెనిమిదేళ్లు వున్నాయి. చూడ్డానికి అక్కకంటే నేనే పెద్దదాన్నిగా కనిపిస్తాను.

అమాయకంగా మెత్తగా కనబడే అక్క బావను తనవలతో వేసుకున్నందుకు ఆమె మీద కోపం వచ్చింది నాకు. ఆ తర్వాత ఆమెను వరించబోయే భోగభాగ్యాలను తలచుకునేసరికి ఈర్ష్యపుట్టింది. అక్క నా సొంత అక్కయ్యే అయినా నామనస్సు ఆమెను పరాయిదానిగా భావించసాగింది.

ఆ రాత్రి ఎప్పుడూ అక్క ప్రక్కన పడుకునే నేను మరో గదిలోకి వెళ్లి పడుకున్నాను. అక్కవచ్చి పిలిచినా నేను లేచి వెళ్లలేదు. అనవసరంగా ఆమెను కసురుకున్నాను. అలా పడుకున్నానవే మాటే కాని నాకు నిద్రపట్టలేదు. బావనుగురించి ఆలోచించకుండా నిద్ర పోదామనుకున్నాను కాని అది నాకు సాధ్యపడలేదు—

ఆ రోజు బావ తన వుద్యోగప్రయత్నం మీద హైదరాబాద్ వచ్చాడు. అతను వచ్చిన వేళావిశేషం ఎటువంటిదో గాని ఏమంత శ్రమపడకుండానే ఓ పెద్ద ఎలక్ట్రిక్ యిండస్ట్రీస్ (ప్రయివేటు)కంపెనీలో రిప్రజెంటేటివ్‌గా వుద్యోగం దొరికిందతనికి. ఆ కంపెనీ బ్రాంచి ఆఫీసు విజయవాడలో వుందిట. బావ అక్కడ పని చెయ్యాలిట.

'కంగ్రాచ్యు లేషన్స్ బావా! నీకు వుద్యోగం దొరికిందిగా ... మా అందరికీ పార్టీ 'ఇవ్వాలి'. అన్నాను ప్రయాణానికి సిద్ధమౌతున్న బావను సమీపించి.

'తప్పకుండా పార్టీ అందరికీ యిస్తాను. నీకు మరో స్పెషల్‌కూడా వుంది.' అన్నాడు.

'ఏమిటది?' అడిగాను నా పెద్దకళ్లను మరి పెద్దవిగాచేసి.

సూట్‌కేస్ సర్దుకుంటున్న వాడల్లా నావైపు తిరిగి నా ముఖంవైపు ఎలాగో చూసాడు. ఆ వెంటనే తన రెండుచేతులతో నా ముఖాన్ని పట్టుకొని, నా పెదాల్ని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

అనుకోని ఈ సంఘటనకు నేను వుక్కిరిబిక్కిరి అయ్యాను.

'ఛీ! ఏమిటిది బావా ... వదులు.' అంటూ బలంగా బావ చేతుల్ని విడిపించుకుని విసురుగా ఆ గదిలోనుంచి బయటికి వచ్చేశాను.

జరిగింది ఎవరూ చూడలేదు కాబట్టి సరిపోయింది. అదే ఎవరైనా చూసుంటే రభస చేసేదాన్ని. ఎంత మేనత్తకొడుకైతే మాత్రం మరీ అంత చనువా?

బాత్‌రూమ్‌లోకి వెళ్లి నీళ్లతో ముఖం కడిగేసుకున్నాను. అలా కడిగేసుకుని వచ్చేసరికి బావ వూరు వెళ్లిపోయాడని మాటల సందర్భంలో అమ్మ చెప్పింది.

వారం పదిరోజుల తర్వాత బావ వద్దనుండి నాన్నగారికి వుత్తరం వచ్చింది. అందులో తను ఉద్యోగంలో చేరినట్టు, అరవై రూపాయలకు ఒల్లు అద్దెకు తీసుకొని అత్తయను మాజీపేటనుండి తీసుకు వచ్చేసినట్టు రాసేడు.

మరో నెలరోజుల తరవాత—

ఓ రోజున నేను నిద్రలేచేసరికి బావ వచ్చివున్నాడని తెలిసింది. ఆ మరుక్షణం నుంచే నా కళ్ళు అతనికోసం వెతికాయి. నాన్నగారి గదిలో మంచంమీద నిద్రపోతూ కనిపించాడు బావ. పాపం. రాత్రంతా ప్రయాణం మూలంగా నిద్రలేదేమో వళ్ళు మైమరచి నిద్రపోతున్నాడు.

నేను స్నానం చేస్తుండగా గుమ్మం దగ్గర ఏదో అలికిడయ్యింది. 'ఏమిటా' అని అటువైపు చూశాను. అక్కడ బావ నిలబడివున్నాడు. నేను ఒక్కసారిగా నిర్ఘాంత పోయాను. అతను నావైపే చూస్తున్నాడు. వెంటనే నాచేతికి అందుబాటులో వున్న టవల్‌ను అందుకొని సాధ్యమైనంతవరకూ వళ్ళు కప్పేసుకున్నాను. బావ అక్కడ్నుండి వెళ్ళిపోయాడు. ఇదంతా కొన్ని క్షణాల్లో జరిగిపోయింది. అసలు బావ అక్కడికి ఎలా రాగలిగేడో నాకర్థం కాలేదు. కాస్సేపటికి గుర్తుకొచ్చింది స్నానం చేస్తున్నప్పుడు లోపలినుండి గడియ వేసుకోవటం నేను మర్చిపోయానని.

ఆ తర్వాత బావ ఎదుట పడకుండా ఎలాగో నాలుగు మెతుకులు తిని కాలేజీకి వెళ్ళిపోయాను. ఆ రోజు శనివారం కాబట్టి కాలేజినుండి తిరిగివస్తూ చిక్కడపల్లిలోవున్న శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయానికి వెళ్ళాను. ప్రతీ శనివారం ఆ గుడికి వెళ్ళటం అలవాటు నాకు.

దేవుని దర్శనం చేసుకొని, గుళ్ళోనుండి బయటికి వస్తున్న నాకు తలవనితలంపుగా బావ కనిపించాడు. అతను కనిపించేసరికి సాక్షాత్తు దేవుడే కనిపించినంతగా వుబ్బిపోయాను. ఎందుకో బావతో మాట్లాడ్డానికి అక్కడ బిడియపడ్డాను.

'దేవుని దర్శనమయిందా ?' చిరునవ్వు ముఖంతో పలకరించాడు బావ.

'అయింది.' అన్నాను మెల్లిగా.

'మరి అమ్మాయిగారు ఏం కావాలని కోరుకున్నారో దేవుని దగ్గర ?' అడిగాడు చిలిపిగా.

'నువ్వు కావాలని' అని అందామనుకున్నాను. కాని మరీ అంత సిగ్గువిడిచి చెప్పేయలేకపోయాను.

నా వద్దనుండి జవాబు రాకపోయేసరికి,

'ఏమని కోరివుంటావులే. అందగాడూ, డబ్బూ, హోదా గలవాడు, మంచివాడు భర్తగా దొరకాలని కోరుకొని వుంటావు. అంతేనా ?'

'నేనేమని కోరుకున్నానో అంతగా తెలుసుకోవాలనివుంటే, వెళ్ళి ఆ దేవుణ్ణే అడిగి తెలుసుకోరాదూ.'

'అబ్బో ! చాలా తెలివిగా మాట్లాడుతున్నావే ?'

'ఆ!...నా తెలివికేంగాని, ఈ రోజు వుంటావా ?' అంటూ ప్రసంగాన్ని మళ్ళించాను.

'లేదు. కంపెనీ పనిమీద వచ్చాను. ఆ వచ్చిన పని అయిపోయింది. తిరిగి ఈ రాత్రికే వెళ్ళిపోతున్నాను'...అని మళ్ళీ 'పోతూ పోతూ ఏదో దేవుని దర్శనం చేసుకునిపోదామని వచ్చాను. ఆ దేవుని దర్శనానికి ముందే ఈ అందాలదేవిగారి దర్శనమయింది.' అన్నాడు.

ఆ మాటకి నేను సిగ్గుపడ్డాను. బావ ముఖంలోకి సూటిగా చూడకుండా 'ఏమిటా మాటలు బావా! ఎవరైనా వింటే ఏమనుకుంటారు?' అన్నాను మెత్తగా మందలించే ధోరణిలో.

'ఏమనుకుంటారూ? నీతో మాట్లాడుతున్నందుకు నన్ను చూసి ఈర్ష్యపడతారు ...యిక పోతే నిన్ను చూసి...'

ఇంకా ఏదో చెప్పబోతున్న బావకు అడ్డు తగిలి—

'నువ్వు అలా మాట్లాడితే నేను వెళ్ళిపోతాను.' అన్నాను.

'సరే. ఇక నువ్వు పొగడమన్నా పొగడను. కాని గుళ్ళోకి వెళ్ళి వద్దాం పద.' అన్నాడు బావ.

'నే నెందుకూ! నేనిప్పుడేగా వెళ్ళి వచ్చాను.'

'నువ్వు కోరుకున్నదేమిటో ఆ వెంకటేశ్వరస్వామి సరిగా వినలేదట. అలా అని ఆయన నాతో చెప్పాడు. పద మరో సారి ఆ స్వామికి వినబడేటట్టు చెబ్దువు గాని.'

నేను తిరిగి బావతో దేవదర్శనానికి వెళ్ళాలా వద్దా అని ఓ క్షణం ఆలోచించి వెళ్ళడానికే సిద్ధపడ్డాను. కాని అంతలోనే నా తోటి విద్యార్థిని సుందరి కనిపించి 'ఏమే మీనా! యింటికి వెళ్తున్నాను. వస్తావా పోదాం.' అంది.

సుందరి వాళ్ళ యిల్లు కూడ మా యింటికి వెళ్ళే దార్లోనే వుంది. నాకు ఏటు చెప్పడానికీ తోచలేదు. నా నుండి జవాబు రాకపోయేసరికి—

'అయామ్ సారీ ! ఎవరితోటో మాట్లాడుతున్నట్టున్నావ్. నేను వెళ్తాను మరి.' అంటూ వెళ్ళబోయింది సుందరి.

'వుండవే నేను వచ్చేస్తున్నాను' అని, బావవైపు తిరిగి 'నేను యింటికి వెళ్తాను బావా. చీకటి పడుతుందిగా. ఇంటి దగ్గర అమ్మావాళ్ళూ నేనింకా కాలేజీనుండి రానందుకు గాభరాపడుతూ వుంటారు. మరో విధంగా భావించకు. ఎక్స్‌క్యూజుమి.' అన్నాను ప్రాధేయపూర్వకంగా.

బావ మాట్లాడలేదు.

'స్నేహితురాలు నాగురించి నిలబడి వుంది. వస్తాను మరి' అని చెప్పి వచ్చేశాను.

అలా ఇంటికి వచ్చేసింతర్వాత, బావ కోరికను కాదన్నందుకు బాధపడ్డాను. బావతో గుళ్ళోకి వెళ్ళివుండ వలసింది. నేను తనతో రానందుకు బావ కోపగించుకొని వుంటాడు, అనుకున్నాను.

అందుకే నన్నుకాదని బావ అక్కను పెళ్ళి చేసుకుంటున్నాడేమో? అన్న సందేహం కలిగింది. కాని అదే సరైన కారణమని నాకు అనిపించలేదు. మరి, బావా అక్కయ్యా వొకర్నొకరు ప్రేమించుకున్నారేమో ? అలా అనుకునేసరికి నామనస్సు మూగగా విలపించింది. ఇన్నాళ్ళూ బావతోటే నా జీవితం అనుకున్నాను. పెళ్ళంటూ చేసుకుంటే బావనే చేసుకోవాలి అనుకున్నాను. ఇప్పుడు బావ పరాయివాడౌతూంటే చూసి భరించగలనా? మనస్సంతా ఆ వేదనతో నిండిపోయింది.

ఆ రాత్రి నాకు నిద్ర కరువైంది.

ఆ మర్నాటినుండి నాలో అనుకోని మార్పు వచ్చేసింది. ఇంటా బయటా మితంగా మాట్లాడ్డం మొదలుపెట్టాను. నాలో చురుకుతనం, చిలిపితనం సన్నగిల్లాయి. వాటిస్థానే సోమరితనం, చిరాకూ చోటు చేసుకున్నాయి. చదువులో ఆటల్లో మునుపటి ఉత్సాహాన్ని కనబర్చలేక పోతున్నాను. అసలు నా మనస్సును ఏ ఒక్క పనిమీదా లగ్నం చేయలేక

పోతున్నాను.
ఒకరిద్దరు స్నేహితురాళ్లు నాలో కలిగిన మార్పును గమనించి కారణమడిగారు, వంట్లో బాగుండటం లేదని నో చిన్న అబద్ధం ఆడేశాను.

ఇంట్లోవాళ్లు ఎవరి హడావిడిలో వారు వున్నారు. నాన్నగారు పురోహితుణ్ణి సంప్రదించి పెళ్లికి లగ్నం పెట్టించేశారు. ఆ పెట్టిన ముహూర్తం దగ్గర్లోనే వుండటంవల్ల అమ్మా నాన్నా పెళ్లి ఏర్పాట్లలో మునిగి పోయారు. అక్కయ్య ఆనందానికి హద్దంటూ లేదు. ఆమెలో పెళ్లికళ వచ్చేసింది. తనకు కావలసిన చీరలూ, నగలూ కోరికోరి తెప్పించుకుంటూంది. తమ్ముడు గోపి ఆ బట్టలు కావాలి, ఈ బట్టలు కావాలని పట్టుబట్టి మరీ కుట్టించు కుంటున్నాడు. ఆయింట్లో నేను తప్ప అంతా ఆనందంతో హడావిడిగా వున్నారనే చెప్పాలి.

ఎలాగో రోజులు దొర్లిపోతున్నాయి నాకు.

నాన్నగారు వుత్తరంలో తెలియబర్చిన ప్రకారం పెళ్లిరోజుకి రెండు రోజులు ముందుగా మగపెళ్లివారు – అంటే బావా అత్తయ్యావాళ్లు కొంతమంది బంధువులతోటి వచ్చారు. వారందరికీ సత్రంలో విడిది ఏర్పాట్లు నాన్నగారు ముందుగా చేసి వుంచారు.

పెళ్లిరోజు వరకూ బావకు కనిపించకుండా తప్పుకు తిరిగాను నేను. నాకు

# నా బావ

బావను చూడాలనివున్నా నా హృదయం ఎదురు తిరిగింది. ఆ వచ్చినరోజు రాత్రి అత్తయ్య నా చదువుగురించీ, యింకా అటువంటి విషయాలగురించీ మాట్లాడింది నాతో. నేను ముక్తసరిగా జవాబిచ్చాను. ఆమెతో ఎందుకో మనసిచ్చి మాట్లాడలేక పోయాను. బహుశా, బావపైన నేను లేనిపోని ఆశలు పెంచుకోడానికి అత్తయ్య కొంతవరకూ కారకురాలు కావటమే అందుకు కారణమేమో?

ఆ రోజు రాత్రి పెళ్లిఅనగా నేను వెళ్లి నా ఫ్రెండ్స్‌ని ఆహ్వానించాను. అదీ అమ్మ బలవంతంమీద ఆ పని చేశాను.

పెళ్లి చాలా సందడిగా ఘనంగా జరిగింది. ఆ పెళ్లిపందిట్లో నేను మినహా అంతా కళ కళ లాడుతూ ఎంతో వుత్సాహంతో వున్నట్టు కనిపించారు. మంగళ సూత్రధారణప్పుడు అక్కస్థానంలో నేను వున్నట్టుగా చిత్రించుకుని క్షణిక ఆనందాన్ని పొందకుండా వుండలేకపోయాను.

అక్కయ్య అదృష్టవంతురాలు. అందుకే బావను పొందగలిగింది. బావను పొందటానికి అక్క ఎన్నిపూజలు చేసిందో, ఎన్నెన్ని నోములు నోచిందో? దేవుడు ఆమెను కనికరించాడు.

'ఆ దేవుడే నన్ను కనికరించలేదు. ఎందుకనో? నేనుమట్టుకు ఏం తక్కువ పూజలు చేశానని?...' అలా నాలో నేను ప్రశ్నించుకున్నాను. 'నా పిచ్చిగాని వున్న బావ వొక్కడూ మేము యిద్దరం. దేవుడు మట్టుకు ఏం చేయగలడు పాపం.' అంటూ సమాధాన పడ్డాను.

పెళ్లినాటి నాల్గవరోజున అక్కతో సహా బావ ప్రయాణమైయ్యాడు. ఇల్లు విడిచి వెడుతున్నప్పుడు అక్క నన్ను కౌగలించుకుని ఏడ్చింది. అక్కను చూస్తూంటే నాకూ ఏడ్పు వచ్చింది. ఏడ్చేశాను.

'అరే! మీనా ఏడుస్తూందా! తన పెళ్లికి లైన్ క్లియర్ దొరికినందుకు సంతోషించ వలసిందిపోయి ఏడుస్తుందా?' అంటూ బావ పరిహాస మాడాడు.

ఆమాటకి అక్కడవున్న వారంతా నవ్వారు. నాకు నవ్వు రాలేదు. పైపెచ్చు బావమీద కోపంవచ్చింది. 'బావ దగాకోరు' అని నాలో కసిగా అనుకున్నాను. పైకి ఎంతో తియ్యగా మాట్లాడుతాడు. లోపలంతా కుళ్లే.

అక్క బావతో కలిసి వెళ్లిపోయింది. బంధుమిత్రులు ఎవరిదారిన వారు వెళ్లిపోయారు. పెళ్లిసందడి పూర్తిగా తగ్గిపోయింది.

కొన్నాళ్లుగా మూలపడవేసిన పుస్తకాలను చేతుల్లోకి తీసుకున్నాను. మనస్సు నిలకడచేసి చదువు సాగించాలనుకున్నాను. కాని కొద్దిరోజులదాకా నా కది సాధ్యపడలేదు. అప్పుడప్పుడు బావ గుర్తుకు వచ్చేవాడు. అతని చేష్టలు గుర్తుకు వచ్చేవి. అలాంటప్పుడు నా చదువుకు అంతరాయం కలిగేది. నేను కోరుకున్న బావను పొందలేక పోయినందుకు బాధ పడేదాన్ని. నా బాధను ద్వేషంగా మార్చుకొని అక్కయ్యను ద్వేషించుకునేదాన్ని.

బావ తన కంపెనీ పనిమీద నెలకో సారి లేక రెండు నెలలకోసారి హైదరాబాద్‌కి వచ్చేవాడు. బావ ఫలానా రోజున వస్తున్నట్టు ముందుగా అక్క మాకు వుత్తరం ద్వారా తెలియపరిచేది, తన క్షేమ సమాచారాలతో పాటు.

బావ వస్తున్నరోజున నేను కాలేజీకి వెళ్లేదాన్ని కాదు. వోసారి వెళ్లినా మధ్యలోనే వచ్చేసేదాన్ని. ఎందుకో బావను చూడాలని వుండేది. అతన్ని చూసేసరికి



నన్ను నేను మర్చిపోయేదాన్ని. అతనితో ముందటిలాగే చనువుగా మాట్లాడేసే దాన్ని. బావపై అంతకుముందు కలిగిన కోపమూ అలాంటివి నాలో తాత్కాలికంగానే నిలిచి మాయమయ్యాయి.

బావలో కాస్తోకూస్తో మార్పు వచ్చినట్టు గమనించాను. వెనుకటిలాగ మరీ చిలిపిగా మాట్లాడ్డం మానేశాడు. అక్క గురించి అడిగితే అంతంత మాత్రంగానే చెప్పేవాడు. పోయిన ఉగాది పండగకు అక్కయ్యను ఎందుకు తీసుకు రాలేదని అడిగితే, ఏవో అనివార్యకారణాలవల్ల రాలేకపోయామని చెప్పాడు. నాకెందుకో వాళ్ల దాంపత్యజీవితం సరిగా లేదేమో నన్న అనుమానం కలిగింది. దాంతో నా మనస్సుకి ఊరట లభించినట్టు ఫీలయ్యాను.

అక్క పెళ్లయి ఐదునెలలు గడిచిపోయాయి.

ఉన్నట్టుండి ఒకరోజున అక్కయ్య దగ్గర్నుండి నాన్నగారికి ఉత్తరం వచ్చింది. అక్కయ్య నెల్తపుతో వున్నట్టు, నాలుగోనెల [illegible] అందులో రాసివుంది. అది విన్న అమ్మ తను అమ్మమ్మ కాబోతున్నందుకు మురిసిపోయింది. నాన్నగారు సంతోషించారు. వాళ్లతోపాటు ఆ సంతోషాన్ని నేను పంచుకోలేక పోయాను.

ఆ మర్నాడే తమ్ముణ్ణి తీసుకుని అమ్మ విజయవాడ వెళ్లింది అక్కను చూసి రావటానికి. కాలేజీలకి సెలవులే కాబట్టి నాన్నగారు నన్నుకూడ వెళ్లి రమ్మన్నారు. కాని నేనే వెళ్లడానికి నిరాకరించాను. ఒకవేళ వెళ్లినా అక్కడ అక్క అనుభవిస్తున్న సుఖాన్ని చూసి హోర్వలేనని నాకు తెలుసు. వాళ్ల దాంపత్య జీవితంపై నాకు అసూయ కలగక తప్పదు. నా ప్రవర్తన ఏమిటో అర్థంకాక అందరూ బాధపడవచ్చు. అందుకే వెళ్లదల్చుకోలేదు.

విజయవాడలో వో వారం రోజులుండి అమ్మా తమ్ముడు తిరిగి వచ్చారు.

అక్క నన్నొకసారి రమ్మని మరీ మరీ చెప్పిందట. అలా అని అమ్మ నాతో చెబుతూ, అక్కయ్య నా పేరిట రాసిచ్చిన వో చిన్న ఉత్తరం నా చేతికిచ్చింది. అది తీసి చదువుకున్నాను. అందులో తను ఎలా సుఖపడుతున్నదీ, బావ తనను ఎంత ప్రేమగా చూసుకుంటున్నదీ, తను విజయవాడలో బావతో తిరిగి చూసిన స్థలాలు మొదలగు వాటిని గురించి రాసింది. ఉత్తరం ముగింపుచేస్తూ నన్నొకసారి రమ్మని రాసింది.

'రాస్తుంది. ఎందుకు రాయదూ... తను అనుభవిస్తున్న సుఖాల్ని ప్రత్యక్షంగాచూసి మరీ ఏడ్వమని రాసింది... వచ్చినా నేనక్కడికి వెళ్లేది లేదు' అని నాలో నేను కసిగా అనుకొని పైకి 'వచ్చేది ఆషాఢమాసంగా.........అక్కయ్య అప్పుడు ఎలాగూ వస్తుంది. ఇప్పుడు నేనెందుకు వెళ్లటం అక్కడికి' అన్నాను అమ్మతో.

నాకు ఎక్కడికీ వెళ్లాలని అనిపించటం లేదు. చివరికి స్నేహితురాండ్రతో షికారు వెళ్లడానికి, సినిమాలు చూడటానికి కూడ మనసొప్పటం లేదు. ఏదో చెప్పలేని దిగులు నన్ను ఆక్రమించుకుంది. పిచ్చి పిచ్చి ఆలోచనలు ఆలోచిస్తూ చాలా సేపు గడిపేసేదాన్ని. దాంతో నా ఆరోగ్యం దెబ్బతింది.

అమ్మ నాలో కలిగిన మార్పును గమనిస్తూ వుంది కాబోలు వో రోజున 'మన చిన్నమ్మాయికి పెళ్లిచేసేస్తే మంచిదేమోనండీ. ఎప్పుడూ ఏదో పరధ్యానంగా వుంటోంది. చదువుమీదకూడ శ్రద్ధ చూపటం లేదు' అని అమ్మ నాన్నగారితో చెప్పడం నేను విన్నాను.

'నాకు అలానే అనిపిస్తూంది. చూద్దాం' అన్నారు నాన్నగారు.

నా మనస్సులో రాయి పడ్డట్లయింది. నాకు పెళ్లా! నేను దిగులుగా, పరధ్యానంగా వుంటున్నది నాకు పెళ్లికాలేదనా! నా కిప్పుడప్పుడే పెళ్లొద్దు. అసలు నేను పెళ్లే చేసుకోనని వాళ్లతో చెప్పా లనుకున్నాను.

తను కిష్టంలేని వ్యక్తిని పెళ్లాడి, అతన్ని ప్రేమించలేక మనస్ఫూర్తిలేక కాపురం చేస్తున్న స్త్రీలు వుంటే వుండవచ్చుకాని అది నా వల్లకాదు అనుకున్నాను.

నాలో మెరుపులా ఒక ఆలోచన మెరి

---

కూరలూ గుణాలూ:

## చిక్కుడుకాయ

చిక్కుడుకాయకూర చలవచేసి నీరు పెడుతుంది. హృదయాన్ని, ఊపిరి తిత్తుల్ని బలపరచి వీనికి సత్తువ కలుగజేస్తుంది. విషపదార్థాలను హరించడానికి తోడ్పడుతుంది. శుక్లరసాన్ని పుట్టనివ్వదు. పుంసత్వాన్ని హెచ్చిస్తుంది. మూత్రం బాగ అయేటట్లు చేస్తుంది. మూత్రపు సంచిలో పుట్టేరాళ్లను తొలగించడానికి తోడ్పడుతుంది. బాలింతలగు స్త్రీలకు చనుబాలు అధికమయేటట్లు చేస్తుంది.

విరేచన బద్ధం, గురుత్వం, అజీర్ణం, కడుపునొప్పి చేస్తుంది. కడుపులో వాతాన్ని పుట్టిస్తుంది. విదాహాన్ని కలుగజేస్తుంది. నీరసాన్ని కలుగజేస్తుంది. మెదడుకు, కళ్లకు నష్టాన్ని కలుగజేస్తుంది. శ్లేష్మాన్ని పెంచుతుంది. పైత్యాన్ని హెచ్చిస్తుంది.

చిక్కుడు గింజలు వేడిచేసి నీరసాన్ని కలుగజేస్తాయి. నేత్రరోగం, క్షయ, విదాహం, కడుపుబ్బు, అపానవాయువు వీనిని పుట్టిస్తాయి. పైత్యాన్ని హెచ్చిస్తాయి.

గోరుచిక్కుడుకాయ చలవచేసి ఆర్చును. మిక్కిలి పైత్యం చేస్తుంది. అజీర్ణం, కడుపుబ్బు పుట్టిస్తుంది.

దీనికి విరుగుళ్లు:- 1. సోమము 2. సొంఠి, కరక్కాయ పిందెలు, ఉప్పు ఈ మూడింటి చూర్ణము 3. జీర్ణౌషధములు 4. నీళ్లలో బాగా ఉడికించి వార్చడం 5. బాదం నూనెలో పొగచడం, 6. పుదీనా, లవంగాలు మొదలగు మసాలా వస్తువులువేసి వండడం.

సేకరణ:- ఆకుండి నారాయణమూర్తి

సింది. అది ఈ సారి బావ వచ్చినప్పుడు నన్ను పెళ్లి చేసుకుంటాడేమో అడగాలని. ఎందరికి లేరు యిద్దరు పెళ్ళాలు! అందులో తప్పుగాని, ఏదో చేయరాని పని గాని వున్నట్టు నా కనిపించలేదు. ఇక అక్క సంగతి—నేను తన జీవితంలోవచ్చి భాగం పంచుకుంటానంటే ఒప్పుకోకుండా పోతుందా? తన తోబుట్టువు గురించి ఆ మాత్రం చిన్నత్యాగం చెయ్యలేకపోతుందా?

ఇటువంటి ఆలోచనలతో నేనా రాత్రి నిద్రపోయాను...

బావా నేనూ 'రిజిస్టర్ మేరేజస్' జరిపే ఆఫీసుకి వెళ్లాం. ఆ ఆఫీసులోని ఆఫీసరుతో బావ ఏదో మాట్లాడేడు. ఆ ఆఫీసరు చిరునవ్వు ముఖంతో మావైపు చూస్తూ వాకరిజిస్టరు (పుస్తకం) చూపించి అందులో సంతకాలు పెట్టమన్నాడు. అంగీకారసూచకంగా మేమిద్దరం సంతకాలు పెట్టాం. మా ఇద్దరిచేతుల్లో రెండు పూలదండలున్నాయి. నా దగ్గర వున్న పూలదండను బావ మెడలో వేశాను. బావ తనవద్దనున్న పూలదండను నా మెడలో వేసాడు. ఆనందంతో పరవశించి పోతూ ఎన్నో కోరికలను నింపుకున్న కళ్లతో బావవైపు చూశాను. బావ నా వైపు చిరునవ్వు చిందిస్తూ చూశాడు. ఆ చూపుల తూపులను భరించలేక సిగ్గుతో ముడుచుకు పోయాను నేను. అలా ముడుచుకుపోయిన నన్ను తన బలిష్ఠ

# నా బావ

మైన హస్తాలతో చుట్టేసి ముద్దుపెట్టుకున్నాడు బావ, ఆఫీసరు వున్నాడన్న సిగ్గయినా లేకుండా.

ఆటు తర్వాత ఆఫీసరు దగ్గర సెలవు తీసుకొని అక్కడినుండి బయటకు నడిచాం మేమిద్దరం. ఇంకా ఆఫీసుగది గుమ్మం దాటలేదు. అంతలోకే ఎవరో నల్లటి ముసుగు వేసుకున్న స్త్రీ ఆగదిలోకి వచ్చి, తనవద్దనున్న పిస్టల్‌ను బావవైపు గురి పెట్టింది. నేను భయంతో కంపించి పోయాను అంత బలశాలి, ధైర్యశాలి అయిన బావ ఏమీచెయ్యకుండా ఆమెను చూస్తూ బొమ్మలా నిలబడిపోయాడు, ఆ ముసుగులో వున్న స్త్రీ పెద్దగా నవ్వుతూ రెండుసార్లు పిస్తోలును పేల్చింది. ఆ మరుక్షణమే బావ 'మీనా!...' అంటూ నేల కూలి పోయాడు.

'బావా!...' అంటూ గట్టిగా కేక పెడుతూ నిద్ర లోనుంచి లేచిపోయాను నేను. నా ఒళ్ళు చల్లబడిపోయింది, గుండె వడివడిగా కొట్టుకుంది. కాని అంతట్లోనే వచ్చింది కలమాత్రమేనని, నిజం కాదని గ్రహించాను. కాస్సేపటికి నాగుండె దడ తగ్గింది. నాకొచ్చిన కలలో మంచిది మాత్రమే నిజంచెయ్యమని ఆ శ్రీనివాసుణ్ణి మనస్సులోనే తలచుకొని నమస్కరించాను.




యింట్లో ఎవ్వరూ నిద్రలేచినట్టు లేదు. నేను నిద్రలోపెట్టిన కేక ఎవరికీ వినిపించలేదేమో!

నేను మట్టుకు మేలుకునే వున్నానంటూ ముందు హాలులోవున్న గోడ గడియారం నాలుగు కొట్టింది.

కాస్సేపు కన్నుకలపరించి ఆలోచిస్తూ మంచంమీద అటూ ఇటూ పొర్లాను. నాకు తిరిగి ఎప్పుడు నిద్రపట్టిందో పట్టేసింది.

యెవరివో ఏడుపులు వినబడేసరికి ఉలికిపడి నిద్రలోనుండి మేలుకున్నాను. ఆ ఏడుపు అమ్మదేనని తెలిసేక నాకు కంగారు పుట్టింది.

'...అయ్యో తల్లీ, అప్పుడే నీకు నూరేళ్లు నిండాయా? అయ్యో భగవంతుడా' అంటూ అమ్మ రోదిస్తూంది.

నాకేమీ అర్థం కాలేదు. కాని ఏదో కీడు ఎవరికో జరిగిందని మాత్రం అనుకున్నాను, అంతలోనే నాన్నగారు గాభరాగా నా దగ్గరికి వచ్చారు. ఆయనచేతిలో టెలిగ్రాం చూసేసరికి నాకు నోటమాట రాలేదు. ఏం జరిగిందన్నట్టుగా ఆయన వైపు చూశాను.

'అక్కయ్యా, అత్తయ్యా ఎలక్ట్రిక్ షాక్ తగిలి రాత్రి చనిపోయారటమ్మా. వెంటనే బయలుదేరి రావలసిందిగా బావ టెలిగ్రాం ఇచ్చాడు' అంటూ నాన్నగారు దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చేశారు. అంతలోనే తేరుకొని 'టాక్సీ తీసుకు వస్తాను. బయలుదేరడానికి సిద్ధంగా వుండండి.' అని, బైటకి వెళ్లిపోయారు.

నాన్నగారు చెప్పింది నేను నమ్మలేకపోయాను. 'ఇదికూడా కలలోఒక భాగమేమో!' అనిపించింది. కాని అమ్మను చూసేసరికి అలా అనిపించలేదు.

అమ్మదగ్గరకి వెళ్లి నేను కూడ దుఃఖించకుండా వుండలేక పోయాను తమ్ముడు జరిగిందేమిటో సరిగా అర్థం కాక బిక్కమొహం వేసుకొని నిలబడి పోయాడు.

అప్పటికే ఈ దుస్సంఘటన మాయింటి చుట్టుప్రక్కల వాళ్లకి తెలిసిపోయింది. వాళ్లంతా వచ్చి అమ్మను ఓదారుస్తూ తమ సానుభూతిని తెలుపుతున్నారు.

మరో పావుగంటకి నాన్నగారు టాక్సీ తీసుకువచ్చారు.

నేను వాళ్లతో వెళ్లడానికి నిరాకరించాను. నేను రానన్నాను. నేనెందుకు రానంటున్నానో వాళ్లకి అర్థంకాలేదు.

'నా తల్లీ! కడసారిగా అక్కను చూసుకోవా?' అంటూ దీనంగా అడిగారు నాన్నగారు.

'లేదు నాన్నగారూ నేను రాలేను. అక్కయ్యను నేను చూడలేను... మీరు వెళ్ళిరండి...నన్ను మట్టుకు రమ్మని బలవంతం చెయ్యకండి.' అన్నాను. నాన్నగారు ఏమనుకున్నారో ఏమో 'సరే నీ యిష్టం' అన్నారు. అమ్మకూడ నేను రానంటే ఎదురు చెప్పలేదు.

మరి కాస్సేపటికి వాళ్లంతా ఎలా వున్నవాళ్లు అలా బయల్దేరి వెళ్లిపోయారు టాక్సీలో.

వాళ్లు వెళ్లిపోయాక, అక్కా నేనూ కలిసి తీయించుకున్న ఫోటో దగ్గరికి వెళ్ళి చాలా సేపటిదాకా విలపించాను. ఏదో తప్పుచేసిన దానిలా నన్ను క్షమించ గలిగితే క్షమించమని అక్కను వేడుకున్నాను.

'నా వుసురు తగిలి అక్కపోయింది. నా వుసురు తగిలే అక్కతోపాటు అత్తయ్యకూడా పోయింది. బావను వంటరి వాణ్ణి చేశాను...నేను పాపిష్టిదాన్ని'... అలా నన్ను నేను నిందించుకోకుండా వుండలేకపోయాను. ●



# వాన

ముక్తేవి భారతి

అనుకోకుండా మొదలైంది వాన.

పక్కింటివాళ్ళ పిల్లలు, ఆ పిల్లల తల్లి, ఆవిడ మరిది, ఆ ఇంటాయన కూడా కిటికీలోంచి రోడ్డును చూస్తున్నారు. వానలో తడవటాన్ని లెక్కపెట్టేదేమిటన్నట్లు తడుస్తూ పోతున్నవాళ్ళని, ఆ వానకే మొక్క మొలుస్తామన్నట్లు ఇళ్ళపక్కన, చెట్ల కింద తల దాచుకుంటున్న వాళ్ళని, బట్టలమీద వాన నీళ్ళు చిందిపడుతాయేమోనని ముద్దుగానే భయపడి దిక్కుతోచకుండా పరిగెత్తే పడుచువాళ్ళని, చూస్తూ, నవ్వుకుంటూ, మధ్య మధ్య జాలిపడుతూ, వెక్కిరిస్తూ, విమర్శిస్తూ ఆ కిటికీలోనే అన్ని తలలూ అవతలకు జరగనీయకుండా ఆనందపడుతున్నారా ఇంటివాళ్ళు.

వానచినుకు పడిందంటే చాలు ఇందిరకి కోపం!

'ఎన్నాళ్ళకు వానచినుకు పడిందండీ' అంటుంది కుంభవృష్టి కురుస్తుంటే పక్కింటావిడ.

ఇందిర కిటికీలోంచి చూసింది — అమ్మో! ఆ వానచినుకు కిటికీలోంచి ఇంట్లో పడితే —? గబుక్కున లేచి కిటికీ తలుపువేసి కూచుంది ఇందిర.

ఒక్కసారి గదంతా పరిశీలనగా చూసుకుంది. కిటికీకి అందమైన కర్టెనులు, గోడలకి చక్కని పెయింటింగ్స్, మూలల పూలకుండీలు, ఆ పక్కగా రేడియో, దానిమీద డాన్సింగ్ డాలు, ఒక పక్కగ పేజీ కూడా తిరగెయ్యకుండా, నలగకుండా అట్టలువేసి అమర్చిన పుస్తకాల షెల్ఫు; మధ్య టేబుల్మీద ఖరీదయిన ఆల్బమ్, అందులో అన్నీ తన పెళ్ళినాటి అందమైన రంగు ఫోటోలు — ఫోటోలు— ఒక్కొక్క పేజీ తిప్పుతోంది ఇందిర.

తలుపు చప్పుడవటంతో సోఫాలోంచి లేచింది.

'రెండగ్గిపుల్లలుంటే అమ్మ ఇమ్మంది' చిన్ని చింపిరిజుట్టు పక్కకు తోసుకుంటూ అడిగింది.

'ఏం మీ అన్నయ్య ఇంట్లో లేడా.'

'ఉన్నాడండీ...కాని వానకదూ, అందుకు కొట్టుకు వెళ్ళలేదు.

'అవును, వాన...' ఇందిర లేచి రెండంటే రెండే అగ్గిపుల్లలు తెచ్చి చిన్ని చేతిలో పెట్టింది.

'అబ్బ...ఛీ' తడిపాదాలు గదిలో అక్కడక్కడా కనిపించాయి. ఇందిర విసుక్కుంటూ గదంతా పొడిగుడ్డతో పట్టింది.

ఆఫీసునుంచి వచ్చి చాలాసేపయి గదిలో పేపరు చదువుతూ పడుకున్నాడతను.

'వేడిగా కాఫీ తాగుదామా హాయిగా' అతని చేతిలో పేపరు పక్కన పడేస్తూ అంది ఇందిర.

'కాఫీ ఏమిటి...ఈ వానలో వేడిగా పెసరట్లు చేసిపెడితే.'

'పాపం...కష్టపడతారు' కాఫీ తాగుతూ చిన్నికిచ్చిన రెండగ్గిపుల్లలు గుర్తొచ్చి నవ్వుకుంది ఇందిర.

* * *

వాన నెమ్మదిగా పెద్దదయింది. అతనికి వానంటే చాలా సరదా. వానలో తడుస్తూ గుమ్మంలో నిలబడటం అతనికి ఇష్టం నిజానికి...కానీ...

మళ్ళా తలుపు చప్పుడవటంతో విసుక్కుంది ఇందిర,

'ఏం కావాలి—'కాఠిన్యం గొంతులో మారు మ్రోగుతోంటే ఇందిర ప్రశ్న.

'లోపలి గుమ్మంలో కూచుంటా' తడిసిన బట్టలు, నెత్తిన నీరుకారుతూ ముసలాడు.

'బయట నుంచున్నావు చాలదూ' దభీమని తలుపేసింది.

'పోనీ రానీయకూడదూ—వాన తగ్గాక వాడే పోతాడుగా'

'అబ్బా...మీ కంత జాలయితే పిలిచి మీ కోట్లుకూడా రెండు కప్పండి పాపం. అతడి గుడ్డలు వాడూ...ఛీ, చుట్టకాల్చు కుంటూ...'

'పాపం ... ముసలాడు కదూ' అతను గుమ్మం తెరిచాడు. ఖాళీ గుమ్మం వెక్కిరించింది. ఒక్క వ్యక్తికి ఒక్క నిముషం ఆశ్రయం ఇవ్వలేడు తను!! ఇందిరకేసి చూసి లోపలి కెళ్ళిపోయా డతను. ఒక్క క్షణంలో ముసలాడిని, వానకూడా మరచి పోయి పుస్తకం చదవడంలో నిమగ్నుడై పోయాడు.

*       *       *

'తల తుడుచుకో ఈ బట్టతో' పక్కింటి అత్తయ్యగారి గొంతు

'నా అగ్గిపుల్ల యియ్యి బుల్లెమ్మా, చుట్ట కాల్చుకుంటా, కాస్త ఎచ్చగా వుంటుంది...'

'ఏం పని చేస్తావురా అబ్బీ—' ఇంటాయన ప్రశ్న.

'కూలి పని బాబయ్యా...'

'సరే కానీ...తల బాగా తుడుచుకో... మళ్ళా జలుబు చేస్తుంది......తెల్లారితే కూలికి పోవద్దూ...'

'వానకి తడవటం, ఎండకి ఎండటం అలవాటే తల్లీ.'

'తాతా, అన్నం తిన్నావా' చిన్ని చిన్న గొంతు.

'వాన తగ్గినాక గంజి కాసుకుంటా'

'మరి నీకు ఆకలెయ్యదా... నేనయితే ఎప్పుడో తినేసా తెలుసా...తాతా, అమ్మతో చెప్తా అన్నం పెట్టమని...తింటావా?'

'వద్దులే బుల్లెమ్మా...పోతాగా కూసే పాగి—!

'అన్నం తిని పడుకో...పొద్దున పోదు గానిలే'—

అన్నం తిన్నాడు ముసలాడు. విస్తరి మడుస్తూ,

'మీ లాటోళ్ళున్నారు కాబట్టే...... ప్రపంచం ఇట్టా వుంది...అంతా ఆ పక్కింటమ్మలాటోళ్ళయితే...' వాడు ప్రేవున త్రేన్చి, విస్తరి వీధిలోకి విసరికొట్టాడు.

*       *       *

తలుపుపక్కగదిలో సోఫాలో పడుకుని సంభాషణ వింటున్న ఐశ్వర్యవంతుల ఆడబిడ్డ, ఆధునిక ఆదర్శాల ఆటపట్టు ఇందిరకి షాక్ కొట్టింది.

*       *       *

వాన ఇంకా ఇంకా పెరిగిపోయింది. భూనభోంతరాళాలు ఏకం చేస్తూ కుంభ వృష్టి కురిసింది. ఒక్కసారిగా ఇంట్లో దీపాలు ఆరిపోయాయి—ఆ అంధకారంలో ఒక్క వాస్తవం కళ్ళముందు మెరిసింది. —చిరిగిపోయిన చాప, ఆకారంలేని వంట గిన్నెలు, పాలు చాలక కక్కటిల్లే పసివాడి ఏడుపు, చిరిగిన చీరతో ఆ ఇల్లాలు, బీడీ ముక్క కాలుస్తూ లోతుకుపోయిన కళ్ళతో ఇంటాయన, చింపిరిజుట్టు చిన్ని, నిరుద్యోగి మరిది...వీళ్ళు, వీళ్ళే తన పక్క వాళ్ళు—వీళ్ళుండబట్టే ప్రపంచం ఇంకా ఈమాత్రం పచ్చగా వుందిట!

తనుండబట్టి—!'

మెట్లులేని అంతస్థునుంచి కింద పడింది ఇందిర.

*       *       ●

'నాన్నా మన పొట్లపాదు బోల్డు కాయలు కాస్తుంది కదండీ—'

'అవును తల్లీ'—

అవి మనం అందరికీ ఇస్తాం కదండీ నాన్న—మన పిన్నికి, మీ ఆఫీసులో అబ్బాయికి, మన పక్క ఇందిర అత్తయ్యగారికి —అందరికీ ఇయ్యాలి కదండీ...' చిన్ని తియ్యని గొంతు ఇందిరని కదలించి వేస్తోందా చీకట్లో—

గదిలో సోఫాలు, ఫాను, తన అందమైన పూలకుండీలు తన డ్రెస్సింగ్‌ టేబులు, తన ఆధునికత—అవే జీవం అనుకుని నమ్మింది—ఏమిటో అన్నీ జీవం లేకుండా వున్నవైనా, ఈ రోజు ఒకటితో ఒకటి తనను చూసి వెక్కిరించి నవ్వుకుంటున్నాయ్. గుసగుసలు చెప్పుకుంటున్నాయి.

*       ●       *

తెలతెలవారుతోంది. నిద్రపట్టని ఇందిర కిటికీలోకి చూసింది...రాత్రి వాన!?

ఇందిర కళ్ళలో నీళ్ళు నిలిచాయి—

వాన పడుతుంటే కిటికీలో నుంచుని కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకునే పిల్లలు తనకు లేరు, లేరేమిటి తనే వద్దనుకుంది ఇంతదాకా...తన దొడ్లో పచ్చగా పెరిగిన పొట్లపాదు తనకు లేదు...

మనిషిగా బతకటానికి కావలసిన ఒక ధర్మం...తనకు లేదు...

ఈ వాన ఎండిన మానుల్ని చిగిరిస్తుంది—

ఈ వాన తనలో మానవత్వాన్ని......

వానలో తడిసిన ముసలాడు కళ్ళ ముందు నిలిచాడు — ఇందిర ఒణికి పోయింది. ●







5 ఏళ్ళప్పుడు


12 ఏళ్ళప్పుడు




పెళ్ళయ్యాకా
అబ్బే.. అలాంటి డేన్సు పాటలు
వద్దండి అందులోను ఫిల్మ్‌స్టార్లవి అస్సలు
వద్దు నన్ను మరీ ప్రెస్ చేయకండి
సత్యమూర్తి



30ఏళ్ళక్రితం
ఔను.. ఇంట్లోనే ఉందిరా... ఔనులేరా ఎనిమిదోనెలే.. ఔనుకాని మాంచి బేబీ కేలెండరుంటే పంపు. ఆ చెత్తరకం బూతుస్టార్సువి మాత్రం వద్దు



60ఏళ్ళక్రితం
భ.భ వాటిల్లో ఉన్నవాళ్ళు ఒంటికి రంగుపాముకున్నారో, బిగువుబట్టలు కట్టుకున్నారో కూడా తెలియటంలేదు అసలువాటిని నాచేతికి తగిలించకు ఏదైనా రాముడు, కృష్ణుడూ ఉన్న కేలెండరుంటే ఇయ్యి..



40ఏళ్ళక్రితం
ఛీ ఛీ.. ఇలాంటి పాడు కేలెండర్లు మాకొద్దోయ్. మన బిడ్డగాళ్ళు కళ్ళల్లో పెట్టుకునేలా ఉన్నాయి ఓరేయ్ రమణ్రావ్



70ఏళ్ళక్రితం
రమణ్రావ్ నాకో కృష్ణుడి కేలెండరివ్వవోయ్ చాలు.. ఆ సినిమాస్త్రీయదీ కూడా ఇలా పారేయ్. మా కుర్రవెధవ వాటికోసం నానా ... సబ్బులుకొని డబ్బు తగలేస్తున్నాడు
సత్యమూర్తి




ఉన్నవ విజయలక్ష్మి

## జరిగిన కథ

కల్యాణి ఆ ఆఫీసులో కొత్తగాచేరింది. అక్కడ పని చేస్తున్న వారందరిలోను మురళిపై ఆమెకి సదభిప్రాయం ఏర్పడింది. ఈ సదభిప్రాయమే ఆమెని అతనికి సన్నిహితురాలిగా చేసింది. ఆఫీసులో తోటివారి విసుర్లు ఆరంభ మయ్యాయి. ఒకరోజు కల్యాణి తన పుట్టుపూర్వోత్తరాలని మురళికి చెప్పుకున్నది. మురళి పూర్తిగా వినకుండానే ఆమెనుంచి సెలవు తీసుకున్నాడు. కల్యాణి మనసు పరిపరివిధాల పోయింది. ఆమె వేశ్యజాతిలో పుట్టడమే అందుకు కారణం. తను ఎంత నీతిగా బ్రతుకుతున్నా ఈ సమస్య వెన్నాడుతూనే వుంది. మురళి కల్యాణిని పెళ్లి చేసుకోడానికి సిద్ధమయ్యాడు. చివరికి కల్యాణి, మురళి ఒక్కటి అవడానికి అనుకూల వాతావరణం ఏర్పడింది.

## 8

పెళ్లికి తేదీ నిర్ణయం అయిపోయింది.

'ఎంత గుళ్లో పెళ్లి అయినా కాస్తయినా సందడి వుంటుంది కదా—అక్కయ్య ఒక్క వారంరోజులయినా ముందుగా రావాలి' అన్నాడు మురళీ వాసుతో.

'నువ్వింతగా చెప్పక్కర్లేదు—కల్యాణికి ఇంత అన్నయ్యలు లేని కొరత కనిపించకుండా చూస్తాం—సరేనా.' ఆప్యాయంగా స్నేహితుడి చెయ్యి అందుకుని సున్నితంగా నొక్కి వదిలేశాడు వాసు.

తనమీదికి ఎలాంటి నెపం రాకుండా ఏదో అంటీ ముట్టనట్టు వుంటాడేమో అనుకున్న మురళీకి వాసు హామీ కొండంత ప్రోత్సాహాన్ని ఇచ్చింది.

ఆఫీసులో అందర్నీకూడ తమ వివాహానికీ ఆ తరువాత విందుభోజనానికీ ఆహ్వానించారు.

'ఓ యస్ — తప్పకుండా వస్తాం— అసలీ వార్తకోసమే మేము ఎన్నాళ్లనుంచో చెవులు దోరగించుకుని కూర్చున్నాం.' అంటూ అందరూ నవ్వుతూ అభినందనలు అందజేశారు.

కొద్దిమంది స్నేహితుల సమక్షంలో వాసు దంపతుల అధ్వర్యంలో వివాహం క్లుప్తంగా జరిగిపోయింది—విందుభోజనం కూడ ముగిసిపోయింది—వచ్చిన స్నేహితులు తమలో తాము కొన్ని విడ్డూరంగా చెవులు కొరుక్కోటం మాత్రం ముగియ లేదు. చివరికి మరి వుండబట్టలేక ఇద్దరు ముగ్గురు లౌక్యంగా వాసునీ మరి ఒకరిద్దరు నిస్సంకోచంగా మురళిని అడగనే అడిగేశారు.

'మీ అమ్మగారూ నాన్నగారూ వాళ్లెవరూ రాలేదా — ఆవిడవైపు కూడా ఎవరూ వచ్చినట్లు లేదు.' మురళీ ఎలాంటి తటపటాయింపు సంకోచమూ లేకుండా పరిస్థితి వెల్లడించేశాడు.

వింటున్న వాళ్ళంతా ఒక్కక్షణం అయోమయావస్థలో పడిపోయినా, మళ్లీ అంతలోనే తేరుకుని మురళీమీద ప్రశంసల వర్షం కురిపించారు.

'అహ అలాగా—మీరుచేసింది చాలా మంచిపని— మేము హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము' అంటూ అభిమానంగా అతని భుజం తట్టినవాళ్లు కొందరయితే—

'ఏమో—అనుకున్నాం; మురళీధరరావుగారు గట్టివాడే—అతనిలో ఇంతటి అభ్యుదయ భావాలు విశాల హృదయం వున్నాయని ఒక్కనాడైనా సూచనగా కూడ గ్రహించలేకపోయాం—అసలూ—నిజం చెప్పాలంటే మనిషిని ప్రవర్తనని బట్టి వ్యక్తిత్వాన్నిబట్టి గౌరవించాలి కాని, పుట్టుకలో ఏముంది—మన సంఘంలో వేళ్ళూని పాతుకుపోయిన

అర్థంలేని ఆచారాలు, నిబంధనలు, కట్టు
బాట్లు నశించిపోవాలంటే రావుగారిలాంటి
సంసార ప్రియులు ఎంతోమంది ముందుకు
రావాలి—లేకపోతే, కూపస్థ మండూ
కాల్లా కులాలూ, శాఖలూ, వర్గాలూ
అంటూ గిరిగీసుకుని కూర్చుంటే, దేశం
ఎప్పటికీ, ఇదుగో మనలాగే పాత చింత
కాయ పచ్చడి భావాలు వల్లె వేస్తూ
వుంటుంది.' అంటూ నోటితో పలక
రించి నొసటితో వెక్కిరించేవారు కొంద
రున్నారు.

అందరికీ చిరునవ్వుతోనే సమాధానంచెప్పి
అందరినీ మర్యాదగా సాగనంపాడు మురళీ.
వాసూ శారదల మాట కాదనలేక వాళ్లతో
పాటు వాళ్ల యింటికి వచ్చి ఆ సాయం
కాలం అంతా వాళ్లతో సరసాగా కబుర్లు
చెప్పుకుంటూ గడిపి ఆ రాత్రి భోజనం
కూడ అక్కడే చేసి తమ కొత్త యింటికి
తిరిగి వచ్చారు మురళి, కళ్యాణి.

పెళ్లి చేసుకోవాలి అని నిశ్చయించు
కున్న వెంటనే మురళీ వో చక్కటి
యింటిలో వో భాగం చూసి అడ్వాన్సు
యిచ్చేశాడు. వో మంచిరోజు చూసుకుని
తన మకాం అందులోకి మార్చేసి తను
ఆదివరకునుంచీ వుంటున్నది ఖాళీ చేసే
శాడు. కళ్యాణితో సంప్రతించి, శారద
సలహాని అనుసరించి తమ సంసారానికి
కావలసినవన్నీ అప్పుడొకటీ అప్పుడొకటీ
సేకరించి వుంచాడు. కళ్యాణి ఒకటి రెండు
సార్లు బజారునుంచి వచ్చినప్పుడు ఆ
యింటికి వచ్చింది కూడ. అయినా అది
వరకు కలగని వో విచిత్రమైన అనుభూతి
ఏదో ఇవాళ ఆ యింట్లో అడుగు పెడు
తూంటే కళ్యాణి మనస్సులో పులకరిం
తలు రేపింది.



* * *

గదిలో, మంచంమీద వో చివరగా
కూర్చుని, చేతిలోకి తీసుకున్న పుస్తకం
పుటలు యాథాలాపంగా తిరగవేస్తున్న
మురళీకి క్షణం ఒక యుగంలాగే అనిపి
స్తోంది—అంతలో గదిలో అలికిడి అయి
తల తిప్పి చూశాడు.

అతిగా అలంకరించుకోక పోయినా,
మెడలో వున్న ఒక్కవరస బంగరు గొలు
సుకు జతగా పచ్చటి పసుపు తాడుతో,
శంఖంలాంటి మెడచుట్టూ కాస్త బిగు

## ఆచరణలో...

తుగా వున్న నల్లపూసల దండతో — తలలో పెట్టెడు మల్లెచెండుతో భువన మోహనంగా కనిపించింది కళ్యాణి మురళి కళ్ళకి—

బిడియంగా మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న కళ్యాణి వాలుగడుగులు వేసి ఇంక ఆ పైన ముందుకు వెళ్ళటం తన చేతకాదు అన్నట్లు అటు ప్రక్కగా వున్న కిటికీ దగ్గరికి వెళ్ళి నిలబడి బయటికి చూడసాగింది. మురళి నవ్వుకుంటూ పుస్తకం టేబిలుమీద పడేయటం, లేచి తనవైపుకు రావటం అన్నీ తెలుస్తూనే వున్నాయి కళ్యాణికి. సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోతూ, బయట పుచ్చపువ్వులా పరుచుకున్న వెన్నెలనీ, విరగబూసి ఆ పూల పరిమళంతో వాతావరణాన్ని మత్తెక్కించేస్తున్న నైట్‌క్వీన్ పొదనీ చూస్తూ అలాగే నిలబడిపోయింది. మురళీ కళ్యాణి రెండు భుజాల మీద చేతులు వేసి తనవేపుకి తిప్పుకుంటూ, 'ఇవాళ నువ్వు ఇలా కొత్తగా సిగ్గుపడుతూంటే ఎంత అందంగా వున్నావో తెలుసా?' చిలిపిగా అన్నాడు.

మెల్లిగా కళ్ళు యెత్తి చూసింది కళ్యాణి—పెదవి విప్పి యేమీ మాట్లాడా లనిపించలేదు—అసలు ఏమాత్రం కదిలినా మెదిలినా ఎదురుగా అతనికళ్ళల్లో మెరిసిపోతున్న అలౌకిక తేజస్సు చెదిరిపోతుందేమో అన్నట్లు ఆబగా, రెప్పకూడ వాల్చకుండా అలాగే చూస్తూ వుండిపోయింది.

'ఏమిటలా చూస్తున్నావు— ఇవాళ నా మొహం ఏమైనా కొత్తగా వుందా.' లోకంలో వున్న అనురాగాన్నంతటినీ రంగరించి తన గొంతులో నింపుకున్నంత మధురంగా వున్నాయతని మాటలు.

'ఔను. కొత్తగానే వుంది — ఇవాళ మీలో భగవంతుడు కనిపిస్తున్నాడు నాకు.' కళ్యాణి కళ్ళల్లో, మాటల్లో ఆరాధన స్పష్టంగా కనిపిస్తోంది.

'ఉహూ!—అలాగా?—ఏదీ— అయితే వరం కోరుకో, అనుగ్రహిస్తాను.' పల్చటి నీటి పొరతో మిల మిలా మెరుస్తూ, అందంగా, అమాయకంగా వున్న ఆమె కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ అడిగాడు మురళీ.

'మీ అనురాగాల్ని జీవితం అంతా ఇలాగే పంచుకోవాలనీ, ఇలాగే ఆనందంగా మీ కళ్ళల్లోకి చూస్తూ మీ చేతులలోనే ప్రాణాలు విడవాలనీ......'

'ఇస్, ఏమిటిదీ...నువ్వు ఈ ధోరణిలో మరోసారి మాట్లాడితే నేనేమనుకుంటానో తెలుసా—నీకు నాలో విశ్వాసం లేదనీ, ఏనాడైనా నిన్ను విడిచి వెళ్ళిపోతానేమోననే భయం నిన్ను వదలటం లేదనీ...'

'అహ...కాదు ...' ఖంగారు పడింది కళ్యాణి. 'మిమ్మల్ని, మీ మనస్సుని శంకించే అంత అన్యాయానికి నేను ఏనాడూ ఒడిగట్టలేను...నా ఒక్కదాని కోసం, కేవలం నాకు ఒక గౌరవప్రదమైన పరిస్థితి కల్పించటంకోసం, పదిమంది ఎదుటా నేను గర్వంగా తల ఎత్తుకు తిరిగేలా చేయటంకోసం, అయిన వాళ్ళందర్నీ వదులుకుని నా ప్రక్కని నిలబడిన మీపట్ల నా కెంత గౌరవం వుందో అనురాగం వుందో నేను మాటలలో చెప్పలేను ...... ఊహ తెలిసినప్పటినుంచి ఇలాంటి అదృష్టంకోసం తపించిపోయిన నేను ఇవాళ ఈ స్థితిలో వుండటం— ఇదంతా వాస్తవంగా జరిగిందా— కేవలం నా భ్రాంతి కాదు కదా అనిపిస్తూంటుంది ఒక్కొక్కసారి......'

'పిచ్చి కళ్యాణి!'—మురళీ ఆమె తలని గాఢంగా గుండెల కదుముకున్నాడు. 'ఇంక ఎప్పుడూ ఇలాంటి ఆలోచనలు చెయ్యకు. ఇది నీ భ్రాంతి కాదు, కల అంతకన్నా కాదు. ఒకవేళ ఇది కలలో చూసిన ఒక అందమయిన దృశ్యంలా వుంది అని నువ్వు అనేటట్లయితే నా సమాధానం ఏమిటో చెప్పనా?...' ఒక చేత్తో ఆమె గడ్డం పట్టి తల పైకెత్తి ఆపేక్షగా చూస్తూ అన్నాడు.

'చెప్పండి.' అన్నట్లు కుతూహలంగా కళ్ళు వెడల్పు చేసుకుని చూసింది

'మన జీవితం అంతా ఇలాగే ఒక బంగారు కలలాగే గడిచిపోతుంది అని.'

'కలలోనూ ఊహలలోను కనిపించేటంత సుందరంగా, మధురంగా, యదార్థ జీవితం అంతా సాగిపోతుందా?'

'అక్షరాలా అలాగే వుండకపోవచ్చు. కాని జీవితాలని సుఖప్రదం, శాంతి దాయకం చేసుకోగలగటం కొంతవరకూ మన చేతులలోకూడ వుంది అనిపిస్తుంది నాకు. మనం ఇద్దరం...'

'ఔను. నాకూ అలాగే అనిపిస్తోంది — ఎన్నో అవరోధాలని అడ్డంకులని ఎదుర్కొని మనం ఈ పెళ్ళి చేసుకున్నాం. ఈ ఇల్లు నిలబెట్టుకున్నాం. మన జీవితం నందనవనం చేసుకోవాలని కోరుకుంటున్నాం—మరి అలాంటప్పుడు...... ఈ వనంలోని ప్రతి మొక్కా ఏపుగా పెరిగి

ఏవిటయ్యా - ఫాంటు జేబులు మాటిమాటికి కత్తిరించి మళ్లా కుట్టించుకెళతావ్!

జేబులు కత్తిరించడం నేర్చుకుంటున్నా!

టైగర్ టైలర్స్

పువ్వులతో వికసించి కలకల లాడుతూ వుండాలంటే, మనం...'

'నేను చెయ్యాల్సిందంతా చేస్తాను...' హామీ ఇస్తున్నట్లే అన్నాడు మురళీ.

'నేను చేస్తాను అని కాదు మనం చేద్దాము అని అనండి.' మనోజ్ఞంగా నవ్వింది కళ్యాణి. 'మీరుచేసే ప్రతి పని లోను మీ నీడలా మీవెంటే వుంటాను నేను.'

కొద్ది క్షణాలు ఆమెమొహంలోకి కళ్ళలోకి మృదువుగా చూసి, 'అసలు, నిన్ను ఆ నాళ ఆఫీసులో మొట్టమొదటి సారిగా చూసినప్పుడు నా కేమనిపించిందో చెప్పనా ?' అన్నాడు మురళీ.

'ఊఁ.'

'ఎన్నో యుగాలు, ఎన్నో జన్మలు కలిసి ప్రయాణం చేసిన మనం మధ్యలో విడిపోయి తరువాత ఎన్నాళ్ళకో ఒక దగ్గర హఠాత్తుగా కలుసుకుంటే ఆ మనిషికి ఎలాంటి సంతోషం కలుగుతుందో అలా అనిపించింది.'

'ఖబుర్లు చెప్పటం బాగా వచ్చు' అతని షర్టుగుండీ నిమురుతూ గోముగా అంది కళ్యాణి.

'గొప్పగా ఖబుర్లు చెప్పటం ఏం కాదిది...నా మనస్సులో మెదిలిన భావాలని మాటల రూపంలో పైకి వ్యక్తం చేశానంతే ... జన్మ జన్మలనుంచీ వస్తున్న మన ఈ అనుబంధం...'

'ఇంకా ముందు జన్మలలోకూడ ఎప్పటికీ ఇలాగే వుండాలని కోరుకుందాం.' ఆ వాక్యాన్ని పూర్తిచేసింది కళ్యాణి.

ఇద్దరూ తృప్తిగా నవ్వుకున్నారు.

* * *

ఆదివారం మధ్యాహ్నం మురళీ తీరుబడిగా నిద్రకి ఉపక్రమిస్తే, కళ్యాణి స్టౌ అంటించి ఫలహారాలు తయారుచేసే తతంగంలో పడింది.

నాలుగు గంటలకి అతను లేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ వంటగది గుమ్మం దగ్గరికి వచ్చేసరికి ప్లేట్లలో పంచదార కాజాలు, ఉల్లిపాయ పకోడీలు ప్రత్యక్షం అయాయి.

స్టౌమీద మంచినీళ్ళ గిన్నె నింపి, పాల గిన్నె పెడుతున్న కళ్యాణి, ఒక్కసారి కాస్త ప్రక్కకి తిరిగి, 'లేచారా—త్వరగా మొహం కడుక్కురండి...డికాక్షన్ చల్లారి పోతుంది—మళ్ళీ వేడిచేస్తే రుచే వుండదు' అంది నీళ్ళల్లో పాలు పోస్తూ.

'ఇవన్నీ ఒక్కదానివీ కూర్చునిచేశావా? నన్ను లేపకపోయావా ఏదైనా సాయం చేసే వాడినిగా ...'

'సరిపోయింది కాని, మీరు త్వరగా వస్తారా ?'

'చిత్తం' నవ్వుకుంటూ బాత్‌రూమ్ వైపు వెళ్ళిపోయాడు మురళీ.

పనులన్నీ అయిపోయాక స్నానాలుచేసి నీటుగా ముస్తాబయి కూర్చుని అప్పుడు తీరుబడిగా సాయంకాలం ప్రోగ్రాంగురించి చర్చించుకోటం మొదలుపెట్టారు.

'ఎక్కడికి వెళ్దాం, నువ్వే సజస్టు చెయ్యి.' నీమాట శిరసా వహిస్తాను అన్నట్లే చెప్పాడు మురళీ.

'మీ శారదక్కయ్య వాళ్ళింటికి, ఇంకేమని సమాధానం చెప్పింది కళ్యాణి. నీకేం మతి పోలేదుకదా అన్నంత విసుగ్గా చూశాడు మురళీ.

'ఆదివారం సాయంకాలం వెళ్ళకపోతే ఆవిడ అడుగుతారేమో.' నవ్వు దాచుకుంటూ అంది కళ్యాణి అతని అభిప్రాయం గ్రహించుకుని 'ఏమి అడగదు—ఆవిడకే తెలుసు — మనం ఇప్పుడిప్పుడే ఈ ప్రపంచంలో పడమని, మన ప్రపంచం వేరని...'

'ఊహూ, అయితే...'

'అయితే లేదు గియితే లేదు — పెక్కదుకి లేటయి పోతోంది పద.' ఇంచుమించు కళ్యాణి చెక్క పట్టుకుని లేవదీసినంత పని చేశాడు.

'ఈ మాత్రం దానికి నన్ను అడగటం ఎందుకో.' మూతి ముడుచుకుంది కళ్యాణి.

'నాకేం తెలుసు నువ్వలాంటి సలహా ఇస్తావని.' తల వంచుకుని సాక్సు వేసుకుంటూనే సమాధానం చెప్పాడు.

తలుపుకు తాళంపెట్టి ఇద్దరూ గేటు తెరుచుకుని రోడ్డుమీదకి వస్తూంటే ఎదురింటి గది కిటికీదగ్గర ఒక మధ్య వయస్కురాలు నిలబడి పరీక్షగా తమనే చూస్తూండటం ఇద్దరూ గమనించారు.

'ఆవిడెవరో, పాపం కాలక్షేపం కాదులా వుంది. అలా కిటికీ వెనకనిలబడి రోడ్డుమీద నడిచేవాళ్ళని చూస్తూ పొద్దు పుచ్చుకుంటున్నట్లు— మనం ఎప్పుడు వీధిలోకి వచ్చినా ఆవిడ ఇటే చూస్తూ కనిపిస్తుంది ?' అనబోయింది కళ్యాణి— ఇంతలో మురళీ, దాటి వెడుతున్న ఖాళీ రిక్షాని పిలవటం, సినిమాహాలుకి బేరం చెయ్యటం ఇద్దరూ అందులో ఎక్కి కూర్చోటం, ఆతరువాత ఆ థియేటర్ని గురించి, తాను చూడబోయే సినిమాని గురించి చెప్పుకోటంలో ఆమాట మరుగున పడిపోయింది.



రాత్రి సినిమానుండి తిరిగివచ్చి, రిక్షా దిగుతూ అప్రయత్నంగానే ఎదురింటివైపు చూసిన మురళీకి గదిలో లైటు వెలుగులో కిటికీ వెనక ఆవిడ నిలబడటం, కిటికీకి వున్న కర్టెన్ కొద్దిగా వత్తిగించి ఇటే చూస్తూండటం స్పష్టంగా కనిపించి,

'ఇటు చూడు.' అన్నట్లు కళ్లతోనే సంజ్ఞ చేశాడు కళ్యాణి వంక తిరిగి.

'ఈవిడ ఇంతసేపు అలా, కిటికీ దగ్గరే వుందా ఏమిటి ?' రిక్షా అబ్బికి డబ్బులిచ్చి లోపలికి వస్తున్న అతనితో కాస్త విసుగుపోతున్నట్లు అంది కళ్యాణి.

'అంతసేపు వుండివుండదులే – మధ్యలో పళ్లి వంట చేసుకుని, భోజనాలు కూడ చేసేసి వుంటారు – మనం వచ్చామో లేదోనని మధ్యమధ్య కన్ను ఇటు వదేస్తూ వుండివుంటుంది–అది మనకంట పడింది.' అన్నాడు మురళీ కుర్చీలో కూర్చుని షూ విప్పుకుంటూ.

కళ్యాణి మనస్సులోనే వులిక్కిపడింది. 'అంటే; ఈవిడకి నా సంగతి తెలిసి, నన్నే విడ్డూరంగా చూడటం లేదుకదా— ఇంక ఈ వీధివాళ్ళందరూ నన్ను గురించి వింతగా చెప్పుకుంటూ, ఒళ్లంతా కళ్లు చేసుకుని నన్నే చూస్తూంటారేమో... పోన్లే ఏం చేస్తాను, కొన్నాళ్లు చెప్పుకుంటారు, తరువాత వాళ్లే మానేస్తారు...అయినా గుమ్మడికాయ దొంగంటే భుజాలు తడుముకున్నట్లు నేనిలా

# ఆచరణలో...

ఇదవటం ఏమిటి' అనుకుంటూ.

'ఏమిటి బాబూ, ఆవిడకి అంత ఇంటరెస్టు మనలో,' అంది, అతని సమాధానంకోసం ఆత్రంగా ఎదురు చూస్తూ.

'ఇంటరెస్టు కాదు. అసూయ అనాలి ...హాయిగా టింగురంగా అంటూ మనం రోజూ సినిమాకో షికారుకో వెళ్లిపోతున్నాం...' షూ గోడవారకి తోసేసి లోపలి గదిలోకి దారి తీశాడు.

'అందుకు అసూయపడటం ఎందుకు. తనూ వెళ్లొచ్చుగా ఎవరొద్దన్నారు' వీధి తలుపు గడియవేసి, అతని వెనకే లోపలికి వెళ్తూ అంది.

'సరిపోయిందిలే — ఆ యింటిసంగతి నువ్వు పూర్తిగా కనిపెట్టినట్లు లేదు... నేనైనా, మొన్న వాళ్లబ్బాయి ఫ్యాజి వైధు వుంటా అంటూ వస్తే ఏవో అడిగాను మాటలధోరణిలో — ఆవిడకి, అరడజను మంది పిల్లలు. అంత సంసారంతో ఈసురోమంటూ ఎప్పుడూ ఇంటిపనికే అంకితమైపోయే ఇల్లాలికి సరదాగా షికార్లు కొట్టే వోపిక ఏం మిగులుతుంది' ఒకవేళ అంతో ఇంతో శక్తి వున్నా అతనితో కలిసి వెళ్లాలీ అంటే ఆ ఆసక్తి కాస్తా చచ్చిపోతుంది. అతన్ని నేనొకసారి చూశాను. వాళ్లది బీస్టు అండ్ ది బ్యూటీ కాంబినేషన్–అతను నల్లగా లావుగా పొట్టిగా వుంటాడు, ఎత్తు పళ్ళు, అరంగుళం దళసరి కళ్లద్దాలు, తెల్లగా పండిపోయిన జుట్టు...

'ఒకర్నిచూసి వెక్కిరించటం ఎందుకు మనం? ఆ అనాకారితనం అతనేం కావాలని తెచ్చుకోలేదు. దేవుడు అలా పుట్టించాడు అతన్ని, దైవనిర్ణయం వాళ్లిద్దరికీ పెళ్లి జరగాలని వుంది.'

'అదే నాకూ అనిపిస్తూ వుంటుంది – తన చేతిలో వున్న పనేకదా, అందర్నీ మనలా చూడ ముచ్చటయిన జంటల్నా పుట్టిస్తే ఏం పోయింది చెప్పు? ఒక్కోసారి ఆ దేవుడికూడ పూర్తిగా చుప్పనాతితనం పుట్టుకు వస్తూందేమో–అందాల బొమ్మలాంటి అమ్మాయికి అడవి మనిషిలాంటి అబ్బాయిని, మన్మథుడు లాంటి అబ్బాయికి వుత్త కురూపిని అంటగడుతూ వుంటాడు—నీ అదృష్టం బాగుంది కనక ఇంతటి అందగాణ్ని దొరికాను' అంటూ ఎదురుగావున్న అద్దంలో చూసుకుని వోసారి క్రాపు సవరించుకుని, తనని చూసి తనే ముగ్ధుడవుతున్నట్లు కళ్యాణివంక చూసి కళ్లు ఎగరేశాడు.

మూతి మూడువంకర్లు తిప్పింది కళ్యాణి. 'పూజకొద్దీ పురుషుడంటారు– నేను క్రితం జన్మలో బంగారు పువ్వులతో పూజచేసి వుంటాను. అందుకే మీకింత చక్కదనం ఇచ్చాడు దేవుడు.' ఇందులో మీ గొప్పతనం ఏమీ లేదన్నట్లు తేల్చి చెప్పేసింది.

మరి మురళీయేనా తక్కువ తిన్నది— చటుక్కున కొంగు అందుకుని కళ్యాణిని దగ్గరకు లాక్కుంటూ సవాల్ చేస్తున్నట్లు ఆమె కళ్లల్లోకి చూస్తూ గొంతు నిండా తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో అన్నాడు—

'ఏమిటీ? నువ్వు పూజ చేశావా? మరి నేనేం చేశానో చెప్పనా...తపస్సు... అప్సరసని భార్యగా పొందాలని ఘోరమైన తపస్సు చేసేశాను...అది చూసి ఇంద్రుడు కాస్తా హడలిపోయాడులే..... బాబ్బాబు—నీ తపస్సు చాలించు — నీకు అప్సరస యెందుకూ? వాళ్లని తలదన్నే సౌందర్యరాశిని భూలోకంలో నీకోసం సృష్టించమని బ్రహ్మదేవుణ్ని బతిమాలుకుంటాను...'

ఫక్కుమని నవ్వేసింది కళ్యాణి —



ఏం తప్పుచేసినోళ్లు మీచేతికెందుకుసార్ ఈ బేడీలు"

మురళీ యింకా యేదో అనబోయాడు.

'సరిపోయింది—ఇవాళ భోజనం ఆదీ ఏమీ అక్కర్లేదా ఏమిటి మీకు? పది కూడా కావస్తోంది—నాకు ఆకలి దహించుకు పోతోంది—మీరింకా ఇలాగే ఖబుర్లు చెప్తూ కూర్చున్నారంటే, ఇంత ఆకలి మీద నేను ఇద్దరి వంట తినేసి వస్తాను. ఆ తరువాత మీ యిష్టం' అని వంట గదివేపు దారి తీయబోయింది.

'హుఁ—అంత మాట అనటానికి నీకు నోరు ఎలా వచ్చిందీ అంట? అసలు ఆడదానికి వుండాల్సిన లక్షణాలు యేమిటో తెలుసా? మొగుడు భోజనం చేసిన తరువాత ఆ ఎంగిలి విస్తరిలో—పోనీ కంచం అనుకోతే—అది కాస్త శుభ్రమైనా చేసుకోకుండా అలాగే అందులోనే అన్నం ఆధరవులూ వడ్డించుకుని తినాలి భార్య—ఇంకో విషయం—వండిన పదార్థాలన్నీ భర్తగారిని పదిసార్లు మారు అడిగి, బ్రతిమాలి వడ్డించి, ఆయన తృప్తిగా త్రేనుస్తూ లేచి వెళ్ళి చెయ్యి కడుక్కున్నాక; అప్పుడు ఆ మిగిలిన వంటకాలు వడ్డించుకుని, ఒక వేళ ఆధరవులు ఏమీ మిగలకపోతే ఏ వూరగాయి ముక్కో వేసుకు తిని లేవాలి......'

'అలాగే మీకు ఒక్కరికీ వడ్డిస్తాను ముందు ... రండి.' అంటూ లోపలికి వెళ్ళింది......

పెళ్ళి అయిన తరువాత, కళ్యాణి మొదటిసారిగా వంట చేసిన రోజున మురళీకి ఒక్కడికే వడ్డనచేసి భోజనానికి పిలిచింది — భార్య చేతివంట ఎప్పుడు రుచి చూద్దామా అని వువ్విళ్ళూరుతూ, ఆ పిలుపు కోసమే ఎదురు చూస్తున్న వాడిలా గదిలో కూర్చున్న మురళీ గబ గబ లేచి వచ్చాడు. వంట గదిలో ఒక్క కంచమే వుంది—కళ్యాణి వుద్దేశ్యం అర్థం అయినా, ఆశ్చర్యాన్ని అభినయిస్తూ—

'హో! ఇద్దరం ఒక్క కంచంలోనే తిందామా?' అన్నాడు కొంటెగా చూస్తూ.

కళ్యాణి తెల్లబోయింది ఒక్క క్షణం. తరువాత చిన్నగా నవ్వేస్తూ, 'ముందు మీరు కానివ్వండి — నేను తరువాత తింటాను.' అంది.

'ఉహుఁ—అదేం కుదరదు...... ఎవరో పరాయివాడికి పెట్టినట్లు నా ఒక్కడికీ విడిగా పెట్టి ఆ తరువాత నువ్వు తింటావా...నువ్వు కూడా వడ్డించుకో—ఇద్దరం సరదాగా ఖబుర్లు చెప్పుకుంటూ తినాలి కాని ఈ పద్ధతి నాకేం నచ్చదు.' అన్నాడు గుమ్మం దగ్గరనుండి కదిలి రాకుండానే.

'అహ—ఎందుకూ? ముందు మీరు కూర్చోండి.' సిగ్గు సిగ్గుగా జవాబు చెప్పింది కళ్యాణి.

'నువ్వు ఇలా నన్ను ఒకణ్ణి కూర్చోపెట్టావంటే నేను అరాఁకలితోనే లేచి పోతాను తెలుసా...నేను కడుపు నిండాతినాలి అని నీకు వుంటే నువ్వుకూడా నాతోపాటు తినాల్సిందే—ఊఁ—కానీ' అంటూ తనే మరోకంచం తెచ్చిపెట్టి గ్లాసులో మంచి నీళ్ళుపోసి ఒకటే హడావిడి పెట్టేశాడు.

అదంతా గుర్తుచేసుకుంటూ బట్టలు మార్చుకుని, నవ్వుకుంటూ వంట గదిలోకి వెళ్ళాడు. అతను ఒక్కడికే ఒక కంచం పెట్టి వడ్డనప్రయత్నం చేస్తోంది కళ్యాణి. 'నువ్వే గెలిచావులే — వచ్చి కూర్చో' అంటూ మరో కంచంపెట్టి అన్నం కూరలూ అవీ వడ్డించేశాడు. ముసి ముసిగా నవ్వుకుంది కళ్యాణి.

*   *   *

పెళ్ళికి పెట్టిన శలవు పూర్తయాక అవాళ మొదటిసారిగా ఆఫీసులో అడుగు పెట్టాడు మురళీ—

తమ పెళ్ళి శుభలేఖతో పాటు, ఉద్యోగానికి రాజీనామా కూడ మేనేజరుకి ఇచ్చింది కళ్యాణి. సాధ్యమైనంత త్వరలో అంటే పెళ్ళినాటికయినా ఆమెని రిలీవ్ చేస్తానని చెప్పారు మేనేజరు లింగమూర్తి—

మురళీ వరండాదాటి హాల్లోకి అడుగు పెడుతూంటే, మిగిలిన వాళ్ళంతా తన వంక కొత్తగా, వింతగా, ఆసక్తిగా చూస్తున్నట్లనిపించింది తనకి—ఇంక వీళ్ళు చేసే హాస్యాలకి తట్టుకోవాలి కాబోలు, అనుకుంటూ లోపలికి నడిచాడు.

'మన రావుగారు ఈ నెల్నాళ్ళల్లోనే కాస్త ఒళ్ళు పట్టినట్లున్నారు కదూ' అన్నాడు కామేశ్వరరావు.

'ఇంకా సందేహంగా అడుగుతున్నావా—ఇప్పుడు హాయిగా యింటిభోజనం కదా—అయినా, కొత్త సంసారం, కోరి చేసుకున్న భార్య ఆ సంతోషంలో తిండి తినకపోయినా కడుపు నిండిపోతుంది, ఒళ్ళూ వస్తుంది' అన్నాడు వీర్రాజు.

'కొత్త సంసారం అంటే గుర్తు వచ్చింది—మన కమలగారికికూడా వచ్చే నెలలో పెళ్ళి అవుతుందిట—వాళ్ళబావ అంటే కాబోయే భర్త నిన్న కనిపించినప్పుడు చెప్పాడు నాతో' అన్నాడు రమణమూర్తి.

'వాళ్ళదికూడా లవ్ మేరేజే — అనుకుంటా' అన్నాడు జనార్దనం.

'ఎలాగయినా అనుకోవచ్చు—దూరపు బంధువు— ఒకరి నొకరు కావాలని కోరి చేసుకుంటున్నారు. అసలు ఈపాటికే



## ఆచరణలో...

అయిపోవలసిన పెళ్లే. మరి ఇన్నాళ్ళూ ఎందుకు ఆగారో తెలియదు.' అని కామేశ్వరరావు అంటూంటే,

'అహ అయితే కులాంతరం లాంటి దేమీ కాదన్నమాట.' అన్నాడు జనార్దనం తన మాటలకి తనే నవ్వుకుంటూ.

'కులాంతరం అంటే జ్ఞాపకం వచ్చింది. నేను నిన్న ఓ కొత్త వార్త విన్నాను. మా చిన్నాన్న కొడుకు వేరేకులం అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడుట ఎవరికీ చెప్పకుండా, ఈమధ్యే' అన్నాడు అవధాని.

'ఆ ఏమిటో? పెద్ద సెన్సేషన్ క్రియేట్ చేసినట్లు మాట్లాడుతున్నావు— ఈ రోజుల్లో వర్ణాంతర వివాహాలు సర్వసాధారణం అయిపోయాయి. అన్నాడు రమణమూర్తి.

'అదేదో అతి సహజంగా, రోజూ జరిగిపోయే వ్యవహారంలా అంత తేలిగ్గా నువ్వు మాట్లాడితే నేను ఒప్పుకోను— మనిషికీ మనిషికీ మధ్య ఈ కులం అనే అడ్డుగోడ నిలవకూడదు. అసలు వర్ణ వ్యవస్థే వుండకూడదు, మనుష్యులంతా ఒకే కులానికి ఒకే కుటుంబానికి చెంది నట్లు కలిసిపోవాలి అంటూ ఖబుర్లు చెప్పేవాళ్లే తప్ప అక్షరాలా అలా ఆచరించి చూపిస్తున్న వాళ్లు ఎంతమంది వుంటారంటావు? పైకి ఎన్ని ఖబుర్లు చెప్పినా ఎవరి కులాభిమానం వాళ్లు, ఎవరి కట్టుబాట్లు వాళ్లు పాటిస్తూనే మనుగడ సాగిస్తున్నవాళ్లే నూటికి తొంభై తొమ్మిదిమంది వుంటారు. ఇంక మిగిలిన ఆ ఒక్క పెర్సంటూ ఎందుచేత ఈకొత్త పద్ధతిలో నడుస్తున్నారూ అంటే కారణం వాళ్ళపిల్లలు ఏ క్లాసు అమ్మాయినో, తోటి వుద్యోగినో ప్రేమించి పెళ్లిచేసుకుంటాం అని భీష్మించు కు కూర్చోటమే – అప్పుడైనా ఈ పెద్దలు ఒకంతట ఒప్పుకుంటారా? నయానా భయానా నచ్చచెప్పాలని చూస్తారు. అప్పటికీ లొంగకపోతే సరే వాడిఖర్మం అన్నట్లుచూసీ చూడనట్లు వదిలేస్తారు. అంతేకాని తమ పిల్లలకి వర్ణాంతర వివాహాలే చెయ్యాలి అనే ఆదర్శంతో కావాలని వేరేకులంలో సంబంధాలు వెతికినవారు ఎంతమంది వున్నా రంటావు...' అని అవధాని అంటూంటే,

'అసలు మనిషిలో కులభావం వుండనే కూడదు అంటే అదెక్కడికి పోతుంది? ఎలా పోతుంది? నీకు వుద్యోగం కావాలీ అంటే నువ్వు ఏకులంవాడివో తెలియజేసు కోవాలి, నీ కొడుకుని అఆల క్లాసులో జేర్పించాలన్నా నీ కులం ఏమిటో వ్రాసుకోవాలి, నీ తమ్ముడికి కాలేజీలో సీటు కావాలంటే నువ్వే కులానికి చెందిన వాడివో స్పష్టపరచాలి—ఇలా అడుగడుగునా, ఎక్కడ మరిచిపోతావో అన్నట్లు, నీ కులాన్ని గుర్తుచేసుకుని బ్రతుకుతున్న స్థితిలో నీలో ఆ భావం పొమ్మంటే ఎలా పోతుంది—ఏ అప్లికేషన్ ఫారం చూసినా నీ వూరూ పేరూ తో పాటు 'కాస్టు' అంటూ నా తలకాయంత అక్షరాలతో వ్రాసి ఓ కాలమ్ ఇస్తాడు—అదుగో వాడి కులాన్ని చూసే వుద్యోగం ఇచ్చారు అని ఒకరంటే నా కులం స్పష్టంగా చెప్పుకోటంవల్లే వుద్యోగం దొరక్కుండా పోయిందీ అని యింకొకరంటారు. ఇంత చిన్న విషయంలో ఇన్ని భేదాలు చూపించే మనం రెండు నిండు జీవితాల్ని బంధించి వుంచే వివాహందాకా ఏం వెళ్తాం?' అన్నాడు జగన్నాథం.

'మీరు చెప్పినమాట నిజమే.' అన్నాడు వీర్రాజు.

'ఏది ఏమైనాకాని, అసలు కులం గోత్రం లేని అమ్మాయిని పెళ్లిచేసుకున్న మన మురళీధరరావుగారు మాత్రం అభినంద నీయులు.' అన్నాడు కామేశ్వరరావు మురళీవంక ఆదోలా చూస్తూ.

'అదంతా కళ్యాణి అదృష్టం.' అంది తార, ఆ అమ్మాయి గొంతులో రవంత అసూయ తొంగి చూపింది.

వాళ్ళ మాటలకి మనస్సులో ఏమూలో ఎలాగో అనిపించినా దాన్ని అప్పుడే మరిచిపోవటానికి ప్రయత్నిస్తూ చిన్నగా నవ్వేశాడు మురళి.

'ఏమండీ రావుగారూ, నాకు తెలియక అడుగుతాను — కల్యాణిగారిచేత అప్పుడే వుద్యోగం ఎందుకు మానిపించేశారు? ఇంకా పిల్లా పాపా బయల్దేరింతరువాతయితే ఏమో అనుకోవచ్చు. ఇప్పుడు హాయిగా ఇద్దరూవచ్చి పని చేసుకోవచ్చుగా' అన్నాడు రమణమూర్తి.

'ఆ. ఎందుకొచ్చిన వుద్యోగం, హాయిగా అయ్యగారు సంపాదిస్తూంటే అమ్మగారు ఖర్చు పెడుతుంటారు. ఇతని ఒక్కడి జీతంతో సంసారం గడవకపోతేకదా ఆవిడా వుద్యోగం చెయ్యటం.' అన్నాడు నరసింహమూర్తి.

'అంతేనా, లేకపోతే మీ ఆవిడ పది మంది మొగవాళ్లమధ్య కూర్చుని పని చెయ్యటం ఏమిటి అనే అభ్యంతరం ఏమైనా వుందా మీకు?' అంది తార.

'నేనేమీ చెప్పలేదు తనే మానేసిందంది' అన్నాడు మురళి.

'ఆవిడగారికి ఆ మంచిబుద్ధి పుట్టటం వల్లే నాకీ వుద్యోగం అయినా దొరికింది. లేకపోతే ఇంకా ఎన్నాళ్లు ఇంట్లో అందరం పస్తులతో గడపవలసి వచ్చేదో,' అనుకున్నాడు కళ్యాణి ప్లేసులో కొత్తగా జేరిన రామస్వామి.

(ఇంకా వుంది)



# వారఫలం

## 11-9-1970 శుక్రవారం మొదలు
## 17-9-1970 గురువారం వరకు

**మేషం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు.

స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**కర్కాటకం:** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరగలదు. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కన్య:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల:** సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన యిబ్బంది కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృశ్చికం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. మీకు ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలనువింటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు లాభించ గలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** నమ్మిన వారివల్ల యిబ్బంది కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు—అధికవ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను తిరిగి అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. సాటి వారిలో గౌరవం బాగా ఉంటుంది.

—మహేష్






అతనికేం చేయాలో పాలుపోవడంలేదు. బయట చలిగాలి. వెన్నెలవాన. గదిలోపల అగరువత్తుల ధూపం. మల్లెపూల హిన్ను సౌరభం. టీపాయ్‌మీద పండ్లు ఫలహారాలతో స్టీలు పళ్ళాలు. తెల్లని దుస్తులతో అతను. అంతకన్నా తెల్లనైన ఉడుపులలో మంచుతో చెక్కిన బొమ్మలా నించుందామె గది గుమ్మందగ్గర. ఆమె అందాన్ని తనివితీర ఆస్వాదిస్తున్నాడు నరహరి, 'స్వీట్ సిక్స్టీన్...పదహారు సంవత్సరాల పసిడిబొమ్మ' అని నోరు చప్పరిస్తున్నాడతను.

ఆ రాకుమారి క్రీగంటి చూపులు కొరడాదెబ్బల్లా తగిలాయి నరహరికి. అతనికి ధైర్యం వచ్చింది. పురుషత్వం విజృంభించింది. ఆమెని మెల్లగా సమీపించాడు.

'అక్కయ్యా...అక్కయ్యా... తలుపు... తలుపు...' తలుపు తట్టిన చప్పుడు. ఒకసారి సిగ్గుతో నరహరివంక చూసి తలుపులు తీసింది రాకుమారి.

తలుపులు తీయగానే ఇరవై సంవత్స

కాం క్రాఫు చేతిలో సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టెతో ప్రత్యక్షమయ్యాడు.

'అక్కయ్యా...అక్కయ్యా... బావగారు వొచ్చినారుట' అంటూ తడబడుతూ తనకి అందుబాటులోవున్న టేబిల్ మీద అప్పుంచి గబగబా బయటికి వెళ్ళి పోయాడు.

'వెధవా...పెంకిచేష్టలూ నువ్వునూ...' అంటూ మాటల్ని సాగతీస్తూ తలుపులు వేసిందో పెద్ద ముత్తైదువ. నరహరి గుండెలపై ఎవరో బలంగా కొట్టినట్లయింది. అతను అనాలోచితంగా అడిగాడు 'ఎవరా అబ్బాయి.'

'మా తమ్ముడు—' అందామె విశ్లేష్టంగా.

'అంటే' నసుగుతున్నాడతను.

'మా రెండో తమ్ముడు బి.కాం. ఫైనలియర్ చదువుతున్నాడు' అందామె కళ్ళెత్తి అతనివంక చూస్తూ.

నరహరి నోట్లో వచ్చి వెలక్కాయ పడింది.

'అంటే అతని వయసు...వయసు...' అతని మనసులో మాట బయట పడింది. ఆమె చికాకుగా కళ్ళు చిట్లించి చూసింది. అతని శరీరంలో రక్తప్రవాహం ఒక్కర క్షణం ఆగిపోయింది. గబ గబా పెరటి తలుపులు తీసి వెన్నెల వానలో తడసలేక మల్లె పందిరి నీడలో నించున్నాడు. కాని అక్కడ వుండలేకపోయాడు తిరిగి గది లోకి వచ్చి ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

'నీ వయస్సెంత?'

'మా తమ్ముడికి ఇరవై నిండలేదు—' అందామె చురుగ్గా.

'దెన్‌యు ఆర్‌నాట్ సిక్స్టీన్. నాట్ సిక్స్టీన్...' అతని మొహంపై రంగులు మారాయి.

సిగరెట్ వెలిగించాడు. 'సుబ్బ రామయ్యా...పెళ్ళిళ్ళ పేరయ్యా...డామ్ ఆర్చిగూస్...నిన్ను చంపినా పాపం లేదు—' అంటూ మనసులో కసితీరా తిట్టుకున్నాడు నరహరి.

*     *     *

'అయ్యా...ఏదో పెద్దవాణ్ణి. మరీ అంతంత పెద్దపదాలు వాడకండి...వాటి అర్థంకూడా నాకు తెలీదు' అన్నాడు సుబ్బరామయ్య అమాయకంగా మొహం పెట్టి.

'మిస్టర్ సుబ్బరామయ్యా ... నీకో దణ్ణం. నీ సంబధాలకో దణ్ణం. నన్ను విడిచిపెట్టు బాబూ...' అన్నాడు నరహరి బతిమాలే ధోరణిలో.

'మీరిలా తొందర పడకూడదు. ఈ సంబంధం వుంది చూశారూ—?' ఆయన మాటలకి అడ్డొస్తూ అన్నాడు నరహరి, 'మొన్న గజలక్ష్మి సంబంధం విషయంలో కూడా ఇలాగే ప్రారంభించారు'

'మీరు నమ్మరుగాని ఆ గజలక్ష్మికి పదిహేను నిండలేదని ఆవూరి మునసబు, కరణం, సర్పంచ్, చెప్పారు. పైగా అనుమానం వుంటే వంద రూపాయిల స్టాంపు కాగితాలు పుచ్చుకోండి. రాసిస్తామన్నారు' అన్నాడు సుబ్బరామయ్య కండువా సర్దుకుంటూ.

'ఇదిగో ఆ పిచ్చికూతల రికార్డు మళ్ళీ వేయవద్దంటున్నాను. మేం జనన మరణ రిజిష్ట్రారువారి కార్యాలయంలో పది రూపాయిలు తగలేసి కనుక్కున్నాం. ఆ పిల్లకి ఇరవై ఆరు దాటింది.'

'అయిందేదో అయింది. ఈ సంబంధం వుంది చూశారూ రోజాలాంటిది. అమ్మాయిపేరు రాకుమారి. పేరుకు తగ్గట్టు వుంటుంది'

నరహరి గదిగోడకి తగిలించిన 'సిస్కీస్' కాలండర్‌వంక చూస్తున్నాడు.

'మెట్రిక్‌లేషన్ పరీక్షకి చదువుతున్నది.'

'అంటే పదహారు సంవత్సరాలంటావు. మై డియర్ సుబ్బరామయ్య. మెట్రిక్‌లేషన్ చదివేవాళ్ళందరి వయసు పదహారు సంవత్సరాలుండవు.'

'అనకూడదుగాని మీరిప్పుడు చూస్తున్న 'సిస్కీస్'. 'శ్రీమతి' గత ఐదు సంవత్సరాల నుండి తన వయసు పదిహేను నిండాయని ప్రతిపత్రికా విలేఖరితో చెబుతున్నది.'

'అసలు విషయాన్ని దాటేస్తున్నారు.'

'పిల్ల చక్కనిది. పదహారు సంవత్సరాల పసిడిబొమ్మలా వుంటుంది' స్వీట్స్ చప్పరిస్తున్నట్లు చెప్పసాగాడు.

'వుంటుంది అంటున్నారు. మీరు చూడలేదా?'

'బంగారు బొమ్మలా వుంటుందని అర్థం' అని ఒకసారి గొంతు సవరించుకుని 'మీరు ఒకసారి చూస్తే' అంటూ సులోచనాల్లోంచి నరహరిని పరిశీలించ సాగాడు సుబ్బరామయ్య.

నరహరి ఆలోచిస్తున్నాడు. ఆ పదహారు సంవత్సరాల పసిడిబొమ్మనుగురించి.

*     *     *

ఆ బంగారుబొమ్మ అనంతరామయ్యగారి ప్రథమపుత్రిక పేరు రాజకుమారి. ఎం. ఏ. వరకు చదువుకుంది. ప్రభుత్వ మహిళా కళాశాలలో లెక్చరర్ ఉద్యోగం చేస్తున్నది.

అనంత రామయ్యగారికి ఆరుగురు సంతానం. అందులో మొదటి నలుగురు ఆడపిల్లలు. తరువాత ఇద్దరు మొగ పిల్లలు. ఆయన స్వతహా ఆశావాది. పైగా విశాల దృక్పథంగల మనిషి. అమ్మాయిలకి పెద్ద పెద్ద చదువులు చెప్పించి ఉన్నతస్థాయిలో వున్న వుద్యోగులకిచ్చి వివాహం చేయాలనుకున్నారు. కాని ఆయన రెండో కోరిక నెరవేరలేదు.

నేటి యువలోకం చైతన్యవంతమయింది. సమాజం మారుతున్నదని పుస్తకాలలో వాక్యాలు వల్లెవేసేవారు కనబడ్డారు గాని, కట్నంలేకుండా వివాహం చేసుకుంటామని ముందుకి వచ్చేవారు ఆయనకంట పడలేదు. ప్రాథమిక పాఠశాలలో మకుటంలేని మహారాజులా ఉపాధ్యాయ వృత్తిలోవున్న అనంత రామయ్యగారికి, పూర్వులిచ్చిన ఆస్తి ఇరవై వేలు ఖరీదుచేసే భూములు. పెండ్లికొడుకుల్ని వేటాడడంలో విసిగి వేసారిన అనంత రామయ్యగారు చివరికి ఒక డాక్టరు సంబంధం పదివేల కట్నంలో ఖాయంచేశారు. కాని రాకుమారి ఆ సంబంధం పట్ల తన మక్కువ వ్యక్తపరచలేదు. 'నా చదువుకోసం ఆరువేలు ఖర్చుపెట్టారు మళ్ళీ పెండ్లికోసం పదిహేనువేలు ఖర్చుపడితే, నా తరువాత వాళ్ళకి మిగిలే దేమిటని—' తండ్రిని నిలదీసింది.

'నన్ను ఎవరైనా కట్నంలేకుండా పెండ్లి చేసుకుంటానంటే చేసుకుంటానని —' మొండిపట్టు పట్టింది

# స్వీట్ సిక్స్‌టీన్

రాకుమారి:

* * *

'నీ కంత మంకు పట్టుదల తగదురా'

'లేదు నాన్నా ...పిల్ల నాకు నచ్చాలి. అప్పుడే పెండ్లి. వాళ్లు కట్నం ఇవ్వక పోయినా సరే.'

'అయితే నీకీ జన్మలో పెండ్లికాదు' అంటూ విసుక్కున్నారు లక్ష్మీపతిగారు.

'ఫరవాలేదు—' అన్నాడు నిర్లిప్తంగా వరహరి.

'అదికాదురా' అంటూ హితబోధ చేయబోయిన తండ్రిమాటల్ని లక్ష్యపెట్ట కుండా బయటికి వెళ్లిపోయాడు వరహరి.

కొడుకు పెండ్లితో తన ఆస్తిని రెండింతలు చేయదలచిన లక్ష్మీపతిగారి ఏకైక పుత్రుడు వరహరి. అతి గారాబంగా పెరిగిన వరహరి ఎస్.ఎస్.ఎల్.సిని దాటలేక అచ్చిరాలేదని మెట్రిక్ అయి పోయిందనిపించి, పి. యు. సి.లో అనేక పరాభవాలు పొంది, మార్చి, సెప్టెంబర్, మార్చి, నామస్మరణలో చివరికి బి. ఏలో ప్రవేశించి క్రిందపడ్డా పైచెయ్యి నాదంటూ ఎం. ఏ. ప్రయివేటుగా పూర్తి చేశాడు.

అతనికి అప్పుడే ముప్పై సంవత్సరాలు నిండాయని అతని విద్యా సంబంధమైన కాగితాలు చెబుతాయి. కాదు ఇంకా ఎక్కువ వయసుండ వచ్చునని బట్టతల ఏర్పడ్డానికి దోహదం కలిగించే అతని తెల్లవెంట్రుకలు, నల్లనైన అతని భారీ శరీరంలోని అలసట తెల్పుతాయి.

అతనికి చిన్నతనంనుండి ఒక కోరిక వుంది. అది తను పెద్ద పెద్ద చదువులు చదవాలని. పెద్ద ఉద్యోగం చేయాలని. తరువాత పదహారు సంవత్సరాల పసిడి బొమ్మని వివాహమాడి సినిమాల్లో లాగా హాయిగా కాలక్షేపం చేయాలని.

అతని మొదటికోరికని కష్టపడి సఫలీకృతం చేసుకున్నాడు. ఉద్యోగం చేయ నవసరంలేని ఆస్తి అతనికుంది. ఇక పద హారు సంవత్సరాల పిల్లని చేసుకోవాలన్న కోరిక ఎండమావిలా మిగిలింది. అతను చదివిన పుస్తకాల్లోనూ, చూసిన సినిమా ల్లోనూ, 'పదహారు సంవత్సరాల' ప్రాము ఖ్యతను అతను గమనించాడు. అందుకే ఆరాటం. ఆ అందాన్ని అనందాన్ని అందు కోవాలని. కాని ఆ అవకాశం అతనికి అందుబాటులోకి రాలేదు.

లక్ష్మీపతిగారికి కొడుక్కి పెళ్లి కాదేమో అని భయం. ఇటువంటి పరిస్థితులలో ఎలా వ్యవహరించాలో ఆయన ఆలోచిస్తున్నారు. పెద్దల సూక్తులు గుర్తుకు తెచ్చుకుంటున్నారు.

* * *

'చూడండి వెయ్యి అబద్ధాలాడి ఒక పెండ్లి చేయమన్నారు. మీరిలా చూస్తూ కూర్చుంటే మీ అమ్మాయికి పెండ్లి కాదు—' సుబ్బరామయ్య ఆగాడు, అనంత రామయ్యగారు ఆలోచిస్తున్నారు.

'అబ్బాయి ఎం. ఏ. వరకు చదువు కున్నాడు. ఉద్యోగం చేయక పోయినా తినడానికి బోలెడంత ఆస్తివుంది — ఇక పోతే.. ఏదీ నస్యం కొంచం' అంటూ అనంతరామయ్యగారి దగ్గర తీసుకున్న నశ్యం ఒకపట్టు పెట్టాడు.

'అబ్బాయి వయసు ముప్పైసంవత్సరా లంటున్నారు కానీ, దాటింది. ఇక మీ అమ్మాయి వయసు తెలుసుకదా ?'

'అది నిజమే అనుకోండి' అంటూ సాలోచనంగా ఆగాడు అనంతరామయ్యగారు.

'అన్నింటికన్న ముఖ్యం పిల్ల. పిల్ల వాడికి నచ్చింది. మీ అమ్మాయికి అబ్బాయి నచ్చాడని చెబుతున్నారు—'

'అన్నీ బాగానే వున్నాయికాని, నేను చేసే మొదటి శుభకార్యం, ఎవరికి తెలీ కుండా తిరుపతిలో జరగాలంటే నామన స్సంగీకరించడంలేదు.'—ఆయన మాటలకి అడ్డువస్తూ అన్నాడు సుబ్బరామయ్య—

'చూడండి...పిల్లవాడు మంచివాడు. అమాయకుడు. మనం తిరుపతిలో వివాహం ఎందుకు సంకల్పించామో మీకు తెలుసు.'

'సరే చేస్తామనుకోండి. తరువాత... ఏమైనా పేచీలు వస్తాయేమో ?' అని తన సందేహం వెలిబుచ్చాడు అనంతరామయ్య గారు.

'అసలు విషయం మీకు, నాకు, లక్ష్మీ పతిగారికి తప్ప యింకెవరికీ తెలియ నీయము — పెండ్లి అయిన తరువాత చూస్తారుగా—నా తడాఖా—'

'ఆడపిల్ల తండ్రిని, నేను కొంచెం ఆలోచించుకోవలసి వుంది'

'దీంట్లో ఆలోచించవలసిన దేమీలేదు. అంతా నామీద వదిలేయండి. రాకుమారి నా కూతురనుకొని ఆ వరహరికి ఒక గుణపాఠం చెబుతాను—పదహారు సంవత్స రాల పిల్ల కావాలట ! ముప్పైరెండు సంవత్సరాల కుర్రాడికి.'

'మీ రంతగా చెబుతున్నారు కాబట్టి ప్రస్తుత నా పరిస్థితుల దృష్ట్యా ఒప్పు కుంటున్నాను...మీ యిష్టం.'

'సరేయిక అసలు విషయంలోకి వద్దాం—' అంటూ ఒకసారి గొంతు సవరించుకున్నాడు సుబ్బరామయ్య.

* * *

'ఇక అసలు విషయం. పెండ్లి చాలా సింపుల్‌గా చేస్తున్నారు. కాబట్టి అవీ యివీ అన్నీ కలుపుకుని అయిదువేలు యిస్తామన్నాడు' అంటూ కాఫీగ్లాసు అందుకున్నాడు సుబ్బరామయ్య.

'అయిదువేలా ?' అంటూ నిరుత్సాహ పడ్డారు లక్ష్మీపతిగారు.

'అవును మీ అబ్బాయి పిచ్చికోరిక మీకు తెలుసుకదా. ఎవరైనా 'పిచ్చిది' ప్రేమంటూ మోసంచేసి పెండ్లి చేసు కుంటే ఏం చేస్తారు?' అంటూ సవాల్ చేశాడు.

'ఈ పిచ్చిలో మీ అబ్బాయి వర్ణాం తర, మతాంతర వివాహం చేసుకుంటే మీరేం చేస్తారు ?' మీ మర్యాదా, పరువు మంట గలుస్తాయి. కట్నంకూడా రాదు.'

లక్ష్మీపతిగారు ఆలోచిస్తున్నారు.

'నేను అన్ని కోణాలా ఆలోచించాను. ఈ సంబంధం మీకు అన్నివిధాల తగినది. మీ అబ్బాయి ఆరోగ్యంగా వుండాలంటే ఈ పెండ్లి జరిగితీరాలి' అంటూ కాఫీ త్రాగడం పూర్తిచేశాడు.

'అంతే నంటారా ?'

'మీరు ఆలోచిస్తూ కూర్చుంటే నేను ముందుగా చెప్పిన ఏ అపదైనా జరగవచ్చును.' అంటూ కాఫీ త్రాగడం ముగించాడు సుబ్బరామయ్య.

'సరే మీ యిష్టం' అంటూ నిశ్చింతగా నిట్టూర్చారు లక్ష్మీపతిగారు.

* * *

కట్నం ఆశించేవారిని పెండ్లి చేసుకుంటానన్న రాకుమారికి పదహారు సంవత్సరాలు నిండని పసిడిబొమ్మని పెండ్లి చేసుకుంటానని ప్రతిజ్ఞ చేసిన నరహరికి గుట్టుగా తిరుపతిలో పెండ్లి చేయించారు సుబ్బరామయ్య యిందులో ఆయన స్వార్థం లేదు. వివాహాలు ఆ లోకంలోనే జరిగిపోతాయి. కేవలం మనం నిమిత్త మాత్రులం. ఇది కావాలనీ, అది కావాలనీ కోరుకున్నా మనకి లభించేది 'కర్మ' ననుసరించే మాత్రమే అని నిరూపించదలిచాడు సుబ్బరామయ్య.

* * *

బాలభాస్కరుని బంగారు కిరణాలు చురుక్కుమని గుచ్చుకోగానే ఉలిక్కిపడి లేచాడు నరహరి. గోడగడియారం ఎనిమిదిగంటలు కొట్టింది. బయట గాజుల గలగలలు. గుసగుసలు. సన్నగా నవ్వులు. ఎవరో అంటున్నారు

'ఏమిటే బావగారికి రాత్రి అసలు నిద్ర లేకుండా చేశావా?' మంచంమీద పడుకున్న నరహరి 'ప్స్' అనుకుంటూ లేచాడు. ఆ రాత్రి అతను దీనాలోచితంగా, ఆలోచిస్తూ మంచంమీద పడుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో అతనికి తెలియదు. గదితలుపులు తీయబోయిన నరహరి ఒకసారి భయంలో వణికాడు. రాత్రి జరిగిన సంఘటనతో ఏడ్పులు, అల్లరి, గందరగోళంతో యిల్లు నిండిపోతుందని ఆశించాడు. వాళ్ళు అడిగే ప్రశ్నలకి జవాబులు సిద్ధంగా వుంచుకున్నాడు. కాని అతనాశించిన మార్పు ఆ యింటి వాతావరణంలో లేదు. కాలకృత్యాలు ముగించుకుని కాఫీ తాగాడు. సమయంకోసం ఎదురు చూస్తున్నాడు తన బాధని, అక్కసుని వెలిబుచ్చడానికి. కాని ఆ యింటిలో ఎవరిపనిలో వాళ్ళున్నారు,

స్నానానికి బాత్‌రూంకి వెళ్తున్న నరహరి నెత్తిమీద పిడుగు పడినట్లయింది. ఒకసారి బాధగా వెనక్కి చూశాడు.

'అవునే ఆ ముసలాడ్ని ఎవరు చేసుకుంటారే'

ఆ కంఠంలో ఆవేశం కళ్ళల్లో అధికృత పదహారు సంవత్సరాలు నిండని ఆ పసిడి బొమ్మ లేగులాబీరంగు పరికిణీ, ఓణీలలో మెరిసిపోతున్నది.

'అదికాదే రుక్మిణి అతనికింకా ముప్పై సంవత్సరాలు నిండలేదుగా?'

కోపంగా బాత్‌రూం తలుపులు మూశాడు. మళ్లొసందిరి నీడలో వాళ్ళ సంభాషణ అతనికి వినబడుతోంది.

అతని ఉద్రేకం, ఆవేశాల్ని పోసుకుంటున్న వేడినీళ్ళు మరింత రెచ్చగొడుతున్నాయి.

స్నానం ముగించి బట్టలు కట్టుకుని వరండాలోకి వచ్చాడు.

'ఇదిగో రంగనాథం నీకిది న్యాయం కాదు. రుక్మిణికి పదహారు నిండలేదు... మరి' ఆ పెద్దమనిషి ఆగడు.

పేపరు చూస్తున్న నరహరి వాళ్ళ సంభాషణ ఆసక్తిగా వింటున్నాడు.

'అది కాదయా... అతను రుక్మిణినితప్ప యింకెవరిని పెండ్లిచేసుకోనంటున్నాడు'

'ఎలా యిస్తామయ్యా... అతని వయసు మీకు తెలుసుకదా ... దాని మనసుకూడా మనం అర్థం చేసుకోవాలి.'

నరహరి ఆలోచిస్తున్నాడు. 'అతను తనకున్న కోరికే వాళ్ళకీ వుండవచ్చును. ఇరవై సంవత్సరాల యువకుడ్ని వారూ కోరుకోవచ్చును. తాను ఎంత మూర్ఖంగా ప్రవర్తించాడు. రాకుమారి. నిజంగా అన్నివిధాల రాకుమారి. రాత్రి జరిగిన సంఘటన్ని పెదవి దాటనీయలేదు. అంతటి అమాయకురాలిపట్ల తన కెందుకీ విముఖత! ఆమె సహనం ముందు తన దురుసుతనం ఎందుకూ పనికిరాకుండా పోయింది. తాను ఎంత ఆటవికుడిలా ప్రశ్నించినా, ఓర్పుతో సమాధాన మిచ్చింది. చదువుల సరస్వతి, లక్ష్మి రూపవతైన రాకుమారిని ఎంత చులకనగా చూశాను...'

'ఆ అమ్మాయితప్పు లేదు. మనోరమ యిప్పుడు కాకపోయినా యింకెప్పుడైనా పారిపోయేదే. వయసులో వున్న అమ్మాయిని డబ్బు కక్కుర్తితో తల్లిదండ్రులు రెండోపెండ్లి చేశారు.

బలహీనుడు, వృద్ధుడైన రెండోపెండ్లివాడు ఆమె ఆశల్ని త్రుంచేశాడు. అప్పుడేం చేస్తుంది?' ఆవేశంగా ప్రశ్నించారు రంగనాథంగారు.

నరహరి పేపరు చదవడంలేదు. అతనికి జ్ఞానోదయ మయినట్లయింది. రాకుమారిని కలుసుకుని క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాడు.

గబగబా లోపలిగదిలోకి నడిచాడు నరహరి.

'అబ్బాయికి కాఫీకావాలేమో అమ్మాయి చేత పంపించండి' అంటున్నాడు సుబ్బరామయ్య వరండా స్తంభందగ్గర నించుని.

వెనక్కి తిరిగి చూశాడు నరహరి. ఆ గదితలుపులు మూసుకున్నాయి.

'కాఫీ తీసుకోండి. చల్లారి పోతున్నాయి' అన్న రాకుమారి కంఠం సౌమ్యంగా వినబడింది. ప్రేమతో ఆమె కళ్ళల్లోకి చూశాడు నరహరి. ●



# పాదరక్షల పరిశ్రమకి అంకితమైన కుటుంబం!

ఇటలీలో పేరుపొందిన అధునాతనమైన జోళ్ళను తయారుచేసే సంస్థను నిర్వహిస్తున్నది 27 ఏళ్ళ స్త్రీ అని విన్నపుడు ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. అంతర్జాతీయ సంస్థగా— ఈ కంపెనీ అగ్రస్థానాన ఉండటానికి ఈ 'జోళ్ళరాణి' తో పాటు—ఆమె ఇద్దరు చెల్లెళ్ళు, తమ్ముడు ఉన్నారు. ఈ నలుగురి వయసు కలిపినాకూడా ఒక శతాబ్దం కాదు.

చేతుల్తో తయారుచేసే జోళ్ళను దిగుమతి చేయటంలో ఫ్లోరెన్‌టైన్ ఫరమ్ పెద్దది. ఈ సంస్థకు చీఫ్‌డిజైనర్ గాను, స్టైయిల్ సెట్టర్‌గాను ఉంటున్న ఇటలీ అందగత్తె 'జోళ్ళరాణి' పేరు ఫియమ్మా ఫెర్రగామో. ఆమెకుగల ఇద్దరు చెల్లెళ్లలోను పెద్దది గియోవన్నా 26 ఏళ్ళ అమ్మాయి రెండో అమ్మాయి ఫుల్వియా 20 ఏళ్ళది. తమ్ముడు ఫెర్రూక్కియో 25 ఏళ్ళవాడు. 'ఫెర్రగామో బటిక్‌వేర్'ను ఇటీవలి సంవత్సరాలలో గియోవన్నా ఎంతో అభివృద్ధి చేసింది. ఈ షాపుల యాజమాన్యం ఫెర్రూక్కియో చూస్తున్నారు హాండ్ బాగ్స్‌కి, దుస్తులకి, నగలకి, బెల్టులకు డిజైన్స్ చేయటంలో ప్రత్యేకత కలిగిన చిన్నది ఫుల్వియా.

**కుటుంబ సభ్యులంతా సమర్థులే!**

స్వర్గస్థుడైన సాల్వేటర్ ఫెర్రగామోకి పుట్టిన మొత్తం ఆరుగురు సంతానంలోను వీళ్ళు నలుగురు ఫియమ్మా తండ్రి సాల్వేటర్‌ని—రెండు ప్రపంచ సంగ్రామాలమధ్య అదృష్టం వరించింది. హాలీవుడ్ చిత్రపరిశ్రమలోని తారలకు జోళ్ళను సప్లయి చేసే అవకాశం ఆయనకు ఆ కాలములో లభించింది. విండ్‌సర్ రాణి, గ్రేటాగార్బో, ఆడ్రేహెప్ బర్న్, సోఫియా లారెన్‌వంటి ప్రసిద్ధతారలు ఈనాడు వారి ఖాతాదారులు

ఆర్నోదగ్గర 13 వ శతాబ్దానికి చెందిన భవనంలో ఫ్లోరెన్‌టైన్ ఫరమ్ పని చేస్తున్నది. అది ప్రత్యేకమయిన చిన్న ఆలయంలా వుంటుంది. మొదటి అంతస్థులో ఫియమ్మా తయారుచేసిన నమూనాలక్కు వందలకొద్దీ ప్రతిరూపాలు చిలకరించినట్లుగా కనిపిస్తవి. మరో ప్రక్క గియోవన్నా అందాల డ్రెస్‌షాపు ఉన్నది. గియోవన్నా పదహారోఏట స్కూల్ గర్ల్‌గా ఉన్న రోజుల్లోనే బట్టలకు డిజైన్‌చేయటం ప్రారంభించింది. ఆమె డిజైన్‌చేసిన దుస్తులు అమ్మకానికి పెడితే విపరీతంగా అమ్ముడు పోయినవట! ఇప్పుడామెకు పెళ్ళిఅయింది, ఇద్దరూపిల్లలూ ఉన్నారు. ఫుల్వియా ఇప్పుడే ప్రారంభించి నప్పటికీ హేండ్‌బేగ్స్‌మీద బాధ్యత ఆమెదే.

**ఫెర్రూక్కియోకి ఛైర్మన్‌షిప్**

వారితల్లి సిగ్నోరావాండా ఈ సంస్థకు అధ్యక్షురాలు. వారి బంధువు జెర్రీఫెర్రగామో కార్యనిర్వహణను, వ్యాపార విషయాలను చక్క బెడుతుంది. వేరొక రూపంలో వాళ్ళ చిన్నతమ్ముళ్ళు మాసిమోకి, లియొనార్డోకి శిక్షణ ఇస్తారు. 'ప్రతి రెండు, మూడేళ్ళకి ఎవరో ఒకరు పైకి వచ్చేట్టుగా చూస్తాము' అంటుంది ఫియమ్మా. చివరికి ఈ సంస్థ ఛైర్మన్‌షిప్ పదవి ఫెర్రూక్కియోకి రాగలదని భావించబడుతున్నది. అతను ఎకనమిక్స్, బిజినెస్ మేనేజిమెంటు చదువుతూ—ఇక్కడ ఈ పరిశ్రమలో ప్రత్యేక శిక్షణ పొందుతూ పెరిగాడు.

**ఇతర దేశాలలో డిస్ట్రిబ్యూషన్ ఏర్పాట్లు!**

సాల్వేటర్ పిల్లలు తండ్రినుంచి వృత్తికి పుచ్చుకున్న ఈ విద్యను, వృత్తిని తమ స్వంత పద్ధతులమీద ఎంతో అభివృద్ధి పరిచారు; విస్తృతం చేశారు. జోళ్ళ ఉత్పత్తి 76,000 జతలు 1960 లో



పాదరక్షలు తయారుచేసే నమూనాను సోదరుడితో చర్చిస్తున్న 'జోళ్ళరాణి'

ఉంటే ఆ సంవత్సరాంతానికి 1,50,000 పెరిగింది. ఇందులో 80 శాతానికి పైగా ఎగుమతి చేస్తారు. ఎక్కువగా యునైటెడ్ స్టేట్స్‌కి ఈ ఎగుమతి జరుగుతుంది. ఫ్లోరెన్ ఫైన్ ఫరమ్‌కి న్యూయార్కు, లండన్, జూరిచ్ (ఇటలీలో వరేసరి) మొదలైన నగరాలలో స్వంత షాపులు ఉన్నవి. ఇతర దేశాలలో డిస్ట్రిబ్యూషన్ ఏర్పాట్లుకూడా వున్నవి ప్రస్తుతం పశ్చిమజర్మనీ, హాలెండ సేవియాలలో అమ్మకాలు ప్రారంభించాలనే ప్రయత్నాలు జరుగుతున్నవి. అక్కడ ఈ మధ్యనే కొత్త డిస్ట్రిబ్యూషన్ ఒప్పందాలు పూర్తి అయినవి.

**నిగర్వి, నిరాడంబరి అయిన అందగత్తె**

నిగనిగలాడే నల్లని కురులూ, ప్రకాశవంతంగా మెరిసే కళ్ళూ కలిగిన ఫియెమ్మాలో తమాషా అయిన అందం దోబూచులాడుతూ ఉంటుంది. నిగర్వి. ఎంతో నిరాడంబరత ఆమెలో గోచరిస్తుంది. యవ్వనం ఆమె వృత్తినీ; కృషినీ అటంకపరచలేకపోయింది. ఆమెకు 19 ఏళ్ళప్పుడు తండ్రి సాల్వెటర్ మరణించాడు. ఆయన చనిపోవటానికి రెండు సంవత్సరాలకు ముందు ఆమెను తనకు సహాయంగా తీసుకున్నాడు. ఈ పరిశ్రమ మేజర్ మార్కెట్‌ను తెలుసుకుంటుందని తనతోకూడా ఫియెమ్మాని యునైటెడ్ స్టేట్స్‌కి తీసుకువెళ్ళాడు. ఆయన ప్రయత్నం, ఆలోచన



జోళ్ల రాణి—ఆమె తయారుచేసిన పాదరక్షల కొన్ని నమూనాలు.

వృథా పోలేదు. ఆమె ఆ లేత వయసునుంచే తండ్రితో తిరిగి అన్నీ అవగాహన చేసుకుంటూ వచ్చింది. అందుకే ఈ నాడు వ్యాపారంలో యింత అభివృద్ధిని సాధించ గలిగింది.

జీవితాన్ని ఎంతో అణకువగా తనకు అనుకూలంగా మలచుకున్నది. జీవితంలో ఎక్కువభాగం జోళ్ళలోనే గడుపుతున్నా — ఆమెకు జోళ్ళు ఎక్కువగా లేవు. మహా వుంటే 25 లేక 30 జతలు ఉంటవి. 'ఏ విషయంలో అయినా ధరించే వస్తువులు బాగా ఉన్నవి చూసి కొన్ని మాత్రమే ఉంచుకుంటాను. సాధ్యమయినంత మంచిరకంవి వాడుతాను. స్త్రీలకు పనికివచ్చే సున్నితమైన వాటినే ఉపయోగిస్తాను' అంటుంది ఫియెమ్మా.

**గృహిణిగా బాధ్యతలు**

ఇతరత్రా మరేమీ పట్టించుకోకుండా ఆమె కేవలం తన కాలమంతా జోళ్ళలోనే గడిపివేస్తుందని అనుకుంటే పొరపాటే అవుతుంది. రాత్రి 7 గం॥ల కల్లా తన చిన్నకారును నడుపుకుంటూ భర్తదగ్గరికి ఇంటికి వెళుతుంది. గృహిణిగా తన బాధ్యతలు సక్రమంగా నెరవేరుస్తుంది. కిందటి సెప్టెంబరులో ఆమెకి పెళ్లి అయింది. గుణవంతుడయిన సిసిలీ యువకుణ్ణి చేసుకుంది. ఆయనకి స్వంతంగా గృహోపకరణాలకుపయోగించే వస్తువుల వ్యాపారం ఫ్లోరెన్స్‌లోనే ఉన్నది. భార్య ఫియెమ్మా వ్యవహారదక్షతను కృషిని ఎంతగానో అభినందిస్తూ ఉంటారాయన.

తండ్రి పోయినతర్వాత; తానే పెద్దరికం వహించి చెల్లెళ్ళ తమ్ముళ్ళ జీవితాలను చక్కదిద్దుతూ—పాదరక్షల పరిశ్రమను యింత విస్తృత పరచిన 27 ఏళ్ల ఫియెమ్మా ఫెరగామో విశేష కార్యదీక్షను హర్షించని వారుండరు.

(ఫో. వ. ఫీ)

### జరిగిన కథ

ప్రేమించినవాడు మోసం చేశాడని కుమిలి పోతున్న రాధ అతను వస్తున్నాడని తెలిశ్రగాం చూసుకుని మురిసిపోయింది. పెళ్లి చూపులకని వచ్చిన సీతారాం రాధని గుర్తించాడు. రాధని తన భార్యగా పరిచయం చేసి అందర్నీ ఆశ్చర్య పరిచాడు. అతనెవరో తనకి తెలియదు అని ఏడ్చింది రాధ. అంతా రాధని పిచ్చిదని నిర్ణయించు కున్నారు. ఆమె ఒక బిడ్డకి తల్లి అని డాక్టరు కూడా చెప్పడంతో వారినిర్ణయం ధృవపడింది. రాధ సీతారాంని తెలియదు అని అనడంలో ఏదో నిగూఢ రహస్యంవుందని ప్రేమారావు అభిప్రాయం. రాజశేఖరం హఠాత్తుగా ప్రవేశించాడు. అతను తన భర్త అంది రాధ. రాధ ఎవరో నాకు తెలియదని వెళ్లిపోయాడు రాజశేఖరం. రాధ తన బాధని ప్రేమారావు దగ్గర వెళ్ల బోసుకుని ఏడ్చింది.

### నాటకం



### పది

స్థలం : ఒక హోటలు గది.

[రాజశేఖరం గదిలో కూర్చున్నాడు. సిగరెట్టు మీద సిగరెట్టు తాగుతున్నాడు. అతనికి ఎదురుగా బ్రాందీ సీసాలున్నాయి. ఎడతెగకుండా తాగుతున్నాడు. తలుపు చప్పుడయింది.]

రాజశేఖరం : ఎవరది...?

ప్రేమారావు : [అవతలి నుంచే] తలుపు తియ్యండి బాబూ..

రాజశేఖరం : [నెమ్మదిగా] తలుపు తియ్యండి...? [నవ్వాడు] హు.. తలుపు తియ్యండీ అట.. తలుపు తియ్యండీ...భలే..! ఈ తలుపులు ఎప్పుడు మూత పడ్డాయో నాకే తెలియదు. ఇవి ఇంకా తెరుచు కుంటాయా? అని..! [గట్టిగా] తమరెవరో రావచ్చు. అభ్యంతరం లేదు.

ప్రేమారావు : తలుపులు తియ్యండి.

రాజశేఖరం : తలుపులు తియ్యమంటున్నారెవరో.. మూసిన తలుపులు తెరవమంటున్నారెవరో..?

[లేచాడు. వెళ్లి కష్టసాధ్యం మీద తలుపు తియ్య గల్గాడు. ప్రేమారావు, వెనక రాధ వచ్చారు.]

రాజశేఖరం : స్వాగతం.. సుస్వాగతం.. రండి.. రండి.. [అప్పుడు చూశాడు రాధని..చేతిలో గ్లాసుని అలా విడిచి పెట్టేశాడు.] ఎవరు మీరు? ఇక్కడి కెందుకొచ్చారు?

ప్రేమారావు : అంతా సెబుతాను బాబూ.. ఈడ కూసోడానికి మీకేమన్నా అబ్బెంతరమా?

రాజశేఖరం : లేదు..లేదు.. నా హెటాల్..నా హెటాల్. నాతో కూర్చుని.., ఇదిగో ఈ అమృతాన్ని సాయం పడతానన్నా.. నాకేమీ అభ్యంతరం లేదు. వూ..తీసుకోండి.. ఇదిగో.. [సీసా ఇవ్వబోయాడు]

రాధ : [ఏడుపు ముంచుకొచ్చింది] రాజా.. నా రాజేనా మీరు..? మిమ్మల్నీ పరిస్థితిలో చూస్తానని కలలో కూడా అనుకోలేదు.

రాజశేఖరం : కలల్లో అన్నివిషయాలకీ చోటుండదు. కరెక్ట్ యువర్ సెల్ఫ్ మై డియర్..! అన్నీ కలల్లోకి రావు. అయినా, నా గురించి అంతగా ఆరా తీస్తున్నారు..మీరెవరో తెలుసుకోవచ్చా..?

రాధ : ఎంతగా మారిపోయారు?

రాజశేఖరం : కరెక్ట్..! డామ్ కరెక్ట్..! కాలం మారుతున్నది. లోకం మారుతున్నది. మనుషులు మారుతున్నారు. భూమి తిరుగుతున్నదీ అన్నమాట ఎంత సత్యమో.. మనుషులు మారడం కూడా అంతే సత్యం. యస్..! గాడ్ ప్రామిస్.. నిజం. నామాట నమ్మండి..!

రాధ : నా రాజుకి ఇంత దుస్థితి పట్టిందా? మిమ్మల్నీ పరిస్థితిలో చూస్తుంటే.. మీరు నా రాజేనా? అని అనుమానం కల్గుతోంది.

రాజశేఖరం : నిజం.. నిజం..! హెంట్ పర్సెంట్ ట్రూ. నేను నీ రాజుని కాదు. నీ రాజుని కానే కాదు. ఇంత మీరెవరు ఎందు కొచ్చారు? చెప్పనేలేదే..? నో.. అయామ్ సారీ.. నేనూ అడగలేదు కదూ..

రాధ : ఏం చెప్తాను? ఏమని చెప్తాను..? మీకు కారు ఏక్సిడెంటయిందని విన్నాను. మీరు ఎటు వంటి స్థితిలో వుండగా ఆ యాక్సిడెంటు జరిగి వుంటుందో ఇప్పుడు వూహించగల్గుతున్నాను. ఎందుకు రాజా? ఈ తాగుడు ఎందుకు అలవాటు చేసుకున్నారు..? మీకీ దుర్గతి ఎందుకు కల్గింది? ఇవన్నీ చూస్తూ వుండడానికేనా నేను బ్రతికున్నది?

రాజశేఖరం : [నవ్వాడు] అహహహా... మీరెవరో గాని.. మా అమ్మలాగా అమ్మమ్మలాగా అంతులేని అభిమానం కురిపించేస్తున్నారు. థాంక్స్. కాని, మీ అభిమానానికి నేను తగినవాడిని కాదు. దయచేసి అలా మాట్లాడకండి. ప్లీస్..! మీరు వచ్చిన పని చెప్పండి..కట్టె కొట్టె తెచ్చె., అంతే. అంతే చెప్పండి. చాలు. అవతల నాకు బోల్డంత పనుంది.. ఇదిగో ఈ సీసాలన్నీ నాకోసం ఎదురు చూస్తున్నాయ్.. [సీసాల వైపు చూశాడు. ఒకటి చేతులోకి తీసు కున్నాడు. హృదయానికానించుకున్నాడు] డోన్ట్ వర్రీ మై డియర్.. అయామ్ ఎట్ యువర్ సర్వీస్.. ప్లీస్ వెయిట్ .

రాధ : నేను ఇప్పుడు ఏమి చెప్పినా— మీరు అర్థం చేసుకోగల పరిస్థితిలో వుంటే కదా?

రాజశేఖరం : నోనో.. చెప్పండి.. దేనికదే..నేను తాగనూగలను..వాగనూగలను.. మీరు చెప్పేది వినమూ గలను.

రాధ : మీకారణంగా నా బ్రతుకు నాశనమై పోతున్నది. పోనివ్వండి. మీరు కూడా యిలా దిగజారి పోవడం., చూస్తూ ఎలా భరించగలను..? నామాట వినండి. ప్లీస్..ఈ తాగుడు మానెయ్యండి...

రాజశేఖరం: నోనో..... తాగుడే నా జీవితం... తాగుడే నా పరమార్థం....తాగుడే నా ప్రాణం.....! నా ప్రాణాన్ని నానుంచి దూరం చెయ్యడానికి నువ్వె వరు......? ఆ.....? ఎవరు నువ్వు...ఎవరిచ్చారు నీకీ అధికారం......?

రాధ: మీరు.

రాజశేఖరం: ఆ.....? నేనా....! నేను [నవ్వు] భలే భలే....వండర్‌ఫుల్... నేనెవరు? నువ్వెవరు? అంతా మిధ్య. చాలా పొరబడుతున్నావ్...

రాధ: నేను పొరబడ్డంలేదు. నేను మీ భార్యని. మీ భార్యగా, మీ మేలుకోరే స్నేహితురాలిగా...మిమ్మల్నీ తాగుడు మానెయ్య మంటున్నాను.....

రాజశేఖరం: భార్యా:...! అహహహా....,భార్య! ఒక భార్యకి ఇద్దరు భర్తలు? ఇది హిందూ సాంప్రదాయమా...... ? వాహ్...... చరిత్రలో

గొప్ప అంతం ... భారతనారి అంటే నువ్వు. యావద్ నారీలోకానికి నీ జీవితం ఒక ఆదర్శం. హియర్....హియర్....! [చప్పట్లు కొట్టాడు గ్లాసులోకి వంచుకొన్నాడు.]

రాధ: [ఏడ్చింది.]

ప్రేమారావు: బాబుగోరూ...ఇంక తాగకండి బాబూ......! ఒకసారి మా రాధమ్మగోరి మాటలాల కించండి.

రాజశేఖరం: రాధమ్మ....గుడ్.... వెరీగుడ్..! వీరు రాధమ్మగోరా....? రాధమ్మగోరూ నమస్కారం... [ప్రేమారావుతో] మరి మీరు?

ప్రేమారావు: ఒక పనికిమాలినోడినిసార్. తప్పారవలా ... ఒక అమాయకురాలు పులినోట్లో పడి కోరల్లో నలిగిపోతూవుంటే ఏమీ సెయ్యలేక— సూత్తూ సూత్తూ వూరుకొన్న శాతకాని యెదవని ముద్ద యెదవని.

రాజశేఖరం: వండర్ పుల్... నువ్వుకూడా వో కథ చెప్పుకొస్తావా......?

ప్రేమారావు: అవునుబాబూ ....తప్పారవలా... వినేవాళ్ళంటే ఎన్నికథలైనా చెబుదామనే వుంటుంది.

రాజశేఖరం: కమాన్....చెప్పు... ఎన్ని కథలన్నా వింటాను.

ప్రేమారావు: మేము కథలు చెప్పుకుని ఆనందించేంత సుఖంలో లేము బాబూ, మీకు యాక్సిడెంటయిందని తెలుసు కున్నాక, రాధమ్మగోరు మిమ్మల్ని సూడాలని ఒకటే కలవరింతలు. ఆమె బాధ సూడలేక... సెయ్యరాని పనే అయినా, సేత వయింది గనక— మీదగ్గరికి లీసుకొచ్చాము.

రాజశేఖరం: వోహొహో ..... మీ కథకీ నాకూ ఏదో సంబంధం వున్నట్టే వుంది. చెప్పు. ఇన్నేం చెయ్యమంటావ్...

ప్రేమారావు: ఏమీ వద్దు. ఒకసారి మా రాధమ్మ గోరిని సూడండి. బాగా సూడండి. ఎలాంటి రాధమ్మగోరు ఎలా అయిపోయారో ? ఆమెగోరు మీకోసం ....తపించి పోతున్నారు బాబూ.....! ఒకసారి గేపకం సేసుకోండి..మీరు కాలేజీలో ప్రేమించి పెళ్ళిచేసుకున్నది— ఈరాధమ్మనవునో కాదో....బాగా గేపకం సేసుకోండి......

రాజశేఖరం: ఇది మరీ బాగుంది... మా పెళ్ళికి నువు సాక్షినంటావా ఏమిటి కొంపదీసి...... ?

ప్రేమారావు: తప్పారవలా అలా ఎందుకంటాను బాబూ...? ఆయిల్లో నరకం బాబూ...! ఆ యింట్లో రాధమ్మ గోరికి నాకంటే ఆప్తులు లేరు. ఆ యింట్లో ఆమెగోరు పడే ఆవేదన నేను సూడలేక పోతున్నాను. సెప్పండి.....మీరు యిదేశాలు యెళ్ళకముందు పెళ్ళిసేసుకున్న రాధమ ఈ రాధమ్మ అవునా కాదా సెప్పండి. రాధమ్మ ముకంలోకి సూసి ఒక్క మాటనండి..బాబూ.......! రాధమ్మే మీ బార్య అని ఒక్కమాటనండి బాబూ.........!

రాజశేఖరం రాధ ముఖంలో [illegible] చూశాడు. రాధ కూడా అతన్ని ప్రాధేయ [illegible] చూసింది నమ్మమన్నట్లు.

రాజశేఖరం: పాపం...... పూర్ [illegible] ఈ అమ్మాయి ముఖం చూస్తుంటే నాకు జాలేస్తోంది. అయ్ పిటీ హెర్. కాని, నువ్వు చెప్పిందంతా అబద్ధం

రాధ: రాజా.......

రాజశేఖరం: హలో గార్డియన్.... ఈ యమ్మాయిని చూస్తే నాకు జాలి...! నేను కరిగిపోయాను. ఏమన్నా సాయం కావాలంటే అడుగు..కథలు చెప్పకు. సాయం అడుగు. య్యగ్రిం చేస్తాను.

ప్రేమారావు: బాబూ.. అయితే రాధమ్మగోరు [illegible] వ్యక్తి కాదం [illegible] మీరు పెళ్ళిచేసుకున్న మని కాదంటారా? అందరిలాగా నేనుకూడా రాధమ్మ పిచ్చిదనే అనుకోమంటారా?

రాజశేఖరం: [నవ్వాడు మీ [illegible] టలు వింటుంటే నాకు నవ్వాలో ఏడవాల [illegible] కావడంలేదు. సిల్లీ....... పరాయి భార్యని భర్య అని చెప్పుకో [illegible] కాదు. అలా [illegible] మీకయి బుద్ధుండొద్దూ.......

రాధ: కాదు. నేను పరాయి వాడి భార్యను కాదు. మీ భార్యనే. రాజా...మీరు ఫారిన్‌వెళ్తూ...ఎన్ని బాసల చేశారు.... ఎం [illegible] నమ్మించారు? ఇవన్నీ మీద [illegible] నా జీవితం నాశనమైపోవాలని మీరెందుకు కోరుకుంటున్నారు? నేనేం పాపం చేశాను? మీకోసం...మీ ఆదరణకోసం ఇన్నేళ్ళూ ఎదురు చూశాను. ఇదేనా నేను చేసిన పాపం....? మీరే నా బ్రతుకని ఇన్నాళ్ళూ ప్రాణాలో నిలబడ్డాను. ఇదేనా నేను చేసినపాపం...? ఇప్పుడు చెప్పండి నువు నాభార్యవుకాదు...., నీకూ నాకూ సంబంధం లేదు అని ఒక్కమాటనండి మళ్ళీ నేను మీకంటికి కనిపించను...ఎవరి కంటికీ కనిపించను . వచ్చే జన్మ అంటూ వుంటే...అప్పుడైనా మిమ్మల్ని భర్తగా పొందగల్గుతాను......

రాజశేఖరం: స్టాప్‌దట్ నాన్‌సెన్స్.....!నన్ను బలిపశువుని చేసేస్తున్నారు. నామీద ఏదో మంత్రం వన్నుతున్నారు......!

రాధ: లేదు రాజా....నిజం చెబుతున్నాను..... నన్ను మీరెలా మరచి పోయారు ?

రాజశేఖరం: అయ్‌సీ యూ డోన్నాక్! నువు ఎవరినో పెళ్ళి చేసుకున్నావు. పిల్లా పాపలతో హాయిగా సంసారం చేసుకుంటున్నావు. ఇప్పుడు నాదగ్గరికి వచ్చి,మనం ఎప్పుడో పెళ్ళి చేసుకున్నాం. నేను నీ భార్యని అంటున్నావ్......ఏమిటీ దారుణం... చెప్పండి.... మీరెందుకు వచ్చారు... నన్నెందుకిలా ట్రాప్ చేస్తున్నారు?

రాధ : రాజా..! మిమ్మల్నెలా నమ్మించను? నాకు మీతో అయిందే పెళ్ళి. మరోపెళ్ళి అవలేదు. మీరే నా భర్తగా ఇంత కాలమూ మీకోసం ఎదురు చూస్తున్నాను. అంతకంటే ఏ పాపమూ నేనెరగను.

రాజశేఖరం : డోన్ట్ మేక్ మీ ఫూల్..!అబద్ధం. నువు చెప్పేదంతా శుద్ధ అబద్ధం..! నీకు పెళ్ళయింది. ఒక పాపాయి కూడా వుంది. తాగి వున్నానని నువు ఏం చెప్పినా నమ్ముతానని.. ఇష్టం వచ్చినట్టు మాట్లాడకు..!

రాధ : లేదు రాజా..., లేదు..! ఇంత కాలమూ, కడుపులో పెట్టుకు దాచుకున్నాను. ఇప్పుడు చెప్పక తప్పదనే పరిస్థితి నాకు కల్పించవద్దు. ఆపాపాయి బాపిపే.. నా బిడ్డే [illegible]

రాజశేఖరం : [గట్టిగా నవ్వాడు..]

రాధ : నవ్వకు రాజా.. అలా నవ్వకు. నాకు, భయమేస్తోంది.

రాజశేఖరం: వాటె వండర్ పుల్ స్టోరీ..! చాలిక నీ నాటకం కట్టిపెట్టు. ఎలాగో నా పేరు తెలుసుకుని నన్ను మభ్యపెట్టి వలలో వేసుకోవాలని చూస్తున్నావా? బ్లాక్‌మెయిల్ చెయ్యాలని చూస్తున్నావా..? ఇలా ఎంతమందిని నాశనం చేశావ్?

రాధ : [ఏడుస్తూ] రాజా...!

రాజశేఖరం : అయితే చెప్పు.. ఆ బిడ్డ నాకు పుట్టిందా?

రాధ : నన్ను ఇలా బాధ పెట్టడం మీకు న్యాయం కాదు.

రాజశేఖరం : మాటకి సమాధానం చెప్పు. ఆ బిడ్డ ఎవరికి పుట్టింది? నేను నీ భర్త నంటున్నావే.. అన్నెం పున్నెం ఎరగని మహాపతివ్రత నంటున్నావే..? చెప్పు.. ఆ బిడ్డ నాకు పుట్టిందయితే చెప్పడానికేం..

రాధ: [ఏడుస్తూనే].. ఆ బిడ్డ మీ బిడ్డ కాదు..!

ప్రేమారావు: అరితప్పారవలా..అమ్మా.రాధమ్మా. ఏమిటమ్మా యిది? ఇది నన్ను నమ్మమంటావా?

రాజశేఖరం : గార్డియన్ గోన్ టు హెల్..! అదీ కథ..! నీ నాటకాలు కట్టిపెట్టు. వెళ్ళు వెళ్ళి భర్తతో సుఖంగా కాపురం చేసుకో..!

రాధ: నా భర్త మీరే..! మీ దగ్గర స్థానంలేనివాడు.. నేనెక్కడికీ వెళ్ళ వలసినంలేదు..

రాజశేఖరం : రబ్బిష్..! బిడ్డ నాకు పుట్టలేదు. నేను ఈ మహాపవిత్రత మొగుడ్ని. ఎవరన్నా వింటే.. నవ్విపోతారు.. గెటవుట్..

ప్రేమారావు : రండమ్మా యింటికి వెళ్ళిపోదాం..

రాధ : మాణిక్యం.. నేను నిజంగా పిచ్చిదాన్నని నిర్ణయం చేసుకున్నావు కదూ..? అందరిలా నువ్వూ నమ్ముతున్నావు కదూ..!

ప్రేమారావు : మీరు సెప్పే మాటలు అలాగే వున్నాయమ్మా...!

రాధ : వద్దు మాణిక్యం..వద్దు.. నువ్వలా అను కట్టకు. నేను నిజంగా పిచ్చిదాన్నయిపోతాను. నువ్వు చెప్పు.. ఆ సీతారాం నా భర్త కాదని, అతనికి నాకూ పెళ్ళి కాలేదని.. నువ్వన్నా చెప్పు మాణిక్యం..

ప్రేమారావు : తప్పారవలా ,నేనెలా చెప్పనమ్మా..? అవతల పాప వుంది కదమ్మా మరి?

రాజశేఖరం : నోనో.. పాప మాటెత్తకు. పాప గురించి అడక్కు. శిరోమణి పాతివ్రత్యం బయట పడిపోతుంది..

రాధ : పాప గురించి చెప్పక తప్పదా..?

రాజశేఖరం: నో కంపల్షన్..! నీ యిష్టం. చెబితే చెప్పొచ్చు, లేకపోతే లేదు!

రాధ : అప్పటి వరకూ నా మీద అనుమానం పోదన్నమాట?

ప్రేమారావు : సెప్పండమ్మా..! సెప్పండి..! ఎందుకు దాస్తారు..?

రాధ : అయితే వినండి. ఈ రహస్యాన్ని కడుపులో పెట్టుకు దాస్తానని స్నేహితురాలికి మాటిచ్చాను. చెప్పక తప్పదంటున్నారు కనుక చెబుతున్నాను,

# పద్మవ్యూహం

లేవండి. అసలు నాకూ పుట్టలేదు...!

ప్రేమారావు : అరె తస్సారవలా..!

రాజశేఖరం : రహస్యం చెప్పేశావు. స్నేహితురాలి రహస్యం చెప్పేశావు మరి శాపం మాటేం చేశావు?,, నీ శిరస్సు వెయ్యి వక్కలు కాలేదేమి..?

రాధ : రాజా.. మీరు నమ్మడంలేదా? నా మాటల మీద మీకు పూర్తిగా నమ్మకం పోయిందా? నన్ను నమ్మరా..?

ప్రేమారావు : వివరంగా చెప్పండమ్మా.. నిజమయితే నమ్మకేం చేస్తారు?

రాధ : రాజా.! లలిత అని నాకో స్నేహితురాలుండేది జ్ఞాపకముందా? ప్రాణానికి ప్రాణంగా వుండేవాళ్లం.. ఆమెని ఎవడో మోసం చేశాడు... హాస్పిటల్లో బిడ్డని కని చచ్చిపోయింది చచ్చిపోయేముందు నా దగ్గర నుంచి మాట తీసుకుంది... నా బిడ్డలాగే పెంచుతానని ఆమెకి మాటిచ్చాను. అలాగే పెంచుతున్నాను

రాజశేఖరం : వెరీ యింటరెస్టింగ్.! అయిపోయిందా! కట్టుకథ యింకా వుందా?

రాధ : యింకా వుంది. కాని, యిది కట్టుకథ కాదు. నిజం! నిప్పు వేడిగా వుంటుందన్నది ఎంత నిజమో, ఇదీ అంతే నిజం! ఇంకా వినండి! మీవల్ల నాకు గర్భం కల్గింది. మీరు ఫారిన్ వెళ్ళాక ఆ విషయం రహస్యంగా తెలిసింది కాని, నన్ను దురదృష్టవంతురాల్ని చేస్తూ అబార్షన్ జరిగింది. మనకి గనక బిడ్డ కలిగి వుంటే.. ఇప్పుడున్న పాప వయసుదే అయి వుండేది మన పాప స్థానంలో లలిత పాపని పెంచుతున్నాను. లలిత కిచ్చిన మాట అలా వుంచండి. పాప మన బిడ్డ కాదంటారా? ఆ బిడ్డకి మన పాప స్థానం లేదంటారా?

ప్రేమారావు : తస్సారవలా.., ఇంత కథుందని ఎప్పుడూ మాటవరసకన్నా చెప్పలేదు పాప రహస్యమెప్పుడడిగినా చెప్పకపోడానికి ఇదా అమ్మా కారణం.. గుండెల్లో ఎలాంటి మంటల్ని దాచుకున్నావు తల్లీ..!

రాజశేఖరం : [అస్వస్థతగా ఫీలయ్యాడు]

ప్రేమారావు : బాబూ.. ఇప్పుడు చెప్పండి బాబూ.! రాధమ్మ గారి మీద నమ్మకం కుదిరిందా?

రాజశేఖరం: పిటీ..పిటీ ! గార్డియన్..! మీ రాధమ్మ మీద నాకు అంతులేని సానుభూతి వుంది, చెప్పాగా.? అంతమాత్రంచేత, నేనామె భర్తని కావాలని లేదు. ఇంట్లో ఒక భర్తున్నాడు. ఆ విషయాన్నెలా మరచిపోతాను..

రాధ : కాదు.., అతను నా భర్త కాదు. నా భర్తగా, వచ్చిన వంచకుడు. మోసగాడు. పెద్ద ప్లానుతో వచ్చి యింట్లో అందరికీ మత్తు మందు జల్లాడు. అతను నా భర్త కాదన్నాను. అతనికీ నాకూ సంబంధం లేదన్నాను. ఏడ్చాను. మొత్తుకున్నాను. పోరాడి పోరాడి అలిసిపోయాను. ఆ దుర్మార్గుడు, దొంగ ఫోటో చూపించాడు... పుత్తరాలు చూపించాడు.. అందర్నీ నమ్మించాడు చివరికి అంతా నన్ను పిచ్చిదాన్ని చేసేశారు.. [ఏడ్చేసింది]

[ఆమె అంటున్న ప్రతిమాటా రాజశేఖరాన్ని బాణంలా తాకాయి. కంపరపడి పోయాడు]

రాజశేఖరం: [గొణుక్కున్నాడు] దొంగపుత్తరాలు, దొంగ ఫోటోలు.! వాటె ఫెంటాస్టిక్ ఈవెంట్..! [గట్టిగా] ఏమిటీ ఏడుపు.? గెటవుట్.. ఫొండిక్కడి నుంచి నన్ను వొంటరిగా వుండనివ్వండి.! డర్టీ వరల్డ్.. నాస్టీ పీపుల్..! ఫొండిక్కడి నుంచి, గెటవుట్...!

ప్రేమారావు : బాబూ...!

రాజశేఖరం : యూ ఇడియట్.., గెటవుట్ ఆయ్ సే గెటవుట్..!

రాధ : ఏమండీ.. నామాట వినరూ..? నన్ను నమ్మరూ.? నేను చెప్పింది నమ్మామని ఒక్కమాట నండి చాలు వెళ్లిపోతాను మీరు నన్ను స్వీకరించినా,, స్వీకరించకపోయినా నా మాటలు నమ్మానని ఒక్క మాటనండి కొండంత సంతృప్తితో వెళ్లిపోతాను, ప్లీజ్.. [అతని కాళ్లు పట్టుకుంది

రాజశేఖరం : నాచేత హత్యలు యించవద్దు.. గెటవుట్. [గ్లాసు విసిరి కొట్టాడు అది చిట్లిన పగిలిపోయింది]

ప్రేమారావు : రండమ్మా. ఆయనకిప్పుడు సరిగా లేదు. మీరు ఏం చెప్పినా వినరు. రండి వెళ్ళిపోదాం..!

రాధ : ఆయన్ని విడిచిపెట్టి ఎలా రాను మాణిక్యం.? ఎలా రాను?

ప్రేమారావు : వచ్చేప్పుడు నాకు మాటిచ్చారు.... నేను బయలుదేరానన్నప్పుడు బయల్దేరతానని.... మరిచిపోకండి తస్సారవలా. పరిస్థితి నాకు అర్థమైపోయింది మీరు యింటికి నడండి. మీ మాట నిలబెట్టుకోండి. మీకు అయినవారితో మిమ్మల్ని కలిపి.. నామాటా నిలబెట్టుకుంటాను. ఆ యువ హారం నాకొదిలెయ్యండి. నడండమ్మా...!

రాధ: మాణిక్యం ! [ప్రాధేయపడింది]

ప్రేమారావు : ఇక్కడుండి మీరు చేసేదేమీ లేదమ్మా.. చూడండి, తస్సారవలా ఎలా బాగుతున్నారో.? మీరుమాత్రేరు—నడండి తొందరగా..

[రాధ వెళ్లిపోగానే తల పట్టుకొని కూలబడిపోయాడు రాజశేఖరం..]

[తెర]

## పదకొండు

స్థలం - రెండవ రంగస్థలమే.

[సీతారాం టేబుల్ సొరుగులా అలమార్లో వెతుకుతూ ఉంటాడు

శాంతమ్మ [వచ్చింది] ఏం బాబూ... ఏం చేస్తున్నావు..?

సీతారాం. [కంగారు తిన్నాడు] రండక్కయ్యా రండి. చదువుకోడానికి ఏం లేకపోతేను.

శాంతమ్మ : పైన, రాధ గదిలో ఏవైనా పుస్తకాలుంటాయి, చూడు ఏదో కాస్త కాలక్షేపమవుతుంది. మీ బిజినెస్సంతా ఏమయిపోయిందో ఏమో! పిచ్చి ముండాదాన్ని. మీ బాధ్యత నర్వం చేసుకోకుండా. ఇక్కడే వుంచేసేను... వ్యాపారంలో ఏం నష్టమొస్తుందో, ఏం గొడవలొస్తాయో?

సీతారాం వ్యాపారం చూసుకోడానికి యింకా మనుషులున్నారనుకోండి. అయినా మన వ్యాపారం మనం చూసుకున్నట్టు పరాయి వాళ్లు చూస్తారా? మనం దగ్గరుండి పని చేయించుకున్న దారి వేరు.

శాంతమ్మ అదీ నిజమే నాయనా. పాడుదాన్ని నేనే మిమ్మల్ని యిబ్బందిలో పెట్టేశాను.



స్త్రీ సంక్షేమం, టూరిజం శాఖల మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ, కాకినాడలోని రాజ్యలక్ష్మి టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్‌లోని సంగీత, క్రాఫ్ విభాగానికి కీ. శే. వీరేశలింగం పంతులుగారి 122 వ జన్మదినోత్సవంనాడు ప్రారంభోత్సవం చేశారు.

సీతారాం : మీరూరికే యిదయిపోకండక్కయ్యా! ఇంకెంత? యివ్వాళో రేపో......!

శాంతమ్మ : ఆ ....., శాస్త్రుర్లుగారు వస్తారు. ఆ ముహూర్తమదీ పెట్టించేస్తాను. అందరి సమక్షంలోనూ మళ్లీ నోసారి అవుననిపించుకుని రాధని తీసుకుపోదురుగాని. చిన్నప్పటినుంచి చూస్తున్నాగా, రాధని ఒట్టి మంకుపట్టు. ఆ కాస్తా తీరిపోతే అన్నీ అవే సద్దుమణిగిపోతాయి.

సీతారాం : అవుననుకోండి. రాధని పెళ్లి పీటల మీద కూర్చోపెట్టాలి కదా......!

శాంతమ్మ : ఆ విషయం నాకు విడిచిపెట్టు. నేను చూసుకుంటాను. అయితే అల్లుడుగారూ.... అమ్మాయినీ రాధనీ వెంటనే తీసుకుపోతానంటారా?

సీతారాం : నాకు ఊరంటూ ఎక్కడుందండీ... అస్తమానం దేశంమీద తిరగడమేకదా.....! కూడా రాధని, పసిదాన్ని తీసుకెళ్లడం కష్టంగా వుంటుందేమోనని ఆలోచిస్తున్నా.

శాంతమ్మ : ఆ ....., మరేం ఫరవాలేదు. ఏక్షేపంగా తీసుకెళ్లొచ్చు. పెళ్లయిన తర్వాత కొన్నాళ్ల పెళ్లాన్ని కూడాబెట్టుకొని వూళ్లు తిరగడం ఇప్పుడు ఫేషనంటగా.... అదేదో హనీమూనో ఏదో అంటారుగా......

సీతారాం : అంతదృష్టం నాకెక్కడిదిలెండి.... అలాంటివి ఎంత పుణ్యం చేసుకుంటేను......? డబ్బుంటగానే సరిపోయిందా..... అనుకూలవతయిన భార్య కూడా కలిసిరావాలి..... అయినా అక్కయ్యగారూ ఇంతకాలమూ రాధని మీరు కంటికి రెప్పలా కాపాడారు. రాధ ఇప్పుడు నా కూడా వచ్చేస్తే మీకు బెంగగా కూడా వుంటుంది. ఏమంటారు.....?

శాంతమ్మ : నా గురించి నువ్వేమీ బాధపడకు అల్లుడుగారూ.....! నాకు ఆ పిచ్చాయనా, ఆ పిచ్చాయనకి సాయం నేనూ వుండనే వున్నాం. ఇక, ఆస్తి వ్యవహారాలన్నీ చూసుకోవడమంటావా, అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ నేనే చూసుకుంటున్నాను. నువు పెళ్ళయిపోగానే రాధని తీసుకెళ్ళు. నువ్వెక్కడో వుంటూ రాధని యిక్కడే విడిచిపెట్టేస్తే ఏం బాగుంటుంది చెప్పు......? నువు రావడం ఆలస్యమయిందని నువు నా భర్తవే కాదని కూర్చుంది..... నువు దగ్గర లేకపోతే మళ్లీ ఎంతకయినా తెగిస్తుంది. భార్యా భర్తలిద్దరూ కలిసుంటేనే ఆనందం! ఆ విషయం నేను వేరే చెప్పాలా?

సీతారాం : భార్యా భర్తలిద్దరూ కలిసి వుండడంలో ఆనందం నా కంటే మీకే ఎక్కువగా అనుభవం. ఏమంటారక్కయ్యా.....?

శాంతమ్మ : అయ్యో రాత.....! నా ముఖానికి అంత మాత్రం కూడానా? నన్ను చిన్న పిల్లని చేసి....మోసం చేసి... ఈ పిచ్చోణ్ణి కట్టబెట్టారు. నా బతుకంతా ఆ పిల్ల చాకిరీతోనే తెల్లారిపోయింది. ఇంక నాక ... ందమెక్కడిది నాయనా......! చిన్నతనంలోనే సుఖం నాకు విడాకులిచ్చేసింది. నాకింత అన్యాయం జరిగింది. ఆ వుసురు ఊరికే పోతుందంటావా? అంతకి అంతా అనుభవించి తీర్తారు. వాళ్లు కాకపోతే వాళ్ల పిల్లలు అనుభవించక తప్పదు.

సీతారాం : పోనీలెండి....ఏదో జరిగిపోయింది. ఏ సుఖం లేకపోతే ఏం పోయింది? ఇనప్పెట్టె తాళాలు మీ దగ్గరే ఉంటాయి.....ఆస్తంతా మీది. మీరేం చేసుకున్నా అడిగే వారెవరూ లేరు.

శాంతమ్మ : అవును బాబూ.....! ఆ మాత్రం ముందు జాగ్రత్త వున్నదాన్ని కాబట్టే ఆస్తంతా నా పేర పెట్టించుకున్నా. ఇదిగో, మీకూ పెళ్ళవుతుందా? రాధని మీ రేలాగూ తీసుకుపోతున్నారు. నేను మరీ అంత స్వార్థపరురాల్ని కాదులెండి. అంతో యింతో ముట్టజెప్పకపోను.

సీతారాం : అయితే, ఆస్తంతా మీ పేరనే ఉందంటారా! రాధకి ఏం రాదూ?

శాంతమ్మ : ఎందుకు రాదూ......? సవతి తల్లినే అయినా ఏమీ యివ్వకపోడానికి దుర్మార్గురాలిని కాదు.

సీతారాం : అంతేగాని......రాధ పేరన ఏమీ లేదంటారు......?

శాంతమ్మ : ఎందుకుంటుంది నాయనా. ఆ జాగ్రత్త ముందే పడ్డానని చెప్పాగా.

సీతారాం : మీరు చాలా మంచి పని చేశారు అక్కయ్యగారూ....! ప్రపంచంలో ఏ కొద్దిమంది ఆడాళ్లకో మీలాంటి తెలివితేటలుంటాయి. మీలాంటి అక్కయ్యని సంపాదించుకున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది.

శాంతమ్మ : నీలాంటి తమ్ముడే నాకూ వుండేవాడు నాయనా......! పురిటిలోనే సంధి కొట్టి పోయాడు. నిన్ను చూస్తూ వుంటే ఆ తమ్ముడే మనసులో మెదుల్తూ వుంటాడు. పెళ్లయింది కదాని, ఈ అక్కయ్యని మరచి పోకు. అప్పుడప్పుడు చూడ్డానికయినా వస్తూండు. [ముక్కు చీదింది.]

సీతారాం : అయ్యయ్యో......ఎంత మాట..., ఎంత మాట......?

శాంతమ్మ : ఉండు నాయనా, శాస్త్రులుగారింటికి మళ్లీ నోసారి కబురంపి వస్తా.... [వెళ్లింది.]

సీతారాం : మంచి దక్కయ్యగారూ.....!

[సీతారాం మళ్లీ బీరువా వెతకడం ఆరంభించాడు. అతనికో డైరీ దొరికింది. చూడబోతుండగా శాంతమ్మ తిరిగొచ్చింది. డైరీ అక్కడే వుంచేశాడు.]

శాంతమ్మ: రాధ ఎక్కడా కనిపించడంలేదే.....?

సీతారాం: ఎక్కడో వుండి వుంటుంది. సరిగ్గా చూశారా?

శాంతమ్మ: అంతా వెదికాను. ఎక్కడా లేదు. వాడు....ఆ మాణిక్యంగాడు కూడా కనిపించడంలేదు.

సీతారాం: మీరెక్కడి కయినా పంపించేరేమో..?

శాంతమ్మ: అబ్బే....శాస్త్రులుగారింటికి పంపుదామనేగా లోపలికి వెళ్తా?

సీతారాం: సరిగ్గా జ్ఞాపకం తెచ్చుకోండి.

శాంతమ్మ: నేనెక్కడికీ పంపించందే.....?

సీతారాం: అయితే యిద్దరూ కలిసి ఎక్కడి కయినా వెళ్లేరంటారా?

శాంతమ్మ: అలాగే అనిపిస్తోంది. పొద్దున్నే యిద్దరూ ఏవేవో గుసగుసలాడుకుంటున్నారు. బహుశా ఎక్కడికో వెళ్లేవుంటారు.

సీతారాం: [అరచేతిలో గుద్దుకున్నాడు] అయ్యో... కంగారు పడకండి. వాళ్లే వస్తారు. ఈ ప్రేమా రావుగాడు చాలా డేంజరస్ మనిషిలా కనిపిస్తున్నాడే?

శాంతమ్మ: కాకపోతే? యింట్లో యింతమందిమి వున్నాం? మన కళ్లు కప్పి దాన్ని ఎక్కడికో తీసుకెళ్తాడా ? వీడి కన్ని గుండెలున్నాయి ? అమ్మా........ అమ్మా.......?

సీతారాం: రానివ్వండి చెప్తాను.....

ఈ బొమ్మలో తప్పేమిటి ?



[illegible] తెచ్చిన [illegible] సిగరెట్లు తెస్తానా? వెధవ! అలుసిస్తున్నాం కదా, అది నెత్తెక్కి నాట్యం చేస్తున్నాడు, పోకిరీ వెధవ! ఆ వంటిది ఎవరికే గోల చేసేస్తోందిగాని.... నువ్వు వాడు రాగానే గట్టిగా చివాట్లు పెట్టు నాయనా.. [లోపలికి వెళ్ళిపోయింది.]

సీతారాం: చెప్తా.....చెప్తా....! వీడినేం చెయ్యాలో నాకు తెలుసు. మరీ బరితెగించి పోతున్నాడు రాస్కెల్.

[సిగరెట్టు కాలుస్తూ అస్వస్థతగా పచార్లు చెయ్యడం ఆరంభించాడు అతని దృష్టి మళ్ళీ బీరువాలో డైరీ మీద పడింది. డైరీ తీశాడు. పేజీలు తిరగేశాడు. అందులో ఒక ఫొటో దొరికింది. చూశాడు. వులిక్కి పడ్డాడు.]

ఇది, ఈ ఫోటో.....?! రాధ [illegible] తప్పింది?

[ప్రేమారావు [illegible]. సీతారాం [illegible] న్నాడు.

సీతారాం ప్రేమారావుని [illegible]. కంగారు పడ్డాడు. మళ్ళీ డైరీ మామూలుగా పెట్టేశాడు. ఆ కంగారులో ఫొటో కింద పడిపోయింది. మళ్ళీ [illegible] [illegible]]

ప్రేమారావు: [వచ్చాడు. సీతారాంకి తెలియకుండా, కింద పడిన ఫొటో తీసుకుని జేబులోకి తోసేశాడు.] తప్పే రవలా, ఈ సినిమాపిల్ల సాలా అన్యాయంగా వుంది బాబూ.... మీకెవరన్నా తెలిసినోళ్ళుంటే సినిమాలో ఒక యీనం ఇప్పించండి బాబూ......!

సీతారాం: [ఉద్రేకంగా] రాస్కెల్...! తప్పా ఒప్పా....? నువ్వున్న వేషం చాలక యింకా వేషాలు కావాలా? వేషాలు? స్కౌండ్రల్.....! [కొట్టాడు] చెప్పు...! ఇప్పటివరకు నువ్వెక్కడున్నావ్....? రాధని ఎక్కడికి తీసుకెళ్ళావ్.....?

ప్రేమారావు: తప్పే రవలా...మీరు కొట్టాలనుకుంటే కొట్టండి బాబూ...? ఏమన్నా చెయ్యండి నేను మాత్రం చెప్పను.

సీతారాం: చెప్పవురా దొంగ రాస్కెల్..!నువ్వు ఇలా చెప్పవు.. ఎందుకు చెబుతావ్.. చెప్పు....! చెప్పు [చెంపలు వాయిం, గొట్టాడు]

ప్రేమారావు: సెప్పను బాబూ... సెప్పను..? తప్పేరవలా..., నన్ను సంపేసినా సరే...సెప్పను...

సీతారాం: గెటవుట్.. ఇడియట్.. ..! మళ్ళీ ఈ గుమ్మం ఎక్కావంటే మక్కెలిరగ తంతాను.

ప్రేమారావు: బాబూ.... రాధమ్మగోరి బర్తగా నన్ను కొట్టడానికి తిట్టడానికీ మీకు అధికారం వుంటాది తప్పేరవలా. ఈ యింట్లోంచి గెంటెయ్యడానికి మీకు అధికారం లేదు బాబూ.... ఈ యింటికీ నాకూ సాలా రుణముండాది.

శాంతమ్మ: [వచ్చింది.] అల్లుడిగారినే ఎదిరించి మాట్లాడుతున్నావురా.....?

ప్రేమారావు: అవునమ్మా ..తప్పేరవలా యింత కాలమూ మీ వుప్పు తిని...మిమ్మల్నింటిపెట్టుకు వున్నాను. మీరు యెళ్ళిపోమంటే యెళ్ళిపోతాను, [illegible]....

# పద్మవ్యూహం

శాంతమ్మ: పో యిక్కడ్నుంచి..... ఒక్కక్షణం కూడా వుండడానికి వీల్లేదు.

ప్రేమారావు: అమ్మా...! [ఏడుపుకి సిద్ధపడి] తప్పేరవలా...! మీరూ నన్ను యెళ్ళిపొమ్మనే అంటున్నారా అమ్మా....? ఈనాటితో నాకూ యీ యింటికీ రుణం తీరిపోయిందంటున్నరా అమ్మా.... పోనీలేండమ్మా... పోనీలేండి....!మీ మాటకి ఎప్పుడూ ఎదురు చెప్పలేదు. ఇప్పుడూ సెప్పను. యెళ్ళిపోతాను. అమ్మా....! వొక్కసారి రాధమ్మగోరి నోటి కూడా ఆ మాట అనిపించుకుని వెళ్ళిపోతానమ్మా ఒక్క క్షణం కూడా ఉండను. [లోపలికి వెళ్ళబోయాడు.]

సీతారాం: నువ్వు లోపలికి వెళ్ళడానికి వీల్లేదు. రాధతో మాట్లాడ్డానికి వీల్లేదు. పో ఇక్కడ్నుంచి. [గెంటేశాడు.]

ప్రేమారావు: [కిందపడ్డవాడు లేస్తూ] పోతండి బాబూ..మీకు దణ్ణం పెడతాను. ఒకసారి రాధమ్మగారిని సూడనివ్వండి. అలాగే యెళ్ళిపోతాను బాబూ.....!

సీతారాం: గెటవుట్..! ముందు, పో ఇక్కడ్నుంచి. ఆలస్యం చేశావంటే నీ రక్తం కళ్ళ చూస్తాను.....

ప్రేమారావు: తప్పే రవలా...! అంత పనెందుకు లెండయ్యా.....! యెళ్ళిపోతాను. అమ్మా యెళ్ళిపోతున్నానమ్మా.....రాధమ్మా ...యెళ్ళిపోతున్నానమ్మా పాపా..మాణిక్యం...యెళ్ళి పోతున్నాడమ్మా...? అమ్మా రాధమ్మగారితో సెప్పండి, నేనెక్కడున్నా అరిసేమమే కోరుకుంటానని సెప్పండి.

సీతారాం: ఇంట్లో గుట్టు రచ్చకెక్కించే దొంగ రాస్కెల్వి? నీకూ యింటిక్షేమం తెలుసురా? పో ముందు.

[గెంటేశాడు. ప్రేమారావు వెళ్ళిపోయాడు]

దొంగ రాస్కెల్... వూరికే కూర్చుని తిన్నది వంటబట్టక పొగరెక్కువైంది.

శాంతమ్మ: పోనీలే బాబూ...ఆవేశపడకు...పీడా పోయింది.

సీతారాం: [కూర్చున్నాడు సిగరెట్ ముట్టించాడు] రాధ నడిగారా.....? ఎక్కడికెళ్ళారో ఇద్దరూ కలిసి ? చెప్పిందా?

శాంతమ్మ : ఎందుకు చెబుతుంది నాయనా..? ఎందుకు చెబుతుంది? ఇద్దరికిద్దరే..తోడుదొంగలు.. ఇంకా నయం, వాణ్ణి వెళ్ళగొట్టేప్పటికి అదిక్కడ లేదు—వుంటే నానా రభసా అయి వుండేది.

సీతారాం : ఎక్కడుందిప్పుడు?

శాంతమ్మ : వాళ్ళ పిచ్చినాన్న దగ్గరుంది.ఆయన ఆకాశం మీద యుద్ధవిమానాల్ని లెక్కిస్తున్నారు. ఇది లెక్కరాస్తూ కూర్చుంది.

[బయట పిలుపు వినిపించింది]

పేరయ్యశాస్త్రి : శాంతమ్మగారూ..శాంతమ్మగారూ...!

శాంతమ్మ : రండి రండి.. తలుపు తీసే వుంది.

పే.శాస్త్రి : [వచ్చాడు] అన్నమాటా వున్నమాటే. శివుకారు గారింట్లో పెళ్ళి కెళ్ళాను..ఆ భోజనం భోజనం.. ఇప్పటి కింకా నన్ను తేరుకోనివ్వలేదు. ఒకటే పడక.. ఒకటే పడక.. లేచి, కాస్త అటూ యిటూ తిరగడానికి ఇప్పటికి వీలయింది.

శాంతమ్మ : బాగానే వుంది. మీ తిండి గోడకే గాని.. ముహూర్తం సంగతి ఏం చేశారు?

పేరయ్యశాస్త్రి : అన్నమాటా వున్నమాటే..! ముహూర్తాని కేముందమ్మా..! మీకెప్పుడు కావాలంటే అప్పుడే వుంటుంది. ఏదీ, ఇవ్వాళ పెళ్ళనండి. ముహూర్తం పెట్టేచ్చేస్తాను.

సీతారాం : శాస్త్రిగారు చాలా ఘటికుల్లా వున్నారే..?

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే... ఇప్పుడేముంది బాబూ..! శాస్త్రమంతా నా అరచేతుల్లో వుండేది. ఆరోజులు పోయాయి.

శాంతమ్మ : పన్లేండి. రేపో ఎల్లుండో ఒక మంచి ముహూర్తం చూడండి. పెళ్ళి ఏర్పాట్లు తెలుంచేస్తా.

పే.శాస్త్రి : మీరు ఏర్పాట్లు చేయించుకోండి. ముహూర్తం సంగతి నేను చూసుకుంటా. ఆర్భాటం వుండదంటున్నారు గనక.. ఉదయంగానే కానిచ్చేద్దాం...ఏమంటారు బాబుగారూ... ?

సీతారాం : [జేబులోంచి పది నోటు తీసిచ్చాడు] అంతవరకు ఇది వుంచుకోండి..!

పే.శాస్త్రి : బాబుగారు ధర్మప్రభువులు..!

శాంతమ్మ : మరి, శాంతమ్మగారి అల్లుడంటే ఏమిటనుకుంటున్నారు?

పే.శాస్త్రి: అన్నమాటా వున్నమాటే..!శాంతమ్మగారంటే సంగతెరియని వాళ్ళు ఈ భూప్రపంచకంలో వున్నారాని అసలు..!

శాంతమ్మ : ముందు పని చూడండి...

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే..! వెళ్తొస్తాను బాబుగారూ.. వెళ్ళొస్తానండమ్మా..![వెళ్ళిపోయాడు]

శాంతమ్మ : ఇప్పుడు బండంత చాకిరీ నా నెత్తిమీదుంది. సమయానికి ఈ మాణిక్యంగాడికి కూడా పోయేకాలం మొచ్చేసింది.

సీతారాం : వాడెందుకులెండి, దొంగ వెధవ. నేనున్నానుగా. అంతా నే చూస్తానులెండి.

రాధ :[గాభరాగా వచ్చింది] అమ్మా.. పాపకి ఒంట్లో బాగాలేదు, స్పృహ తప్పిపోయింది.

సీతారాం: ఆ.. ఏమయింది!

శాంతమ్మ : ఏమవుతుందిలే.. నిద్రపోయుంటుంది. దానికింత హడావిడెందుకు?

రాధ : లేదమ్మా..! నాకేదో భయంగా వుంది. పాప స్పృహ తప్పిపోయింది. కాళ్ళూ చేతులూ ఆడడం లేదు.

సీతారాం : ఏమయిందో ఏమిటో? డాక్టరుగార్కి ఫోన్ చేస్తాను. [ఫోన్ ఎత్తుకున్నాడు. డయల్ చేశాడు] డాక్టరుగారూ..! నేను సీతారాంని మాట్లాడుతున్నాను. మా పాపకి చాలా సీరియస్‌గా వుంది. మీరు తొందరగా రావాలి. ఓకే.. థాంక్యూ

[వెళ్ళిపోయాడు]

[రాధా, శాంతమ్మా లోపలికి వెళ్లారు. సీతారాం మళ్లీ డైరీ తీశాడు. ఫోటో కోసం వెదికాడు. ఎక్కడా కనిపించలేదు. డాక్టరు వచ్చాడు.]

డాక్టరు : గుడ్‌మార్నింగ్ సీతారాంగారూ..? ఏమయింది? పాపెక్కడ?

సీతారాం : రండి డాక్టరుగారూ.. చూద్దురుగాని రండి...

[లోపలికి వెళ్లారు]

కె.నానారావు: [వచ్చాడు. లెఫ్ట్‌రైట్ కొట్టుకుంటూ వచ్చాడు] కమాండర్.. కమాండర్..! ఎక్కడీ కమాండర్..? శత్రువులు కోటలో పాగా వేశారు. మిత్రులుగా ప్రవేశించారు. కోటని కొల్లగొట్టేశారు. కమాండర్.. కమాండర్..! ఇంకెక్కడి కమాండర్..! అతనూ పోయాడు. శత్రువులు వేసిన బోనులో అతనూ చిక్కుకు పోయాడు. మిజరబుల్...! మిజరబుల్...! అయినా పోరాడతాను. ఒంటరిగానే పోరాడతాను. అంతిమ విజయం సాధించేవరకూ పోరాడతాను. హోయ్ శత్రువులా! కాసుకోండి! ఇదిగో ప్రళయకాళ రుద్రుడు వస్తున్నాడు! ప్రచండవీరుడు వస్తున్నాడు! ఫయిర్.. ఫయిర్.. టప టపా.. టప టపా.. డుష్యూం... డుష్యూం.. [దూసుకుపోయాడు.]

[డాక్టరూ, సీతారాం, శాంతమ్మా వచ్చారు.]

సీతారాం : ఏమిటి డాక్టర్..? పాప ఎందుకిలా అయిపోయింది?

డాక్టర్ : పాపకి విషప్రయోగం జరిగింది మిస్టర్ సీతారాం..!

సీతారాం : విషప్రయోగమా..? యూ మీన్... పాయిజన్..? మై గాడ్..!

శాంతమ్మ : ఇంత దుర్మార్గమా..?

డాక్టర్ : అవును. పాపకి విషప్రయోగమే జరిగింది.

సీతారాం అయితే మాపాప యిక బ్రతకదంటారా?

డాక్టర్ : ధైర్యంగా వుండండి. ఇంజెక్షన్ ఇచ్చాను. జరుపవలసిందంతా జరిపాను. తర్వాత దేవుడే వున్నాడు.

శాంతమ్మ : ఎంత ఘోరం జరిగింది! ఇదెలా జరిగి వుంటుందంటారు?

డాక్టరు : అది నేనెలా చెప్పగలను? మీయింట్లో, వాళ్లకే తెలియాలి.

శాంతమ్మ : పసిదానికి విషం పెట్టే దురంతకం ఎవరి కొచ్చిందబ్బా..?

సీతారాం : ఇంకెవరి కొస్తుంది? వాడే..ఆ వెధవ నానారావుగాడే చేసి వుండాలి.

శాంతమ్మ : అవునవును. యింట్లోంచి వెళ్లగొట్టామని—ఆ కసి యిలా తీర్చుకుని వుంటాడు. కసాయి వెధవ..!

సీతారాం : వాడిని అలా విడిచి పెడతావా? పోలీసులకి ఫోన్ చేసి వాడెక్కడున్నా వెదికి పట్టిస్తా.. రాస్కెల్.. ఎంత పని చేశాడు?

శాంతమ్మ : అమ్మా.. అమ్మా.. నమ్మించి ఇంత ద్రోహం చేశాడు?

సీతారాం : ఇంకా వుంటే వాడి ప్రాణాల మీదికి తెచ్చి వుండేవాడు రోగ్..!

[టెలిఫోన్ ఎత్తుకున్నాడు. డయల్ చేశాడు] హలో.. పోలీస్ స్టేషన్.. నేను, కెప్టెన్ నానారావు గారి అల్లుడ్ని మాట్లాడుతున్నాను. ఇన్‌స్పెక్టర్ గారున్నారా..? ఆ.. నమస్కారం సార్..! మా బేబీకి విషప్రయోగం జరిగింది. యస్.. యస్..! మా యింట్లో పనిచేసే వాడే ఈ పని చేశాడు. వాడిప్పుడిక్కడ లేడు. పారిపోయాడు వెధవ. ఓకే సార్. ఓకే! థాంక్యూ..! [ఫోన్ పెట్టేశాడు] ఇకవాళ్లు చూసుకుంటారు. దొంగ రాస్కెల్..! ఎక్కడికి పోతాడు? ఇంట్లోంచి గెంటేసినందుకు ఎంత ఘోరం తలపెట్టాడు?

డాక్టరు : ఎవరూ..ప్రేమారావనే కుర్రాడేనా..?

శాంతమ్మ : అవును బాబూ..! వాడే..! తడిగుడ్డతో గొంతులు కోసే రకం! తిన్నింటి వాసాలు లెక్కపెడతాడనుకో లేదు. ముందే తెలిస్తే అసలు యింట్లో చేరనిచ్చేదాన్నా..! అంతా ఖర్మ..!

సీతారాం : అయిపోయిందాని కెందుకు లెండి. ఇకముందు జాగ్రత్తగా వుంటే సరి. డాక్టరుగారూ.. నా ప్రాణాలన్నీ పాప మీదే పెట్టుకు బ్రతుకుతున్నాను. మా పాప నెలాగైనా సరే రక్షించండి. మీరు కోరిన ఫీజు యిచ్చుకుంటాను.

డాక్టరు : ఫీజుకు ప్రాణాలు రావు సీతారాంగారూ. చెప్పాగా, నేను చెయ్యగల్గింది చేశాను. ఈమందులు తెప్పించి వుంచండి [చీటీ ఇచ్చాడు] అవతల వాళ్ళ అర్జంటు కేసుంది. అది చూసుకుని మళ్లీ వస్తాను. ధయిర్యంగా వుండండి. వస్తానండమ్మా..సెలవు.. [వెళ్లిపోయాడు.]

[సీతారాం, శాంతమ్మా లోపలికి వెళ్లారు.]

—తెర—

(ఇంకా ఉంది)




స్వీడన్‌వనిత మెజర్ బ్రిట్‌పెటర్ అనే ఆమె 1962వ సంవత్సరం నవంబరొకటో తేదీన ఒక శిశువును కని, మరో ఏడువారాలలో ఇంకో శిశువును కన్నదట.

*　　*　　*

నిముషానికి మూటముప్పయ్యొనిమిది మంది పుట్టు తున్నట్టు లెక్కలు తేల్చాయి.

*　　*　　*

భోపాల్లో వో గర్భిణి స్త్రీ కుటుంబ నియంత్రణాలయంలో లూప్ వేయించుకున్న కారణంగా చచ్చి పోయిందట.

*　　*　　*

లారెన్కోమార్కిస్‌లో ఒక ఆఫ్రికన్ యువతి మొదటి కాన్పులో అయిదుగుర్ని, రెండో కాన్పులో నలుగుర్నీ కన్నదట. ఇంగ్లండ్‌లోని బర్మింగ్‌హామ్ నగరంలో ఒకామె ఒకే కాన్పులో అమాంతం ఆరుగుర్ని కన్నదట. తల్లీపిల్లలూ ఖులాసాగా వున్నారట.

*　　*　　*

గంటకు 8230 మంది శిశువులు జన్మిస్తున్నట్టు పేపర్లు ప్రకటిస్తున్నాయి.

*　　*　　*

మధురలో [ఇండియా] సుత్‌గాబీబీ అనే పేద రాలుకు ఒకే కాన్పులో నలుగురు పిల్లలు కలిగారట. లండన్‌లో ఒకామెను పరీక్ష చేసిన డాక్టర్లు ఆమెకు సంతానయోగం లేనేలేదని పెదిమవిరిచి 'సారీ'అంటే ఆ విషయాన్ని, వారి సారీలను వంటపట్టించుకునే లోగా ఆమె గర్భవతియై, ఆ కాన్పులో ఆరుగురు పండంటి పిల్లల్నుకని, విజ్ఞానశాస్త్రాన్ని పుటుక్కున వెక్కిరించిందట. ప్రెసిడిషేరియన్‌పెంటలకు చెందిన మార్గరేట్ అనేఆమె ఒకే కాన్పులో అయిదుగురు పిల్లల్ను కన్నదట.

*　　*　　*

అనగా వారానికి పద్దాసుగు లక్షలమంది పుట్టుతున్నారట, ఈ రకంగా పుట్టుకుంటూ పోతే వున్న ట్టుండి వున్న జనాభా రెట్టింపయి 130 ఏళ్ళకు జనం భూగోళం మీద కాసేపురికామీగా నుంచో



డానికక్కాడా జాగా వుండదని 'ఆ శాఖ'వారు గోల పెట్టేస్తున్నారు.

*　　*　　*

పదిగానీ, అంతకన్నా ఎక్కువమందిగానీ, పిల్లలను కన్న మాతృమూర్తికి రష్యా ప్రభుత్వం బిరుదుసత్కారాలతోపాటు ఘన సన్మానం చేస్తోందట. ఆస్ట్రేలియాలో పెళ్ళికావలసిన మగవారు ఆ జాతి ఆడనారి సంఖ్యను మించి వుండడం వల్ల ఆ మిగిలిన మగవారికి పెళ్ళిళ్ళెలా అవుతాయిరా దేవుడా అని అక్కడ ప్రభుత్వం ఆలోచిస్తోందట. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న తమ దేశంలో జనాభా కనీసం రెట్టింపయితే తప్ప నిలదొక్కుకోడం కష్టమని ఆ ప్రభుత్వం విలవిల్లాడిపోతోందట.

ఇదిలా వుండగా—

ఆకలి బాధకు తాళలేని వో యువకుడు మిద్నపూరు కుటుంబ నియంత్రణాలయంలో వేసెక్టమీ [కుటుంబనియంత్రణ జాతి] ఆపరేషను చేయించుకుని, ప్రభుత్వం అందుగ్గానిచ్చిన 18 రూపాయల పారితోషికాన్ని తీసుకు చక్కాపోయాడట. వెస్ట్ జర్మనీకి చెందిన ష్లెష్‌విగ్‌లో ఆర్థిక యిబ్బందులకు తట్టుకోలేని ఒకాయన తన ఎనమండుగురు పిల్లలమూ విషం పెట్టి చంపేసి, ఆ విషమే కాస్త తనూతిని ఆత్మహత్య చేసుకుంటూ యీ విషయం పొరుగూర్లో చదువుకుంటున్న తన కొడుక్కి వుత్తరం రాశాడట. సేలంలో ఒకామె దారిద్ర్యాన్ని తట్టుకోలేక, వేరే గత్యంతరం లేక, తన యిద్దరి పిల్లలకూ చెరికాస్త విషమూ పెట్టి తనూ కాస్త తిన్నదట. అలహాబాదులో వో మాతృమూర్తి తన పిల్లల ఆకలి బాధలు చూడలేక, వారిద్దర్నీ చివాల్న నూతిలో గెంటేసి, తనూ దూకేసిందట.

*　　*　　*

ఈనాటి జనాభా సమస్యే కుటుంబ సమస్య. తక్కువ సామానుతో ప్రయాణం ఎక్కువ సౌకర్యం అన్నట్లుగానే [[illegible]]లాగే, [illegible] కుటుంబమే చింతల్లేని కుటుంబం అనటానికి ప్రభుత్వం తీవ్రంగా ప్రచారం చేస్తూనే వుంది. కుటుంబం పెరక్కుండా వుండడానికి అనేక మార్గాలు చూపిస్తూనే వున్నది.

*　　*　　*

ఫ్రాన్సులో వో దంపతులు తమ కుటుంబం పెరక్కుండా వుండడానికో చిట్కా కనిపెట్టారట. 1951వ సంవత్సరం నుంచి, 1964 వరకూ తమకు పుట్టిన మొత్తం నలుగురు పిల్లలనూ యీ చిట్కా ప్రకారం నిర్దాక్షిణ్యంగా చంపి, పెరట్లో హాయిగా పాతిపెట్టారట. ఆ మాతృదేవత తిరిగి మరోసారి గర్భవతయ్యేసరికి ఇంటాయన పెరట్లో అందుకు తగిన సన్నాహాలు చేస్తూ చట్టానికి పట్టుబడ్డాడట— ఇది చెడ్డ పద్ధతి!

*　　*　　*

ఈనాడు నాలుగోసారి కడుపుతో వున్న స్త్రీ ఆ విషయం గ్రహించిన క్షణం నుంచీ మానసికంగా చనిపోతూనే వుంటుంది. మహాపరాధం చేసినదానిలా ఇరుగుపొరుగుల ముఖాలలోనికి చూడ్డానికి భయ [బిడియం!] పడుతూనే వుంటుంది. కానీ ఆమెకు తన ఆ స్థితిని ఆపుకునే శక్తి ఎక్కడిది!

*　　*　　*

గర్భస్రావాన్ని చట్టబద్ధం చేస్తేగాని పెరుగుతున్న యీ జనాభాను అరికట్టడం సాధ్యంకాదని అనేక దేశాలు తీర్మానించాయి. కొన్ని దేశాలు ఆచరణలో పెట్టాయి. గర్భస్రావానికి కనిపెట్టబడిన మందులు, మార్గాలు మంచికిగాక, చెడుకే ఎక్కువగా వుపయోగపడుతున్నట్టు తేలింది. పెళ్ళి కావలసిన యువతీ యువకులు తమ ప్రేమలు పండే సమయానికి వీటిని ఉపయోగించుకుంటున్నారట. వైద్య సలహా, సహకారంలేక ఆ మందులు, మాత్రలు, మార్గాలు తమంతట తామే వుపయోగించుకోడం వల్ల ఎంతో మంది స్త్రీలు ప్రాణాలనే కోల్పోతున్నారట. ఆ రకంగా ఆసుపత్రులలోకి వచ్చిన ప్రమాదకరమైన కేసులు 350 వేలల్లోనూ ఎనిమిదివేలమంది చనిపోయినట్టు అమెరికా గత సంవత్సరం లెక్కలు వేసింది.



వినోదాల ద్వారా మనిషికి ఆనందం కలుగజేయ టం కూడా వో మార్గమేనన్నారు. ఇది మన దేశంలో చాలా తక్కువ అనడం కన్నా అస్సలే్లదనడమే న్యాయం. సామాన్య మానవుడికి సూర్యాస్తమయం మొదలు సూర్యోదయం వరకూ ఇంటి నాలుగ్గోడలే నిలయం —ఆ మధ్య ప్రపంచం. ఆ గోడలు వదిలి రాలేడు—కాడు. తత్ఫలితమే. . . . యీ. . . . .

* * *

అసలు దేశంలో జనాభా యింతగా పెరిగినట్టు కనబడ్డానికి మరణశాతం తగ్గడం కూడా ఒక కారణ మట. 1910—1911 లలో 4.3 శాతమున్న యీ సంఖ్య యీ నాడు 1.7 మాత్రమే వుందని ఆనాడు 4.2 శాతమున్న జనాభా పుట్టుక యీనాడు 4.2 మాత్రమేననీ లెక్కలు చెప్తున్నాయట. దీనికి అభివృద్ధి చెందుతున్న వైద్యశాస్త్రము, తదితర నగరపారిశుధ్యాలు కారణాలనుకోవచ్చు.

* * *

అసలు స్త్రీ 15 ఏళ్ళనుంచి 55 ఏళ్ళవరకూ [ఆ మధ్యనే] సంతానం కంటుందని, 15 ఏళ్ళకు వివాహమయిన స్త్రీ తన 30 ఏళ్ళకాపురంలో వీలై నంతమందిని [22 నుంచీ 27 వరకూ కన్న తల్లు లున్నారు] కంటుందని, కనుక స్త్రీ వివాహవయో పరిమితిని పెంచాలని అన్నారు.

* * *

మన సాంప్రదాయ ప్రకారం పమిట చెంగు భుజం మీదికి వచ్చిన కూతుర్ని చూసిన తలిదండ్రులు వీలై నంత పొడుగ్గా, బరువుగా నిట్టూర్చి ప్రత్యక్షంలో, పరోక్షంలో కూడా 'ఈ గుండెమీది కుంపటి నెన్నడు దింపుకోగలంరా దేవుడా' అని బాధపడడం ఆచారంగా వస్తోంది. దాంతో తనకిక పుట్టినిల్లు దాటి మరో యింటికి వెళ్లే సమయం ఆసన్నమయిం దని, ఆ యింటికి వెళ్ళి ఇక పిల్లల్ని కనడమే స్త్రీగా తన విధి, కర్తవ్యమనీ ఆడపిల్లలనుకోడం పరిపాట య్యింది. ఈ నాటికీ ఉత్తరప్రదేశ్‌లో 13 ఏళ్ళు నిండిన [నిండనికూడ] ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తూనే వున్నారట. [ఉత్తరప్రదేశ్ వరకూ ఎందుకు? దేశం మధ్యన మాత్రం చైటంలా]

* * *

ఎంచక్కా చిన్న వయస్సులో పెళ్ళిచేసుకుని, వెనువెంట పిల్లల్ని కంటే తమకు వృద్ధాప్యం వచ్చే సరికి తమ పిల్లలు చేతికెదిగి వచ్చేస్తారని, చక్కగా తమను ఆదుకుంటారని తలిదండ్రులకు తమ పెళ్లి నాడే వో అభిప్రాయం వుంటోంది.

పాశ్చాత్యదేశాల్లో [కనీసం కొన్ని దేశాలనండి] తలి దండ్రులు తమ పిల్లల మీద ఆధారపడడం అనేది వో అవమానంగా తీసుకుంటారట. ఎంత వృద్ధు లైనాసరే! వాళ్ళ బ్రతుకులు వాళ్ళవేనట— ఎవరి బ్రతుకులు వారివేనట!

వివాహ పరిమితిని పెంచితే. . . . .

వయస్సొచ్చిన ఆడపిల్లల్ని యింట్లో పెట్టు క్కూర్చునేదెలా! స్కూళ్ళలో, కాలేజీలో జేరుద్దా మంటే [స్తోమతుంటే సంగతి] సీట్లు దొరుకు తున్నాయా. . . . . అదో రణరంగంకాదూ!

బెంగుళూరులో 22 ఏళ్ళ దయాళ్‌కుమార్ ప్రకాస్ అనే అతను తనకు కాలేజీలలో సీటివ్వలేదన్న కోపంతో ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు మునిగవి ప్పను జూలై 15 తేదీన ఘుమకమ్మితో కాలేజీ




ఆవరణలోనే కొట్టి చంపేశాడట. [ఇది విద్యాకాంక్ష!]

చదువులైతే మాత్రం! ఇల్లల్గానే పండగా! వుద్యోగాలెక్కడ దొరుకుతున్నాయి! దొరికెనుబో వచ్చే రాళ్లెన్ని. . . . . .

ఉన్నయితా వురదగా. . .

ఒక్కొక్కపూరి పెద్ద బజార్లలోనూ, స్కూళ్ళ కాలేజిల ముందు ఒకే పనితో ఒకర్నొకరు రాసు కుంటూ వో ఫర్లాంగు దూరంలోనే వుయ్యాలలూగే యువకులు [యువతులుకూడా] ఎంతమంది! యువ తులకు ఎంతమంది యువకులు—బోడిగార్డులా పని చైటం లేదు—శ్రమదానం!

వో మూల నిలబడి ఆటూ యిటూ చకచక చూస్తున్నవారిని అనేక కోణాల్లోంచి చూసి, "సార్ రూము కావాలా. . . . స్సార్. . . . మాంచికాలేజీ పిల్ల. . . . ." అనేంతమంది బ్రతికి పోటంలేదు!

ఢిల్లీలో జి. బి. రోడ్డులో పబ్లికున వేశ్యాగృహం నడుపుతున్నందుకు వో వ్యక్తినీ, వ్యభిచారం చేస్తున్న నేరానికి పదకొండుమంది స్త్రీలను జూలై 27వ తేదీన చట్టం పట్టుకుందట.

ఏ సమస్యకయినా కష్టసుఖాలు, ఏ పరిష్కారాని కయినా లాభనష్టాలూ వుండే తీర్తాయి.

ఏ దేశమయినా జనాభా ఎక్కువ కాకుండా వుంటే చాలు బాబు అని ప్రభుత్వం [అన్నిదేశాలు అంటోంది.

సంభవామి యుగేయుగే అన్న దేముడేమంటాడో యీ సమస్యకు!! ●

## నర్తకి, నటి

# ఉదయచంద్రిక

ఇంటర్‌వ్యూ: మోహన్‌కుమార్

ఫొటో: ప్రభాకర్



ఫిలాసఫీ ప్రొఫెసర్ భార్యగా 'మళ్ళీ పెళ్ళి' చిత్రంలో నటించి ఆంధ్ర ప్రేక్షకులచేత విశేషంగా కొనియాడబడిన కుమారి ఉదయచంద్రికను యిటీవల వాళ్ళింట్లో కలిసినపుడు ఎంతో హడావిడిగా ఉన్నట్లు కనిపించింది. 'హడావిడిగా ఉన్నట్లున్నారే?' అనడిగాము. అందుకామె చిరునవ్వు నవ్వి 'డాన్స్ రిహార్సల్స్ జరిగాయి. వాళ్ళను సాగనంపి వచ్చాను.' అంటూ కూచున్నది, మదిటిమీది స్వేద బిందువుల్ని నేప్‌కిన్‌తో అద్దుకుంటూ.

ఉదయచంద్రిక చక్కని నర్తకి. 'వీరమంత్రపురి' చిత్రంలో విజయలలితతో చేసిన పోటీ నృత్యమూ, ఎన్ఫర్ జోర్ నహీ, సుహాగన్ హిందీ చిత్రాలలో ఆమె నర్తించిన విధానం పరిశీలించినవారికి — నర్తకిగా ఉదయచంద్రిక ప్రావీణ్యం విశదం అవుతుంది. నృత్యాలపై బాల్యంనుంచీ ఈమెకు అభిలాష మెండు. తలిదండ్రులు ఈ అమ్మాయి ఉత్సాహాన్ని ప్రోత్సహించారు. శ్రీ మహదేవన్‌పిళ్లె, మోహన్‌రాజులవద్ద శాస్త్రీయమైన శిక్షణ పొంది, నాట్యంలో సుశిక్షితురాలయింది.

సుమారు ఏడేళ్ళక్రితం కుమారి ఉదయచంద్రిక తన పదమూడోయేట — మొదటిసారిగా 'ద్వైతాద్వైతం' తమిళ చిత్రంలో నృత్యం చేసింది. సినిమాలలో పాత్రనటం ఆ చిత్రంనుంచే ప్రారంభమైంది. ఇంతవరకు 20 కన్నడ చిత్రాలు, మూడు తెలుగుచిత్రాలు, రెండు మళయాళ చిత్రాలు, ఆరు తమిళచిత్రాలలోను నటించింది. ప్రస్తుతం— ఈ అమ్మాయి శ్రీ ఎం. ఎస్. రెడ్డి భారీయెత్తున నిర్మిస్తున్న పౌరాణికం 'శ్రీకృష్ణ విజయము'లో ఒక నృత్యం చేస్తున్నది.

మద్రాసులో పుట్టి పెరిగిన కుమారి ఉదయచంద్రిక, విద్యను కూడా ఇక్కడే అభ్యసించింది. ఈమె మాతృభాష తెలుగు. 'తెలుగువారి అమ్మాయినై ఉండి, తెలుగు చిత్రాలలో వేషాలు లభించక పోవడమే విశేషం!' అన్నది, ఉదయచంద్రిక—'విశేషమేమిటి?' అని నేను అడిగినపుడు ... ఆ మాట అన్నపుడు అందమైన ఆమె మొహంలో అవ్యక్తమైన ఆవేదన దోబూచులాడింది. నర్తకి గానే కాక నటిగా కూడా చక్కటి ప్రతిభా విశేషాలను సంతరించుకున్న కుమారి ఉదయచంద్రిక, అందచందాల్లోనూ ఏమాత్రం తీసిపోదు. వీటన్నిటితోపాటు మంచి ప్రవర్తన, అంతకు మించిన మంచి సంస్కారం కలిగిన యీ అమ్మాయిని పరిశ్రమ ఆదరించడంలో ఎంతో ఔచిత్యం ఉంటుంది.

తీరిక వేళల్లో డాన్స్ ప్రాక్టీస్ చేయడం, పుస్తకాలు చదువుకోవడం, కారమ్స్ ఆడుకోవడం — ఉదయచంద్రిక సరదాలు. స్నేహితుల్ని రిసీవ్ చేసుకోవడం, మంచి చిత్రాలు చూడటం కూడా ఆమె సరదాలలో ఒక భాగం.

'నటించడానికి అవకాశం వున్న పాత్ర లభించినపుడు — ఆ వేషానికి న్యాయం చేకూర్చి, ప్రేక్షకుల అభిమానం పొందేందుకు కృషి చేస్తాను. ఇంతకన్న నేను చెప్పేదేమున్నది?' అన్నది ఉదయచంద్రిక...నిజమే, అందుకోసమే ఆమె ఎదురు చూస్తున్నది; అలాంటి అవకాశం కోసమే నిరీక్షిస్తున్నది! ●



'సుగుణసుందరికథ'లో ధంశ్రీ.



'ఆడజన్మ'లో మాలతి, జమున.

చిత్రసమీక్ష:

# ఆడజన్మ

ఏ చిత్రమైనా సరే — జనాన్ని ఎంతగ ఏడిపిస్తే అది నిర్మాతని అంతగా సంతోషింప జేస్తుంది — అని సినిమా పరిశ్రమ భాష! స్త్రీల బల హీనతని కనిపెట్టి ప్రయోజన కరంగా వినియోగించు కుంటున్న నిర్మాతలు అదృష్టవంతులు!

విజయలక్ష్మి మూవీస్‌వారి 'ఆడజన్మ' టైటిలే స్త్రీలమీద అంజనం వేస్తుందని వేరే చెప్పక్కరలేదు. అంతకంటే మించిన కథావస్తువు ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తుంది

'కష్టసుఖాలు కావడికుండలు' అనే సూక్తిని సెల్యులాయిడ్‌మీద చెక్కిన ఈ చిత్రం కథ ఎక్కడిదైనా-ఎప్పటిదైనా— కొన్ని సన్నివేశాలు చిత్రానికి ప్రాణం పోశాయి. అవే ఈ చిత్రానికి ప్రత్యేక ఆకర్షణలు!

అత్తవారింటికి అవిటివాడైన భర్త బండిలోనే వస్తూ భర్తని గుర్తించలేని జమున పరిస్థితి ఎంతగా కదిలిస్తుందో — అవిటివాడుగా హరనాథ్ పులితో పోరాటం అంతగానూ హృదర గొడుతుంది. దర్శకుడు ఎస్. ఎస్. మూర్తి ప్రతిభా విశేషానికి ఈ రెండు సన్నివేశాల చిత్రీకరణ మచ్చుతునకలు.

ప్రధానపాత్రలో జమున — ఒక తరం స్త్రీకి ప్రతిబింబంగా నటించడంతో ఆమె అద్వితీయంగా ప్రకాశించింది. చిత్రానికి టైటిల్‌కి నిండుతనాన్ని తెచ్చింది ఆమే అని చెప్పాలి. ఆమె భర్తగా హరనాథ్ నటన ఎంతో ప్రజ్ఞాయుతంగా వుంది. గ్లామర్ పాత్రలోనే కాదు, అవిటివాని పాత్రలోకూడా తనకు తానే సాటి అనిపించుకున్నాడు హరనాథ్. రాజ్‌బాబు కేవలం హాస్యాన్నేకాకుండా చక్కని సెంటిమెంటునుకూడా పోషించడం ఒక విశేషం. నాగభూషణం నటన కథని బాగా రాణింప జేసింది. గీతాంజలి నటజీవితానికి ఈ చిత్రంలో పాత్ర చక్కని మలుపు! చంద్రమోహన్‌పాత్ర చిన్నదయినా నటనతోనే ఆ పాత్రను నిలబెట్టాడు మాలతి, సత్యనారాయణ, విజయశ్రీ మొదలైనవారు తదితర ముఖ్యపాత్రలని పోషించారు

మాస్టర్ వేణు సంగీతం చిత్రం స్థాయిని నిలబెట్టింది. కన్నప్ప కెమెరా వర్కు ప్రశంసనీయంగా వుంది. భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు రాశారు. అసభ్యత అవలేశమైనా లేకుండా జి. వి. ఎస్. రాజు నిర్మించిన ఈ చిత్రం స్త్రీలేకాదు, సకుటుంబంగా చూడతగిన చిత్రం.

—సిశరాజా ●

## అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్

ఈ సంస్థ హైదరాబాదులో కొత్తగా నెలకొల్పబడింది. దీనికి శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు అధినేత. వీరు తమ ప్రథమ ప్రయత్నంగా ఒక చక్కటి చిక్కటి కుటుంబ గాథను తెరకెక్కిస్తున్నారు. కథ, మాటలను పినిశెట్టి సమకూర్చారు. ఈ చిత్రానికి రాజేశ్వరరావు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, జి వి సుబ్బారావు శిల్పాన్ని, ఎం. ఎస్. మణి కూర్పును, ఆర్. శ్రీనివాసరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

* * *

పై సంస్థ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగేశ్వరరావు, శారద, కాంచన, గుమ్మడి, నాగభూషణం, అల్లు రామలింగయ్య, రావి

# సినిమా

కొండలరావు, చంద్రమోహన్, సూర్యకాంతం, రమాప్రభలు ధరిస్తున్నారు. సారథి స్టుడియోలో నిర్మితమయ్యే ఈ చిత్రానికి శ్రీ వి. మధుసూధనరావు దర్శకుడు.

## రమణమూర్తికి పునర్జన్మ

'పెళ్లితాంబూలం' చిత్రం తరువాత రమణమూర్తిని మన పరిశ్రమ సరిగా ఉపయోగించుకోలేదనే చెప్పాలి. దురదృష్టవశంగా పరిశ్రమచే శపించబడ్డ వ్యక్తులలో రమణమూర్తి ఒకరు. రమణమూర్తికి శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు ఒక ముఖ్యపాత్రను ఇచ్చారు. రమణమూర్తి ఈ సదవకాశాన్ని సద్వినియోగపర్చుకుంటే, మరికొన్ని చిత్రాలు రావడం తథ్యం.

# సినిమా డైరీ

● అన్నపూర్ణా ఆర్ట్స్ పిక్చర్స్‌వారి ప్రథమ సాంఘిక చిత్రం యొక్క షూటింగు సారథీ స్టుడియోలో సెప్టెంబరు 2 వ ప్రారంభమైంది. శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీ వి. మధుసూదనరావు దర్శకుడు.

● జగపతి ఆర్ట్స్ పిక్చర్స్‌వారి 'దసరా బుల్లోడు' ఈస్ట్‌మన్‌కలర్ పిక్చరు షూటింగు సారథి స్టుడియోలో ఆగస్టు 24 నుండి 30 వరకు జరిగింది. శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకత్వంలో నటీనటులందరూ పాల్గొన్నారు.

● ఫిలిమ్ క్రాఫ్ట్స్ వారి 'దేశమంటే మనుషులోయ్' షూటింగు ఆగస్టు 25, 26 తేదీల్లో వాహిని 8 వ ఫ్లోర్‌లో జరిగింది. విజయలలిత, రాజబాబులకు సంబంధించిన దృశ్యాలను శ్రీ సి. ఎస్. రావ్ చిత్రీకరించారు.

● విజయనిర్మల, ఎన్టీరామారావు నాయకీ నాయకులుగా నటించిన 'మారిన మనిషి' సెప్టెంబరు 28 న విడుదలవుతుంది. ఈ చిత్రానికి సి. ఎస్. రావ్ దర్శకుడు.

● రేఖా అండ్ మురళీ ప్రొడక్షన్స్ వారి 'మిడతంబొట్లు' షూటింగు వాహిని 8 వ ఫ్లోర్‌లో ఆగస్టు 22 నుండి 25 వరకు జరిగింది. ఈ చిత్రానికి పద్మనాభం దర్శకుడు.

## రాజబాబు ప్రవేశం

నాకు అన్నపూర్ణా ఆర్ట్స్ పిక్చర్స్‌లో కామెడీ వేషం దొరకడం నా అదృష్టం, అన్నారు రాజబాబు. గత అయిదారు సంవత్సరాలుగా 'నాకు శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు గారి పిలుపు ఎప్పుడొస్తుందా అని వేచి వున్నాను. ఇప్పటికి ఆ ఛాన్సు దొరికింది' అన్నాడు. అలాగే విజయలలిత

సినిమా

కూడా మధుసూదనరావు గారి పిక్చరులో ప్రథమంగా నటిస్తోంది.

## కాంచనకు టర్నింగ్ పాయింట్

భగీరథమ్మాల్ వీధిలోని అన్నపూర్ణా ఆఫీసులో శ్రీ దుక్కిపాటి మధుసూదన రావుతో మాట్లాడుతున్న సమయంలో దర్శకుడు శ్రీ వి. మధుసూదనరావు అక్కడికి వచ్చారు. 'అక్టోబరులో మొదలు పెట్టే 'గజ్జెపూజ' చిత్రంలో కాంచన ధరిస్తున్న పాత్ర అపూర్వమైనది, క్లిష్టమైనది. ఈ చిత్రం విడుదలయితే మన ప్రేక్షకులు కాంచన నటనకు జేజేలంటారు' అన్నారు శ్రీ వి. మధుసూదనరావు.

* * *

ప్రసాద్ స్టూడియోలో 'శ్రీకృష్ణ విజయము' షూటింగు జరుగుతూ ఉంది.



'ఇద్దరమ్మాయిలు'లో వాణిశ్రీ

ఆది దర్బారు సెట్టు. ఆ రోజు షూటింగులో పాల్గొనడానికి వచ్చిన శ్రీ ఎస్వీ రంగారావు, జయలలిత గార్లు కూర్చుని వున్న చోటికి వెళ్లి కూర్చున్నాను

## జయలలిత విదేశయాత్ర

'నమస్కారమండీ, జయలలితగారూ! మీరు విదేశాలకు వెళ్తున్నారట, నిజమేనా' అని అడిగాను. 'అవునండీ. జపాన్‌కు వెళ్తున్నాను — మరికొన్ని ప్రదేశాలను



మాధవీ కంబైన్స్‌లో లక్ష్మి, నాగేశ్వరరావు.

కూడా కవర్ చేస్తాను. నేను టూర్ ముగించి రాగానే మీకు 'నా విదేశ అనుభవాలను వివరంగా చెప్తాను' అన్నారు.

*　　*　　*

'దేశమంటే మనుషులోయ్' చిత్రంలో మీ నటన సుపర్బ్ అన్నాను రంగారావుతో. 'ఎలా?' అని అదోలా చూచారు. 'కన్న కొడుకును దూరం చేసుకున్నందుకు ఒక ప్రక్క క్షోభ, బాధ్యతా నిర్వహణకోసం మీరు ప్రదర్శించిన హుందాతనం — మీనటనలో ఎంత కాంట్రాస్ట్, మీ టైమింగ్ సెన్స్ మార్వెలెస్' అని అభినందించాను. థాంక్యూ అంటూ తన చిన్ననాటి ముచ్చట్లు చెప్పసాగారు.

## మీకు తెలుసా?

నటి సరోజాదేవికి ఒక పూలతోట వుంది. అక్కడ మనోరంజితం పూల చెట్లు ఎక్కువ. ఆ పూలను సరోజాదేవి ప్రతిరోజూ సెట్సుకు తీసుకొచ్చి, అందరికీ పంచి పెడుతుంది.

నటి షర్మిలా టాగూర్‌కు ఆగస్టు 16న బొంబాయిలోని ఒక నర్సింగ్ హోంలో మగశిశువు పుట్టాడు.

హిందీ విలన్ నటుడు ప్రాణ్ ఎంత చిన్నపాత్రనయినా ధరిస్తాడు. కాని, ఆయన తీసుకునే రేటును మాత్రం తగ్గించడట.

ఇటీవలే పెండ్లి చేసుకున్న నటి లక్ష్మి తన భర్తతో సింగపూర్‌కు "హనీమూన్‌కు" వెళ్తుందట.

## చిన్ననాటి ముచ్చట్లు

"నేను ఆంటోనీ పాత్రను నా 11వ ఏటనే ధరించాను. ప్రేక్షకులు నేను చెప్పిన ప్రతి డైలాగును మెచ్చుకుంటూ చప్పట్లు కొట్టడమే, నాలో మరింత కృషి చెయ్యాలనేడి పట్టుదలను యేర్పరచింది. నేను స్కూల్ ఫైనల్ చదివే టప్పుడు షైలాక్ వేషం వేసి రసజ్ఞులను మెప్పించాను. నేను చదువులో ఎంత బ్రిలియంట్‌గా వుండేవాడ్నో, అల్లరిలోకూడా అంతేనంటూ ఒక సన్నివేశాన్ని చెప్పారు. అది మీకూ చెప్తాను.



'బొమ్మలాట'లో జయలలిత.

'ఒకరోజు — మే ఫస్టు అనుకుంటా — మా టీచరు మమ్మల్నంతా ఒక్క నిమిషం మౌనంగా వుండాలని ఆదేశించారు. నేను ఏం చేశానో తెలుసా? అలారం టైంపీస్‌కు సరిగా అదే టైంకు అలారం బెల్ రింగ్ అయ్యేలా కీ యిచ్చి మాష్టరుగారి బల్ల క్రింద వుంచాను. మా టీచర్ రావడం, మమ్మల్ని లేచి మౌనంగా వుండమనడం, నేనువుంచిన గంట సరిగ్గా మ్రోగడం ఒక్కుమ్మడిగా జరిగింది. నా స్నేహితు

అందరూ మౌనమున్నారు. ఆకవి వేనే చేసినవి మా మాష్టారికి యేం తెలుసు. పాపం!' అని విట్టూర్చారు రంగారావు.

## నిర్ణయమైన మూడవ చిత్రం

'నిండు మనసులు' 'నిండు హృదయాలు' రెండు నిండుగా నూరురోజుల పండుగను చేసుకున్నాయిగా. ఇప్పుడు ఎస్. వి. ఎస్. పిక్చర్స్ తమ మూడవ చిత్రానికి 'నిండు దంపతులు' అని పేరు పెట్టారు. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వాన్ని శ్రీ కె విశ్వనాథ్ నిర్వహిస్తున్నారు మాటలను సముద్రాల, సంగీతాన్ని టి వి రాజా సమకూరుస్తున్న యీ చిత్రంలో కథానాయకునిగా శ్రీ ఎన్టి రామారావు నటిస్తున్నారు. నాయికపాత్రలను సావిత్రి, వాణిశ్రీ, విలన్‌గా సత్యనారాయణ, కమెడియన్‌గా రాజబాబు నటించే యీ చిత్రాన్ని జగన్నాథరావుగారు నిర్మిస్తున్నారు.

*   *   *



'బంగారు కుటుంబం'లో కృష్ణ, విజయనిర్మల.

## సినిమా

ఆగస్టు 26న రెండు కొత్త సాంఘిక చిత్రాలు ప్రారంభమయ్యాయి ఒకటి శారదా స్టుడియోలో, మరొకటి వాహినీ స్టుడియోలో. శారదాలో నవరత్న ఆర్ట్స్ వారి సాంఘికానికి శ్రీ ఏ ఎల్ శ్రీనివాసన్ క్లాప్‌కొట్టారు వాహినిలో నందిని ఫిలింస్‌వారి సాంఘికానికి శ్రీ నాగిరెడ్డి క్లాప్‌కొట్టారు



'దేశమంటే మనుషులోయ్' లో శోభన్‌బాబు, చంద్రకళ.

## వీణమీద మణిహారాలు

వాహినీ రెండవ ఫ్లోర్‌లో నందినీ ఫిలిమ్స్‌వారి 'అత్తలూ – కోడళ్లు' చిత్రానికిగాను ఒక బంగళా సెట్టు నిర్మించబడింది. ఒక దివాన్‌మీద మణిమాల వయ్యారంగా కూర్చుని, వీణను అమోఘంగా మీటుతూ, సుశీల పాడిన పాటకు పెదవులను కదిలిస్తూ వుండింది ఆ పాటను ఆచార్య ఆత్రేయ భావగర్భితంగా వ్రాసారు. సుశీల, కె వి మహదేవన్ సంగీత సారథ్యంలో మధురాతి మధురంగా పాడింది. ఆపాట పల్లవి

'ఈ వీణ పలికించు ఎన్నిరాగాలో
నాలోన పలికించు ఎన్ని భావాలో'.

*   *   *

'అత్తలూ — కోడళ్లు' చిత్రంలో వాణిశ్రీ, కృష్ణతో నటించడం ఒక విశేషం శ్రీ పి చంద్రశేఖరరెడ్డి డైరెక్టు చేస్తున్న ఈ చిత్రానికి పినిసెట్టి మాటలను, మహదేవన్ సంగీతాన్ని, కృష్ణారావు శిల్పాన్ని, సత్యం కూర్పును, స్వామి ఛాయను, నిర్మాణ నిర్వహణను పి వి రమణయ్య, సహకార దర్శకత్వాన్ని మన్నె రాధాకిషన్ నిర్వహిస్తున్నారు.

చిత్రంలోని ముఖ్య పాత్రలను నాగభూషణం, అల్లు రామలింగయ్య, రాజబాబు, పేరుమాళ్ళు, కె. వి. చలం, వల్లం నరసింహారావు, రావికొండలరావు, మణిమాల, సూర్యకాంతం, హేమలత, ఛాయాదేవిగార్లు పోషిస్తున్నారు. శ్రీ ఎస్. సుబ్బారాయుడు, జె. ఎ. రామసుబ్బయ్య నిర్మిస్తున్న ఈ చిత్రానికి శ్రీ ఫిలింప్ పంపిణీ.

* * *

శారదా స్టుడియోలో నవరత్నా ఆర్ట్సువారి చిత్రానికిగాను ఒక పూజా మందిరం సెట్టు వెయ్యబడింది. నీలమేఘ శ్యామలుడయిన శ్రీ కృష్ణుని విగ్రహంముందు విజయనిర్మల భక్తి పారవశ్యంతో పాడిన ఒక పాటను దర్శకుడు అనిసెట్టి అప్పారావు చిత్రీకరించారు.

* * *



'నా తమ్ముడు'లో భారతి



ఖాకా కథ

'కాకా' అనేది అన్ని రంగాల్లో వలెనె సినిమా రంగంలోనూ విస్తృతంగా ఉన్న చిన్న విషయం జనానికి బాగా తెలిసిపోయింది. కాల్‌షీట్ల కోసం నిర్మాతలు నటీ నటుల్ని, చిత్రాలకోసం దర్శకులు నిర్మాతల్ని, ప్రచారం కోసం తారలు పాత్రికేయుల్ని ఇలా రకరకాలుగా 'కాకా'లు పడుతూంటారని చెప్పుకుంటూ ఉంటారు.

ఇందులో నిజా నిజాలు ఎంత ఉన్నప్పటికీ, ఎవరు ఏమనుకొన్నప్పటికీ మొత్తానికి 'కాకా' అనే వస్తువు సినిమా పరిశ్రమలో బాగా పాతుకుపోయి ఉన్నట్లు తేలిపోయింది. అందువల్ల ఎందరో పైకి వచ్చేస్తున్నారన్న విషయాలు కూడా ఎప్పటికప్పుడు రుజువై పోతూనే ఉన్నాయి[ట!] జరుగుతున్న చరిత్రల ద్వారా.

కనీసం మూడో నెలకైనా.

అయితే ఎవర్ని ఎప్పుడు ఎక్కడ ఎలా కాకా పట్టాలో అలా పట్టగలిగినవాడు పట్టగలిగిన వాడు మర్నాటికో, మూడోరోజుకో కనీసం మూడో నెలకయినా గొప్ప వాడుగానో, పెద్ద వాడుగానో లేక పెద్ద గొప్పవాడుగానో అయిపోవటం ఖాయం. ఇది ఆడవాళ్లలో— ముఖ్యంగా ఆడ తారల విషయంలో అయితే మరింత లేసుగా ఉండి అనతి కాలంలోనే తారాపథంలో శిఖరాగ్రాలకు ప్రాకేస్తారని— 'కాకా తారీయము'గా కొందరు పెద్దలచే చెప్పబడుతున్న ఒక సంఘటన నిర్ధారణ చేస్తున్నది.

కాకాతారీయము

'కాకా తారీయము' అనగా కాకా పట్టిన ఒక చక్కని తార వృత్తాంతము. 'పేరున్న' ఆ తార పేరు మనం చెప్పటం లేదు

కాకాతారీయము

కాబట్టి, ఇపుడిపుడే పైకివస్తున్న ఆమెని వర్ధమానతార అని పిలుచుకుందాం.

ఆ వర్ధమాన తార, అంతర్జాతీయంగా కూడా ఖ్యాతి బడసిన ఒక ప్రముఖ నటుడి పాదాలకు నమస్కరిస్తున్నట్లు ఉన్న ఒక ఫోటోని — అమధ్య ఒక ఆంగ్ల వారపత్రిక ప్రచురించింది. ఆ ఫోటోను ప్రచురిస్తూ దానికింద 'తారలు పైకి రావటానికి చేస్తున్న కాకా ప్రయత్నాలు'' అంటూ వ్యాఖ్యానించింది.

భక్తి గౌరవాలా?

పత్రిక విడుదలయింతర్వాత వర్ధమాన తార చూసింది. చూశాక ఏమనుకుంటుందో రాయక్కర్లేదు. ఆమె తాలూకు ప్రతినిధి ఒకరు ఆ పత్రికకు 'అది కాకా పట్టడం కాదు. బిగా — నటనలో తన కన్న పెద్దవాడు, అనుభవజ్ఞుడు అయిన ఆ నటుని పట్ల కనపర్చుతున్న భక్తి గౌరవాలు'' అని లేఖ రాశాడు.

అపుడు అచ్చువుతున్న సంచికకి వర్ధమాన తార తాలూకు ప్రతినిధి రాసిన వాక్యాలు అచ్చువేస్తూ, దానికింద 'వారె—వా' అంటూ కామెంట్ చేసింది పత్రిక మళ్లీ. "కాకా అనే పదాన్ని భక్తి గౌరవాలుగా వాళ్ళు అంత భక్తితో అన్వయించుకోవటాన్ని చూసి మెచ్చుకుంటూ ఇచ్చిన కాంప్లిమెంటే ఆ వారె—వా'' అంటూ ఫ్రెండ్ ఒక ఫ్రెండ్.

శభాష్ కాకా

ఇపుడు చిన్న తారయి పోయిన ఒక పెద్దతార మళ్లీ తన కోసం కోసం, బిజీ స్టార్‌గా చలామణి అవటంకోసం ఒక టాప్ రాంకింగ్ హీరోను కాకా పడుతున్నదిట! అందుకని పబ్లిక్ ఫంక్షన్‌లోను, ఇన్సైడ్ లోను అతని భుజాలకు రాసుకు తిరుగుతూ, అతని సరసన కూచుని ఒడిలో వాలిపోతున్నదిట!

నిజమా! అయితే శభాష్ కాకా! కాకా ఎల్లవేళలా చెల్లుబడి కావాలి. కాకా వర్ధిల్లాలి! అని మనమంతా ఎంతో సంతోషించాలి. మెచ్చుకోవాలి.

అందుకే ఇది కాకా తారీయము.

— మోహన్ కుమార్ ●

పై చిత్రంలో విజయనిర్మల, హీరో హాన్ నాయకీ నాయకులుగా నటిస్తున్నారు. నవరత్న యూనిట్ తయారు చేసిన కరుణ



'ఇంటి గౌరవం'లో జానకి, అరుణ.

## సినిమా

విటల్ ముంతాజ్ సంగీత సారధ్యం వహిస్తున్నారు. ఈ చిత్రంలో విజయనిర్మల ద్విపాత్రాభినయం చేస్తూంది. ముఖ్య భూమికలను రామ్మోహన్, రమణారెడ్డి, పెరుమాళ్లు ధరిస్తున్నారు.

## అసాధ్యుడు మన గాయకుడు

విజయా గార్డెన్స్‌లో 'రైతే రాజు' పాట రికార్డింగు జరిగింది. మీ అభిమాన గాయకుడు, ఘంటసాల మైకుముందు పాడడానికి రెడీగా నిలుచున్నారు. సంగీత దర్శకుడు టి. వి. రాజు, స్టాన్స్ ఆఫ్, కమాన్ టేక్ అని తన అసిస్టెంట్స్‌ను ఆదేశించడంతో, స్వామినాథన్ సౌండును స్విచ్ఛాన్ చేసారు. ఘంటసాల గొంతువిప్పి పాడుతుంటే, ఆయన్ను యెవ్వరూ యిప్పట్లో రీప్లేస్ చెయ్యలేరని అనిపించింది.

* * *

కవి నారాయణరెడ్డిగారు వ్రాసిన ఆ పాటను మీకూ తెలియచేస్తాను.

"గెలిచిందెవరు
ఓడిందెవరు
విధి ఆడించిన చదరంగంలో"

ఈపాట 'రైతేరాజు' చిత్రంలో కాంతారావుపై చిత్రీకరింపబడుతుందని నిర్మాత



'జై జవాన్—జై కిసాన్' హిందీచిత్రం సాంగ్ రికార్డింగ్ సమయంలో సంగీత దర్శకత్వం వహిస్తున్న ఎ.వి రాజు, నిర్మాత యస్. కె అగర్వాల్ పర్మార్, దర్శకుడు జంబులింగం మొదలైనవారు.

కుదరవల్లి సీతారామస్వామి చెప్పారు. శ్రీ బి. బి. శ్రీనివాస్ డైరెక్టు చేస్తున్న యీ జానపదంలో కాంతారావు తండ్రి, కుమారుడిగా (రెండు పాత్రలను) నటిస్తున్నారు. జి. కె. మూర్తి వ్రాసిన కథలోని ముఖ్యపాత్రలను అంజలీదేవి, గీతాంజలి, రాజనాల, విజయలలిత, కె. వి. చలం, విజయశ్రీలు ధరిస్తున్నారు మాస్టర్ వర్పయ్య అనెడి మూడు సంవత్సరాల బాలుడు చిన్నకాంతారావు పాత్రలో నటిస్తున్నారు.

*  *  *



'రైతే రాజు'లో విజయలలిత, కాంతారావు.

హీరోయిన్ పాత్రను ధరిస్తున్న మిస్ లలిత పరిశ్రమతో సంబంధం లేకపోయినా, ఆమె తండ్రి ఒకప్పుడు తెలుగు చిత్రసీమలో ప్రముఖ నటునిగా వెలుగొందినవాడే. స్వర్గీయ సదాశివరావు గారి కుమార్తె ఈ లత.

—శ్రీనివాస్ ●

## అవీ.. ఇవీ :

హైదరాబాద్‌లోని 'సింథటిక్ డ్రగ్స్ రిక్రియేషన్ క్లబ్' వారు స్వతంత్ర దినోత్సవాలని నాటక ప్రదర్శన, బుర్రకథ మొదలయిన వేడుకలతో జరుపుకున్నారు ఫాక్టరీ జనరల్ మానేజర్ ఇద్దరు ఉద్యోగులకి వారి కృషిని గుర్తించి ప్రత్యేక బహుమతులు ఇచ్చారు [ఒ. వి.]

## అక్కినేని నాగేశ్వరరావు అవార్డులు

అక్కినేని నాగేశ్వరరావు లిటరరీ అవార్డ్సు కమిటీ విజేతలకు విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో పార్లమెంటరీ వ్యవహారాలమంత్రి డా. కె. రఘురామయ్య గారు బహుమతులను ఇచ్చారు. సభకి శ్రీ వి. ఆర్. నార్ల అధ్యక్షత వహించారు. బహుమతుల వివరాలు: శ్రీ పోరంకి దక్షిణామూర్తి [ముత్యాల పందిరి] నవలకి బంగారు పతకం, శ్రీ యస్ ఆర్ నంది [నైమిశారణ్యం] రజత పతకం బంగారు పతకం [కథలకి] నందుల వెంకటేశ్వరరావు [విరిగిన అలలు], రజతపతకం కె. ఆర్ వసుంధర [వేషం] నాటకాల్లో బంగారు పతకం ఆర్ వి యస్ రామస్వామి [సుడిగాలి], రజిత పతకం గొల్లపూడి మారుతి రావు [కరుణించిన దేవతలు] నాటికల్లో బంగారు పతకం రావులతాతారావు [రిక్రియేషన్ క్లబ్], రజిత పతకం మద్దిసేటి రాధాకృష్ణమూర్తి [పరాజిత] కు లభించాయి.

*  *  *

హైదరాబాదులో కళాకుంజవారు ఈ మధ్య కుమారి శైలజ నృత్య ప్రదర్శనం, గవర్నరు శ్రీ ఖండూభాయిదేశాయి సమక్షంలో ఏర్పాటు చేశారు. [ఒ. వి.] ●

ప్రశ్నాపత్రం' పేర్న ప్రశ్నలు పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము. — సం॥



# పుస్తకాలు

## ర చ న

'యువ భారతి' ప్రచురణ [45 పుటల ప్రకటనలతో చేర్చి] 272 పుటలు. వెల: 5 రూ. ప్రచురణ—యువభారతి కింగ్స్‌వే సికింద్రాబాదు—3.

'మారుతున్న విలువలు — రచయితల బాధ్యతలు గోష్ఠి సందర్భంగా విభిన్న దృక్కోణాలతో పరిశీలించిన ప్రముఖుల వ్యాసాల ముప్పై ఏడు. ప్రకటించబడిన సంపుటం యిది. మొదట్లో గోష్ఠి ఆవశ్యకతను గురించీ, యువ భారతి యింతవరకూ సాధించిన వాటిని గూర్చీ, యిక ముందు జరుపదలచిన కార్యక్రమాలను గురించీ దాని నిర్వాహకులు తెలిపారు. కేవలం నవ్య మార్గంపైనే పురోగతి ఆధారపడి ఉన్నదనే యువ రచయితలే కాకుండా ప్రాచ్య సంప్రదాయాలలో పండిపోయి—అన్నిమార్గాలనూ ఆమోదిస్తున్న ఆచార్య వెంకట రంగయ్యగారు, డాక్టర్ అవధానిగారు మున్నగువారి వ్యాసాలు కూడా ఇందులో ఉండటం విశేషం! మారిన—మారుతున్న విలువలనూ, విమర్శకుల—రచయితల, ప్రకాశకుల బాధ్యతలనూ, వివిధ దృక్పథాలనూ వివరించే చక్కని వ్యాసా లిందులో ఉన్నాయి.

'విలువలు' అనేది ఆంగ్లాన్ననుసరించి వచ్చిందనీ, పూర్వీకులు 'ధర్మం' అనే దాన్నే ఈ అర్థంలో వాడారనీ, ఐహిక సౌఖ్యమే జీవిత పరమార్థం కావడం అధికారంలో ఉన్నవారు సామాజిక నియమాలను విధించడం, సర్వ మానవ సమానత ఈనాటి విలువలలో ముఖ్యాలని శ్రీ వెంకటరంగయ్యగారు చక్కగా తెలిపారు. 'మారుతున్న విలువలు రచయితను మార్పుటంతో మాత్రమే సరిపోదు. రచయిత కూడ విలువలను మార్చాలి' అంటారు శ్రీ సంజీవదేవ్‌గారు. 'కవులను, రచయితలను మారుచున్న విలువల దృష్టితో, సానుభూతితో పరిశీలింపవలసిన యావశ్యకత సద్విమర్శకుల కెంత కలదో విమర్శకుల విమర్శలను పరిశీలించి తమ రచనలందలి దోషములను బరిహరించి వానిని గుణోత్తరములుగా చేయవలసిన యావశ్యకత రచయితలందును అంత కలదు. అంటారు డాక్టర్ వేంకటావధానిగారు. 'రచయిత విమర్శకుడు, కుల వైరులు కారు. దాయాదులు కారు. ఒకే చేతిలోని పక్క పక్క వేళ్ళ అంటే బాగుంటుంది' అంటున్నారు శ్రీ రమణారెడ్డిగారు. 'రచయిత సమాజంలో తాను నిర్వర్తించవలసిన గురుతరమైన పాత్రను గుర్తించి తదనుగుణంగా నడుచుకున్నప్పుడు ప్రభుత్వము, ప్రజల సహాయ సహకారాలు అతని అవశ్యం 'లభించి తీరుతాయి' అని హామీ యిస్తున్నారు సమాచార, పౌర సంబంధ మంత్రి శ్రీ వాసుదేవరావుగారు. రచయితకూ, ప్రచురణకర్తకూ పరస్పరానుకూల్యం ఉన్నప్పుడే మంచి రచనలు వెలువడతాయంటారు—ఎమెస్కో శ్రీ రావుగారు. ఈ విధంగానే 'ఇంతో అంతో' ప్రతిభ లేకుండా ఎవరూ రచన సాగించలేరనీ, 'పాఠకులకు అందించాలని అనందాన్ని రచయిత సృష్టిస్తే అది రచనా పరిధిలోనికి రాదనీ, 'సంఘంలో వస్తున్న మార్పుల ననుసరించి శాస్త్రీయ దృక్పథం కూడా మారాలనీ, గ్రంథాలయాలు పురగత కాలపు రచనలను భద్రపరుస్తూ కొత్త వాటిని సేకరిస్తూ ఉండాలనీ, సాహిత్యం జీవితానికి ప్రతిబింబంగా ఉండాలనీ నేటి రచనా భాషగా వ్యవహారభాషే ఉండాలనీ—ఈ విధంగా ఇంకా ఎందరో తమ తమ అభిప్రాయాలను విపులంగా తెలియజేశారు. ఇది మొదటి భాగంలోని విషయం. రెండో భాగంలో విమర్శ, నవల, కథానిక, నాటిక, కవిత, రేడియో రచన, సినిమా రచన పత్రికా రచన—అనే సాహిత్య విభాగాలలో ప్రతిబింబిస్తున్న—మారుతున్న విలువలను గురించి ఆ యా రంగాలలో పేరు పడినవారు రచించిన వ్యాసాలున్నవి. అవి కూడా విలువైనవే! ఈ విధంగా వివిధ దృక్పథాలలో ఉన్న రచనలను గూర్చిన వ్యాసాలను ఒకచోట చేర్చి ప్రకటించిన యువభారతి వారి ప్రయత్నం మెచ్చుకోదగినది. ఇదివరలో కవితా ప్రకటన మూలంగా చేసిన సేవకంటె ఈ వ్యాస ప్రకటన ఎంతో విలువైనది.

ఈ వ్యాసాలనుబట్టి చాలా మందికి—వెనుకటి సాహిత్యాన్ని విస్మరించినా బాధ లేదనీ, నూతన కవిత మాత్రం ఉపాదేయమనీ అభిప్రాయం ఉన్నట్లు తోస్తున్నది. విశిష్టమైన జ్ఞానాన్ని సంపాదించినప్పుడే రచయిత ఉత్తమ కృతులను అందివ్వగలుగుతాడు. ఆ జ్ఞానం కలగడానికి వెనుకటి గ్రంథాలు తప్పక కావాలి. ఈ విషయటున్ని విస్మరించకూడదు.

నేటి సాహిత్యంలో కాల ప్రవాహాన్ననుసరించి మారిన, మారుతున్న విలువలను గురించీ, రచయితలు మున్నగువారి బాధ్యతలను గురించీ, విభిన్న దృక్పథాలను గురించీ తెలుసుకోవాలంటే ఈ 'రచన'ను తప్పక చదవవలసి ఉన్నది. —అంగీరస

## బా ల ధ్రు వు డు

చిన్నపిల్లల నాటకం. తెనుగుసేత ఆర్వీ యస్. సుందరం. 60 పైసలు. మానససరోవర ప్రచురణలు. 16/333 కానుఖేల అగ్రహారం, నెల్లూరు.

## క ళా మ యి

నాటకం. ఆర్. వి. యస్. రామస్వామి. వెల రెండున్నరరూపాయలు. స్టూడెంట్సు బుక్ సెంటరు ఏలూరురోడ్, విజయవాడ—2.

## వ ల

నాటిక. రచయిత: పూసల, వెల: రూపాయిన్నర. స్టూడెంట్సుబుక్‌సెంటరు; ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## మన్యవిప్లవం

అల్లూరిసీతారామరాజు నాటకం. రచయిత శ్రీ పినపోతు ఆదిమూర్తి వర్మ. రెండు రూపాయలు. ఆంధ్రవీర పబ్లికేషన్స్, తూరంగిపోస్టు, కాకినాడ—2

## గాంధీపథము

పద్యాలు. శ్రీ బిజివేపల్లి లక్ష్మీకాంతంగుప్త. రెండురూపాయలు. గాంధిసాహిత్య ప్రచురణాలయం, హైదరాబాదు—20. ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

మొదటినుండి ఎరువులు వాడటానికి యిష్ట
పడని చలమయ్య, ఒకసారి గ్రోమోర్ వాడి
అదనపు రొఖ్ఖం సంపాదించి, ప్రతి పైరుకు
గ్రోమోర్ వాడటం మొదలు పెట్టాడు.

**ఎందుకో తెలుసా?**

ఏటేటా పైరు పండించడం వలన భూమిలో
కరిగే పోషక పదార్థాలు తిరిగి భర్తీ చేయక
పోతే దిగుబడి తగ్గుతుంది. గ్రోమోర్
ఎరువులు, అమోనియా రూపంలో అందే
నత్రజని, అంతా నీటిలో కరిగే
భాస్వరామ్లం, సమానంగా ఎక్కువగా
కలిగి వుండంచేత పైర్లకు పూర్తి
పోషణనిస్తాయి. గ్రోమోర్ ఎరువులు
వరి, చెఱకు, జొన్న, మిరప—అన్ని
పైర్లకు తప్పక వాడి ఎక్కువ పండించండి.




గ్రోమోర్ ఎరువులు గుళ్లు గుళ్లుగా
వుండం వల్ల, చల్లడానికి, మొక్క
మొక్కకూ వేయడానికి, గొర్రుతో
వేయడానికి వీలుగా వుంటాయి గ్రోమోర్
22-22-11 లోని పొటాషు కూడా నీటిలో
పూర్తిగా కరుగుతుంది.

గ్రోమోర్ ఎరువులకయ్యే ప్రతి రూపాయి
ఖర్చుకూ కనీసం మూడు రెట్లు లాభం వస్తుంది.
ఇకనుంచీ ఎరువు అని అడక్కండి.
గ్రోమోర్ అనే అడగండి.

గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 28-28-0
గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 20-20-0
గ్రోమోర్ యన్.పి.కె 22-22-11
గ్రోమోర్ యూరియా 46-0-0

coromandel gromor
**కోరమాండల్ ఫెర్టిలైజర్స్**

## చేనుకు చేవ, రైతుకు రొఖ్ఖం చేకూర్చుటలో పెట్టింది పేరు—

# గ్రోమోర్



గ్రోమోర్ ఎరువుల వ్యాపార వివరములకు సంప్రదించండి.
ప్రధాన పంపిణీదారులు ఇ.ఐ.డి. ప్యారీ లిమిటెడ్, 66 రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్

